# సంపెంగ పొదల



శ్రీమతి సి. ఆనందారామం



వ్యవస్థాపకులు:
శ్రీ అడపా వెంకటస్వామినాయుడు

సంపాదకులు—.
అడపా శివాజీనాయుడు

౭

# మా మాట

ఇది 'అమర సాహితి' అందిస్తున్న చతుర్థ పుష్పం. ఆంధ్ర సచిత్ర వార పత్రికలో ధారావాహినిగా వెలువడిన నవల 'సంపెంగ పొదలు'. ప్రఖ్యాత రచయిత్రి శ్రీమతి సి. ఆనందారామం రచన కావడం ముదావహం.

త్వరలోనే ఉత్తమ నవలలు, కావ్యాలు, నాటికలు, నాటకాలు వెలువరించబోతున్నాము.

ఉత్తమ సాహిత్యాన్ని అందించే సంకల్పంతో నెలకొల్పిన 'అమర సాహితి' అశేష పాఠకుల ఆదరాభిమానాలను చూరగొంటుందనీ, మా కృషి ఫలప్రదమౌతుందనీ ఆశిస్తున్నాము.

అమర సాహితి — సంపాదకులు.

10–8–1964.

1

# పీఠిక

*ఈ నవల గురించి :*

కల్లకపట మెరుగని స్వచ్ఛమైనవి పసిమనసులు. ఎంత స్వచ్ఛమైనవో, అంత సున్నితమైనవి. ఎంత సున్నితమైనవో అంత లోతైనవి. తెలిసో తెలియకో, మనమా లేత మనసులపై వేసేముద్రలు భవిష్యత్తులో ఎలాంటి విచిత్ర పరిణామాలకు దారితీస్తాయో, ఎవరూ ఊహించ లేరు.

మేనత్త మేనమామ బిడ్డలనో, లేక వరుసైన వారినో చూసినపుడు, మనం తటస్థంగా ఊరుకోలేము. భార్యాభర్తలుగా వారిని వ్యవహరించి తీరుతాము. అది మన ముచ్చట. మన హాస పరిహాసాలు మనకు కేవలం కొద్దిపాటి సంతోషాన్ని కలిగించవచ్చు కానీ, అవి ఆ లేత మనసుల మీద ఎలాంటి ప్రభావాన్ని కలిగిస్తాయో, ఊహించము. సున్నిత హృదయులైతే, ఆ భావం వారిలో వేళ్ళూని వారితోనే పెద్దదవుతుంది. ఆ ప్రభావం ఇరువురిపైనా, ఒకే విధంగా ఉండక పోవచ్చును.

జీవితం ఎన్నడూ మనం ఊహించిన విధంగా ఉండదు. అనుకొన్నవి అనుకొన్నట్లు జరిగితే, ఈ సృష్టే లేదు.

ఒకనాటి తమ ఆశలన్నీ కలలవలె కరిగిపోయినపుడు సున్నిత హృదయులైన వారనుభవించే క్షోభ వర్ణనాతీతమైనది. ఈ రకమైన విచిత్ర సంఘర్షణలో నలిగిపోయిన వ్యక్తులు హారి, ఉమలు.

'అన్ని ఉన్నాయి అంచుకు తొగరొక్కటే తక్కువ' అన్నట్లు మనసునిండా మమకారం, చేతినిండా డబ్బు, కంటికింపైన సౌందర్యం

ఉండీ సరియయిన సంస్కారం కరువు కావటం వలన, తను సుఖపడ లేక, తానుచేపట్టిన వారిని సుఖపడనీయక, వ్యర్థంగా జీవితాన్ని నరకతుల్యం చేసికొన్న వ్యక్తి శంకర్.

అమాయకంగా అరాధించగలదే కాని, శృతిమించిన అహ్మా భావాన్నీ అధికారాన్నీ అర్థంచేసికోలేదు. ముక్కుకు సూటిగా తన విధ్యుక్త ధర్మాన్ని నిర్వహించగలదే కాని, లోకపుగడుసు పోకడల నెఱుగలేదు. ఆ కారణంగానే, ఇటు భర్తదగ్గిరా, అటు అత్తగారి దగ్గిరా, పరాజితురాలైన ముగ్ధ దుర్గ.

క్షణానికి కోటి విధాల పరుగులెత్తే మనసును నియమించటం మహా సంయమేంద్రులకు కూడా కష్ట సాధ్యమైన పని-పంచభూతాత్మక మైన ఈ శరీర మనుక్షణమూ, విచిత్రములయిన ప్రలోభాలకు గురి అవుతూనే ఉంటుంది. కానీ ఉత్తముడూ, సంస్కారీ అయిన మానవుడు తనను తానర్థం చేసికొని, తన సంస్కార బలంతో ప్రలోభాలను జయించి ధర్మమార్గంలో ముందుకు నడువగలుగుతాడు- అట్టి ఉత్తమ మానవుడు గిరి.

వరదవెల్లువలా మన దేశాన్ని తాకిన పాశ్చాత్య సంస్కృతీ ప్రవాహంలో పాత విలువలు నశించిపోయాయి. వరదతీసిన నేల, ఒక చోట పాడిగా, మరొచోట బురదగా, మరింకొక చోట నీటి గుంటలతో; ఒక స్థిరమైన ఆకారం లేకుండా ఉన్నట్లే ఈ నాటి మన సమాజంలో స్థిరమయిన విలువలు లేకుండా పోయాయి-అట్లాంటి స్థితిలో సంపెంగ పొదల వంటి మానవ జీవితాన్ని పై పాత్రల సహాయంతో చిత్రీకరించడానికి నేను చేసిన ప్రయత్నం మెంతవరకు ఫలవంత మైనదో, సహృదయులైన పాఠకులే నిర్ణయించాలి.

నా శక్తిలో నాకు నమ్మకం కలిగించి, నన్నన్నివిధాలా ప్రోత్సహించి, ఈ నవలా రచనకు కారకురాలయిన, నా మిత్రురాలు డాక్టర్ సరస్వతికి నా కృతజ్ఞతలు. ఈమె ప్రస్తుతం ఉస్మానియా విశ్వ విద్యాలయం మెడికల్ కాలేజిలో, ఫిజియాలజీ డిపార్ట్‌మెంట్‌లో పనిచేస్తున్నారు.

ఎంతో దయతో, దీనిని తమ పత్రికలో ప్రచురించి, ఆంధ్ర పాఠకలోకానికి నన్నొక రచయిత్రిగా పరిచయంచేసిన ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రిక సంపాదక మహాశయులకు నా హృదయ పూర్వక కృతజ్ఞతలు.

దయతో దీనిని తమ ప్రచురణకు స్వీకరించిన, అమరసాహితి సంపాదకులు, శ్రీ అడపా శివాజీ నాయుడిగారికెంతో కృతజ్ఞురాలను.

నన్నభిమానించిన పాఠకలోకానికి నా నమస్కారములు

—ఆనందారామం



# అంకితం

జగత్పిత శ్రీ తిరుమల వేంకటేశ్వరుని పాదపద్మాలకు

VII

ఆంధ్ర సచిత్ర వార పత్రికలో

సీరియల్ గా వెలువడిన నవల

ఆ ఉత్తరంపైన చిరునామా చూడగానే ఆ ఉత్తరం ఎవరు వ్రాసారో అర్థమైంది గిరికి. దస్తూరీ, మనుష్యుల స్వభావానికి కొంతవరకు నిదర్శనమంటారు.

ఈ విషయం ఎవరి విషయంలో ఎంతవరకూ నిజమో కానీ, హరి విషయంలో మాత్రం, నూటికి నూరు పాళ్లూ నిజం వంకరటింకరగా వాలిపోయినట్లుండే, ఆ అక్షరాలు హడావుడిగా పరుగు నడకతో వచ్చే హరిని గుర్తుచేస్తాయి.

హరి దగ్గర నుంచి తనకు ఉత్తరమనగానే దిగ్భ్రమతో కాసేపు మతి పోయినట్లనిపించింది. గిరికి.

ఆదుర్దాగా విప్పాడు.

“గిరికి,

నీతో అత్యవసరంగా మాట్లాడాలని మీ యింటికి వచ్చాను. నువ్వు లేవు. నీవు వీలైనంత తొందరలో వచ్చి నన్ను కలుసుకో! సాయంత్రం ఐదు తర్వాత ఇంట్లోనే ఉంటాను.

—హరి.”

ఎంతో పొడిగా ఉన్న ఈ ఉత్తరం గిరి మనసు కెలినట్లయింది. దిగులుగా సోఫాలో కూలబడ్డాడు. ప్రాణానికి ప్రాణంగా ఉండే హరి, ఈవిధంగా మారిపోయాడు—మనుష్యుల మధ్య ఇంత విచిత్రంగా అపార్థాలు ఎందుకు వస్తాయో, అనుకున్నాడు గిరి.

హరి, గిరిల పరిచయం ఈనాటిది కాదు. పసితనం నుంచీ కలిసి మెలిసి ఆడుకున్నారు. హరి చెల్లెలు దుర్గ-హరి, గిరి దుర్గ కలిసి బడికి పోయేవారు. కలిసి వచ్చేవారు. సాధారణపు చిలిపి తగవులు కూడా వాళ్ల మధ్య ఎప్పుడూ వచ్చేవికావు. బలపాలూ, పెన్సిళ్లూ, చాక్‌లెట్లూ, పిప్పరమెంట్లూ, కాళీ స్వీటు పాకెట్లూ, ఒకరి కోసరం ఒకరు తేలికగా త్యాగం చెయ్యగలిగేవారు—హరీ, దుర్గా. ప్రతి సెలవుల్లో వాళ్ల మేనమామగారి వూరికి వెళ్లేవారు. వాళ్లు వచ్చే వరకూ గిరికి పిచ్చెత్తినట్లుగా ఉండేది. వాళ్లు వూరినుండి వచ్చారని వినగానే తింటూన్న అన్న మైనా వదలి పరుగెత్తుకుని వచ్చేవాడు—హరీ, దుర్గా, వాళ్ల మేనమామగారి వూర్లో విశేషాలన్నీ ఏకరువు పెట్టేవారు. గిరి తమ స్వంత ఊరిలో విశేషాలను వివరించేవాడు. ఈవిధంగా బాల్యమంతా ఒక మధుర స్వప్నంలా గడిచి పోయింది.

ముగ్గురూ హైస్కూలు వదిలారు. దుర్గ చదువుకు స్వస్తిచెప్పి ఇంట్లో కూర్చుంది. హరి, గిరి కాలేజీలో చేరారు. వాళ్లకు వయసులలో మార్పు వచ్చింది. కానీ, మనసులలో ఏమీ మార్పు రాలేదు.

వెనుక, సెలవుల్లో మాత్రం మేనమామగారి వూరుకు వెళ్ళే హరి, ఇప్పుడు వీలు చిక్కినప్పుడల్లా వెళుతున్నాడు.

ఈ మార్పు గమనించిన గిరి హరిని కులాసాగా అడిగాడు, "ఏం హరీ ! ఈమధ్య మేనమామమీద మక్కువ పెరిగినట్లుందే !"

హరి ముఖం ఎర్రబారింది. ఒకసారి నవ్వి తల వంచుకున్నాడు. గిరి, హరి దగ్గరగా వెళ్లి భుజాలు పట్టుకుని వూపుతూ "ఈ పప్పులేం ఉడకవు ! పద ! కథ వినిపించు" అంటూ హరిని సోఫాలో కూలేశాడు.

హరి నవ్వుతూ "చెప్పడానికేం ? కానీ, ప్రేమ కథలు వినడానికి చాలా వోపిక ఉండాలి తెలుసా ?" అన్నాడు.

గిరి, హరి ప్రక్కనే కూర్చుంటూ, "కావలిసినదానికి రెట్టింపు ఉంది. మొదలు పెట్టు—పేరు ఉమ..."అన్నాడు.

హరి నవ్వాడు.

"నీకు బాగానే గుర్తుందే ! అవును. ఉమే ఈ కథానాయిక. చిన్నతనపు స్నేహమే ప్రణయంగా మారింది. నా మరదలే కనుక, పెద్ద వాళ్లు పెట్టే ఆటంకాలు కూడా ఏమీ ఉండవు. చదువులు పూర్తయ్యాక పెళ్లి చేసుకుంటాం. ఏం కథ కుతూహలజనకంగా లేదు కదూ !" అన్నాడు.

"ఇంటరెస్టింగ్‌గా లేని మాట నిజమే కాని, నేను ఇంకా కుతూహలం పుట్టిస్తా నుండు—ఉమతో నీ అభిప్రాయం చెప్పి, ఆమె సమ్మతి తీసికునే మాట్లాడుతున్నావా ? లేకపోతే ఇది నీ వూహాగానమా ? నిన్నొక ఆడది పెళ్లి చేసికొనేందుకు ఒప్పుకుందంటే నమ్మలేకపోతున్నాను మరి."

హరి కూర్చున్న చోటు నుంచి చటుక్కున లేచి

# 4

రోషంగా ముక్కుపుటా లెగరేస్తూ "అవునులే! లోకంలో అందరూ నీలాంటి అందగాళ్లే ఉంటారా?" అన్నాడు.

గిరి పకపక నవ్వుతూ లేచిన హరిని భుజాలు పట్టుకుని కూర్చోబెడుతూ "నా అంతా, ఇంకా నీకంటేనూ అందమైన వాళ్లు లక్ష మంది-కానీ, నీలాంటి తొందరపాటు మనుష్యులు మాత్రం ఎక్కడా ఉండరు." అని హరి ముఖాన్ని తన వైపుకు తిప్పుకుని "హరీ! చిన్నతనం నుంచీ, కలిసి మెలిసి తిరిగాం. నన్నే అర్థం చేసికోలేకపోతే నువ్వెవరి నర్థం చేసికోగలవో చెప్పు. నీ మేలు కోరేవారిలో నేనూ ఒకడినని నువ్వు నమ్మటంలేదూ?" అన్నాడు.

అంతలో హరి మనసు ఆర్ద్రమైపోయింది. గిరి చేతిని తన చేతిలోకి తీసికొని మృదువుగా నొక్కుతూ "ఏమీ అనుకోకు గిరీ! నాకు మరీ ఉద్రేకం ఎక్కువ. నా ఆత్మీయు లందరికంటే నువ్వే నాకు ఎక్కువ. అసలు ఒక రకంగా చెప్పాలంటే నేను నిన్నెంతో ఆరాధిస్తున్నాను" అన్నాడు.

గిరి, హరి వీపుమీద చరుస్తూ 'చాలు నాయనా, చాలు! ఈ ఆరాధనా వద్దు. ఆ ఆగ్రహమూ వద్దు-స్నేహమనే మాటకు అర్థం తెలిసికో చాలు! అసలింతకూ, ఆ అమ్మాయి అభిప్రాయం తెలిసికొన్నావా?" అన్నాడు.

"ఇంకా వేరే అడగట మెందుకు?"

"అంటే!"

హరి నవ్వాడు. కొన్ని క్షణాలాగి ఇలా అన్నాడు:

"ఒక రోజున ఉమ నాకు ఏకాంతంగా లభించింది. అలాంటి క్షణాలు చాలా అరుదుగా వస్తాయి. నేను సాహసించి పరాకుగా ఏదో చదువుతున్న ఉమ కళ్లు వెనుకనుండి మూసాను. ఉమ ఉలిక్కిపడి వెనక్కి నామీద వాలిపోయి "ఏమిటి బావా?" అంది గారాబంగా-ఆమె కళ్లు పెంకెగా నవ్వి నన్ను మరింత రెచ్చగొట్టాయి. నామీద ఒరిగిన ఉమను, నావైపుకు తిప్పుకుని, బలంగా గుండెలకు హత్తుకుని గట్టిగా ముద్దు పెట్టుకున్నాను. చిరునవ్వు నవ్వుతూ, మృదువుగా నన్ను విడిపించుకుని పారిపోయింది. అప్పటి ఆమె చిరునవ్వులో మెరుపులు, చెక్కిళ్లలో కెంపులు, కళ్లలోని పారవశ్యపు కాంతులు, ఆమె మనసు నాకు విప్పి చెపుతూంటే, ఇంకా నేను వేరే అభిప్రాయ మడగటం ఎందుకూ?"

కలలోని వాడిలాగ, అరమోడ్పు కనులతో చెపుతూన్న హరిని చూసి గిరి నవ్వుకున్నాడు. ఏ భావోద్వేగాన్నయినా, ఇంత తీవ్రంగా అనుభవించగలిగే హరి జీవితం సుఖమయ మవ్వాలని మనసులో కోరుకున్నాడు. ఇంతలో హరి కూర్చున్న చోటు నుంచి లేచి తన సూటుకేసు తెరిచి ఉమ ఫోటో తెచ్చి గిరి కిచ్చాడు. చాలా సామాన్యంగా ఉంది. అందగత్తె అని చెప్పడానికి కూడా వీల్లేదు. కానీ, ఈమాట గిరి పైకనలేదు. గిరి ఏమీ అనకుండానే హరి చెప్పాడు.

"ఉమ ముఖం ఫోటోజెనిక్ కాదు. ఫోటోలో అలా సామాన్యంగా ఉందని అందమైనది, కాదనుకో వద్దు—ఉమను చూస్తే నువ్వే నాకు పోటీకి రావచ్చు."

గిరి ఉలికిపడ్డాడు-"ఛీ! ఉమను నే నెప్పుడూ చూడక పోయినా, ఆమెను నీభార్యగానే వూహిస్తున్నాను. వేళాకోళంగానైనా అలా మాట్లాడకు హరీ! ఉమ నీ భార్య కావాలని నీకంటే కూడా నేనే ఎక్కువగా కోరుకుంటున్నాను."

గాఢానురాగాన్ని వ్యక్తపరిచే ఊ మాటలకు సమాధానంగా హరి గిరిని కౌగలించుకున్నాడు.

# 2

"చాలా అందంగా ఉన్నావులే! కానీ, ఈ దొరగారెక్కడ? కనబడ డేం?"

అద్దంలో తన ప్రతిబింబాన్ని చూసుకు మురిసిపోతూన్న దుర్గ గిరి ఈ మాటలతో ఉలికిపడి, సిగ్గుపడి, గర్వపడింది.

మూతి ముడిచి, "పోనీలే! ఇప్పటికైనా నాఅందం నీకు కనిపించింది" అంది.

దుర్గ మాటలకూ, ఆ మాట్లాడిన తీరుకూ గిరి తెల్లబోయాడు. పైమాటలు అతడు తన సహజధోరణిలో యధాలాపంగా అన్నాడు. సంభాషణ మళ్లించాలని "నా ప్రశ్నలో ముఖ్యమైన భాగం అదికాదు." అన్నాడు కుర్చీలో కూర్చుంటూ.

దుర్గ చిన్నబుచ్చుకుంది—

"ప్రశ్నలూ సమాధానాలూ తప్ప మనమధ్య ఇంకేమీ లేవా, గిరీ ?"

"లేకేం ? దెబ్బలాటలూ, అలకలూ, కన్నీళ్లూ, మూతి ముడుపులూ..." వాక్యం పూర్తి చేయకుండానే గిరి పకపక నవ్వాడు.

దుర్గకి కూడా నవ్వొచ్చింది.

"ఛీ! ఏదీ సీరియస్‌గా మాట్లాడవు-ఇంకోళ్లని మాట్లాడనియ్యవు."

గిరి స్థిరంగా కూర్చుని "ఇదిగో, బుద్ధిగా కూర్చున్నాను. రాజకీయ నాయకుల ఉపన్యాసం వినేవాడిలాగ! నాకు మొదటి ఆట సినిమాకు టైం దాటిపోకుండా, నువ్వు చెప్పదల్చుకున్నదంతా చెప్పెయ్యి" అన్నాడు.

దుర్గ ముఖం ఎర్రబడింది. "ఛీ! నీతో ఎవరు మాట్లాడ గలరూ !" అంది.

"అడిగినదానికి సమాధానం చెప్పని వాళ్లతో ఎవరూ మాట్లాడలేరు. హరి ఏడంటే చెప్పవేం ?"

దుర్గ కళ్లెగరేస్తూ కొంటెగా "ఏం? నీ హరికి నన్ను కాపలా ఉంచావా ? ఎంతసేపూ. హరి, హరి !—ఇవాళతో రోగం కుదుర్తుందిలే !" అంది.

"ఏమిటేమిటీ ? ఇవాళంతా తమాషాగానే ఉంది. నీకు పుణ్యం ఉంటుంది. అసలు సంగతి చెపుదూ ?"

కొంచెం ఆశ్చర్యంగానే అన్నాడు గిరి.

దుర్గ చేతులు నడుము కానించి గర్వంగా నిలుచుని "ఇవ్వాళ హరి అన్నయ్య నీతో సినిమాకి రాడు. రేపటినుంచీ నీతో మాట్లాడడు" అంది.

"సూర్యుడు పశ్చిమాన్న ఉదయిస్తున్నాడంటే ఇంతకంటె తేలికగా నమ్ముతాను." దృఢంగా అన్నాడు గిరి.

"నువ్వు నమ్మకపోతే నీ కర్మ! నిన్నూ, నన్నూ ప్రపంచాన్నీ హరి మర్చిపోయేలా చేసే మహేంద్రజాలం ఇవాళ రైల్లో దిగుతుంది."

"ఓ! ఉమ వస్తూందా? అరె! నాకు చెప్పలేదేం?" స్వగతంలా అనుకున్నాడు గిరి-

"అయిందా! సూర్యుడు తూర్పునే ఉదయిస్తున్నాడు, కానీ హరి కింక మనం అక్కర్లేదు." అంది చప్పట్లు కొడుతూ.

"అలాగేం? చూస్తూఉండు. నా దగ్గరకు రాకుండా ఒక్క రోజైనా, ఉండగలడేమో? ఎలాగైనా, ఈ సెలవుల్లో నాకు తోచడం కష్టమే!"

దుర్గ చటుక్కుని కళ్లు వాల్చుకుని పుస్తకాలు సర్దుతున్నట్లుగా బీరువా దగ్గరకు వెళ్లి "ఏం? నేను లేనూ?" అంది.

గిరి, దుర్గను గమనించకుండానే "పోవోయ్! నువ్వు ఆడదానివి. నీతో నాకేం తోస్తుందీ?" అన్నాడు.

దుర్గ గిరి వైపుకు తిరగకుండానే "అలా మాట్లాడతావేం గిరీ? ఉమ ఆడది కాదా? అన్నయ్యకు ప్రపంచమంతా ఆవిడే

కావటంలా ? అంది" ఈ మాటతో దుర్గ చెప్పదలుచుకున్నది గిరికి పూర్తిగా అర్థమయింది. దిగ్భ్రాంతితో కుర్చీలోంచి లేచి నిలుచున్నాడు. అప్పటి గిరి ముఖాన్ని చూసిఉంటే దుర్గ ఇంకా మాట్లాడేది కాదు. కానీ, ఆమె గిరి వైపు తిరగకుండానే "నీకు నేను అర్థం కాలేదంటే నమ్మను. నా నోటితోనే, నీకు విందామని ముచ్చటైతే. చెప్పడానికి నేను సిగ్గు పడను." అంది.

"దుర్గా! అలా మాట్లాడకమ్మా!" అన్నాడు గిరి బాధగా.

ఆ సంబోధనకూ, ఆ కంఠస్వరానికీ విచలితురాలై దుర్గ గిరి వైపుకు తిరిగింది—అతని ముఖం చూసిన దుర్గ తానూ స్థాణువై పోయింది.

అభిమానంతో, బాధతో ఆమె కళ్లల్లో నీళ్లు తిరిగాయి. గిరి దుర్గ దగ్గిరగా నడిచి తన రుమాలుతో ఆమె కన్నీళ్లు తుడిచి "క్షమించు దుర్గా! నువ్వు హారిని ఒకలాగా, నన్ను మరొక లాగా చూస్తావని నే నెప్పుడూ అనుకోలేదు. నే నలా ఆలోచించలేదు." అన్నాడు.

ఈ అనునయం, దుర్గ మనసును మరింత గాయం చేసింది. గిరి దగ్గర నుండి దూరంగాపోయి సోఫాలో కూలబడి చేతులతో ముఖం కప్పుకుంది. ఎంత అణుచుకుందామన్నా దుర్గకు ఏడుపు ఆగటంలేదు. గిరి మనసు కెలికినట్లయింది. దుర్గ కన్నీళ్లు తన కెంత బాధ కలిగిస్తాయో అతనికి మొదటిసారిగా అర్థమైంది. కానీ, ఆ ఆత్మీయతలో మాధుర్యం లేదు. ఆప్యాయత మాత్రమేవుంది. దుర్గ దగ్గిరకు వెళ్లి, ఆమె తల నిమురుతూ, "దుర్గా! ఇలా చూడు. నీ కన్నీళ్లు ఆపడానికి నేనేమైనా

చేస్తానమ్మా! నేను నిన్నెంత అభిమానిస్తున్నానో, నీకు తెలియదు" అన్నాడు.

దుర్గ ముఖం పైకెత్తింది. రోషంతో ఆమె కళ్లు మండి పోతున్నాయి. "దీన్నేనా, అభిమాన మంటారూ? నాకన్నీళ్లతో నీకే మవసరం?"

గిరి దుర్గ రెండు చేతులూ తన చేతులతో అదిమిపట్టి "నువ్వు వట్టి పిచ్చిదానివి దుర్గా! నిన్ను నువ్వే సరిగా అర్థం చేసికోలేక పోతున్నావు. జాగ్రత్తగా ఆలోచిస్తే నీకే అర్థమవుతుంది. నామీద నీకున్న భాతృవాత్సల్యాన్ని మరోలా అర్థం చేసికుంటున్నావు. ఎట్లాంటి సందర్భంలోనైనా ఈ గిరి అన్నయ్య నీకు అండగా ఉండి నీ కన్నీళ్లు తుడుస్తాడని గుర్తు పెట్టుకో!" అని అక్కడి నుంచి వెళ్లిపోయాడు. దుర్గకు మతి పోయినట్లయింది. గిరిమీద అంతులేని కోపం వచ్చింది. తాను తొందరపడి బయటపడటంవలన అతను తననలా అవమానించాడని అనుకుంది. ఎంత అణుచు కుందామన్నా ఆమెకు కన్నీళ్లు ఆగటంలేదు. మనసూ, శరీరమూ కూడా భగభగ మండుతున్నాయి. ఇంతలో వీధిలో జట్కా చప్పుడూ, హరి, ఉమల గొంతుకలూ వినిపించాయి. కన్నీటితో మలినమైన తన ముఖం వాళ్లకు కనిపించకుండా ఉండాలని బాత్‌రూంలోకి పరుగెట్టింది దుర్గ.

# 3

గిరిని వెంటబెట్టుకుని హరి లోపలకు వచ్చే సరికి, వాళ్ల కోసరమే ఎదురుచూస్తూ సోఫాలో కూర్చున్న ఉమ లేచి నుంచుంది—అంతవరకు ప్రక్కనే కూర్చున్న దుర్గచటుక్కున్న లేచి లోపలకు వెళ్లిపోయింది. హరి అది గమనించే స్థితిలో లేడు. గిరి మనసు కలుక్కుమన్నా సర్దుకున్నాడు. హరి పరిచయం తర్వాత నమస్కారం చేస్తూ ఎంతో కుతూహలంగా ఉమ గిరి వైపు చూసింది. గిరి కూడా అదే కుతూహలంతో ఉమ వైపుకు పరీక్షగా చూసాడు.

"గిరి గిరి అంటూ తెగ కోసేవాడు హరి. ఏ మన్మధుడో అనుకున్నాను. పొడుగ్గా, నల్లగా ఏం పెద్ద ప్రత్యేకత ఉందనీ ?" అనుకుంది ఉమ.

"ఫోటోలో కంటె బ్రహ్మాండంగా ఉంటుందన్నాడు—వాడి ముఖం! అంతే! తామునిగింది గంగ..." అనుకున్నాడు గిరి.

ముగ్గురూ కొంచెంసేపు పేకాడుకున్న తరువాత గిరి వెళ్తానని లేచాడు. ఎప్పుడూ గిరిని సగం దూరం దాకా సాగనంపే హరి, లేవనైనా లేవకుండా "సరే!" అన్నాడు.

గిరి నవ్వుతూ కనుబొమలు ముడిచి "ఇంత తొందరగా పోతున్నందుకు థేంక్స్ అయినా చెప్పకుండా, సరే, సంటున్నావా ? ఇవాళ్టికి మా యింటిదాకే రావద్దు కానీ, గుడి దాకా అయినారా !" అంటూ హరి భుజం పట్టుకుని లేవదీసాడు. హరి తప్పనిసరిగా లేచి గిరి వెంట బయలు దేరాడు.

ఉమ నవ్వుకుని చెదరిపోయిన పేకముక్కలు సరిగా పేర్చుతూ కూర్చుంది. ఇంతలో హరి, గిరి వెళ్లిపోయారని గమనించి దుర్గ వచ్చి ఉమ పక్కన కూర్చుంది.

"నీకు పేకాటంటే ప్రాణం కదా, ఇందాకట్నుంచీ రాలేదేం దుర్గా!" యథాలాపంగా అంది ఉమ.

"ఇప్పుడు వచ్చాగా! కలిపి వెయ్యి." నవ్వటానికి ప్రయత్నిస్తూ అంది దుర్గ—దుర్గ గొంతు కొంచెం బొంగురుగా ఉండటంతో, ఉమ ఆశ్చర్యంగా దుర్గ ముఖంలోకి పరిశీలనగా చూసింది. కళ్లు కొంచెం ఉబ్బి ఎర్రగా ఉన్నాయి. ఎందుకో ఏడ్చివుంటుందని వూహించి, ఉమ దుర్గ చేతిని తన చేతిలోకి తీసుకుని, లాలనగా నిమురుతూ "దుర్గా! ఎందు కేడ్చావో నాకు చెప్పు. ఇంతలో ఏమొచ్చింది ?" అంది ఆశ్చర్యంగా.

దుర్గ ముఖం ప్రక్కకు తిప్పుకుంది. ఉమ కొంచెం కోపంగా "ఇంతేనా, మన స్నేహం? అవునులే ! నీ రహస్యాలేవీ, నాకు చెప్పవు కదూ !" అంది.

దుర్గ పూడిపోతూన్న గొంతు పెగుల్చుకుని "ఆ గిరి వట్టి దుర్మార్గుడు" అంది.

ఉమ ఆశ్చర్యాని కంతులేకుండా పోయింది.

"అదేమిటి ? బావ అతణ్ని ఆకాశాని కెత్తుతాడు. నువ్వు పాతాళానికి తోసేస్తున్నావు. అది సరే! గిరి దుర్మార్గుడవడాన్నికి నీ ఏడుపుతో ఏం సంబంధం దుర్గా! నీతో ఏమైనా పిచ్చి పిచ్చి వాగుడు వాగాడా ? వాగితే బుద్ధి చెప్పాలి. లేకపోతే అసహ్యించుకుని వూరుకోవాలి. అంతే కాని, ఇలా ఏడుస్తారా ?"

ఆవేశంగా అన్న ఉమ మాటలకు దుర్గ మనస్సు కలుక్కుమంది. "అది కాదు! అది కాదు" అంది.

ఉమ అర్థం కానట్లు చూసింది.

"అసలంతా నాదే తప్పు." అంది దుర్గ. ఇంక కన్నీళ్లను అణచుకోలేక ప్రవహింపజేస్తూ—

ఉమ కంతా అయోమయ మయింది-దుర్గ భుజాలు పట్టుకుని కుదుపుతూ "జరిగింది చెప్పు. నువ్విలా ఏడుస్తూంటే, నా మనసుకు చాలా కష్టంగా ఉంది. నీ కన్నీళ్లు తుడిచే భారం నాది. వివరంగా చెప్పు" అంది.

దుర్గకు కూడా మనస్సులో చాలా బరువుగానే ఉంది. తన బరువు దింపుకోవాలనే ఎదురు చూస్తూంది.

"ఏం చెయ్యను ఉమా! బలహీనతలు అందరిలోనూ ఉంటాయి. చిన్నతనం నుంచీ ఎంతో చనువుగా ఉండేవాడు. ఎంతో ప్రేమ, ఆప్యాయత నటించేవాడు. అది నటన అని తెలియక నేనూ నిజంగానే ప్రేమించాను. మొన్న సాహసించి ఆ భావం అతని ముందు వ్యక్తం చేశాను. ఇంకేం లోకువ కట్టి, అవమానించి వెళ్లిపోయాడు."

ఉమ వళ్లో తల ఆనించి దుర్గ గట్టిగా ఏడ్చింది. ఉమకు కూడా రోషంతో కళ్లెర్రబడ్డాయి. ఉమ ఏదో అనబోయేటంతలో బయట హరి అడుగుల సవ్వడి వినిపించింది. దుర్గ చటుక్కున కన్నీళ్లు తుడుచుకుని మామూలుగా కూర్చుంది—హరి లోపలకు వస్తూనే "తొందరగా తయారుకండి. సినిమాకు వెడదాము" అన్నాడు.

"నేను రా నన్నయ్యా! నువ్వూ, ఉమా వెళ్లండి" అంది దుర్గ.

హరి లోలోపల సంతోషించాడు.

ఉమ మాత్రం "మే మిద్దరమే వెడితే అత్తయ్యా తంతుంది. నువ్వూరా, దుర్గా!" అంది.

దుర్గ నవ్వి "అబ్బో! అత్తగారంటే ఏం భయభక్తులూ అమ్మకు నేను చెపుతానులే! చిలుకా, గోరువంకల్లా మీ రిద్దరూ వెళ్లి రండి" అంది.

ముదురు నీలిరంగు పట్టు జాకెట్టు వేసికుని మబ్బురంగు మైసూరు జార్జెట్టు చీర కట్టుకుని హంసలా తన ప్రక్కనే నడుస్తున్న ఉమను తన్మయత్వంతో చూస్తూ "ఇంకా ఎక్కువ కాలం నేను ఆగలేను ఉమా! ఈ వేసవికాలంలోనే మనం పెళ్లి చేసికొందాం." అన్నాడు.

ఉమ కొంటెగా నవ్వి "మరే పాపం! అంతా నీ యిష్టమే!" అంది.

"ఏం నా యిష్టమే, నీ యిష్టం కాదా?" అన్నాడు హరి హుషారుగా నవ్వుతూ. ఉమ కూడా నవ్వింది. ఇంతలో ఉమకు దుర్గ గుర్తువచ్చింది.

"బావా! నువ్వీ గిరి స్నేహం వదిలెయ్యాలి" అంది. గంభీరంగా హరి తెల్లబోయాడు.

"రామాయణంలో పిడకలవేట లాగ ఇదేమిటి? గిరి నిన్నేం చేశాడూ?"

"నన్నేం చెయ్యక్కర్లేదు. అటువంటి సంస్కార హీనుడితో నా బావ స్నేహం చెయ్యటం నా కిష్టం లేదు."

"హరి సంస్కారహీనుడా? గిరిని నువ్వేమర్థం చేసి కొన్నావని అలా అంటున్నావ్! తొందరపడి ఇంకొకళ్లని అలా విమర్శించకూడదు ఉమా!"

గిరి మాటలలో ఆవేదన ధ్వనించింది. గిరిని ఎవరేమన్నా అతనికి కష్టంగా ఉంటుంది. ఉమకు కోపం వచ్చింది. "అవునులే! నీ కున్నంత నిదానం నాకు లేదు. నువ్వా గిరితో మాట్లాడటం మానేస్తేనే గాని, నాతో మాట్లాడక్కర్లేదు." అంది.

హరి సమాధానం చెప్పలేదు. సరదాగా సినిమాకు వెళ్లిన వాళ్లు మూతులు ముడుచుకుని ఇంటికి వచ్చారు. గిరి స్నేహం వదులుకోవాలనే భావనే హరికి అంతులేని వ్యధను కల్గించింది- గిరి పేరు చెపితేనే ఉమ మండిపడుతూంది.

# 4

"తమరు ఈ లోకంలోనే ఉన్నారా?" పది నిముషాల నుంచీ గుమ్మంలో నుంచున్నా, తన రాక గమనించకుండా పుస్తకం చదువుకుంటూన్న ఉమతో అన్నాడు గిరి.

గిరి కంఠస్వరం విని ఉలిక్కిపడింది ఉమ. గత వారం దినాలుగా ఆమె గిరిమీద అంతులేని ద్వేషాన్ని పెంచు కొంటూంది—

"నేను ఉమను, దుర్గను కాను" అంది విసురుగా.

ఉమ విసురుపాటూ, ఆమె మాటలూ, రెండూ అర్థం కాలేదు, గిరికి. అయినా కోపం తెచ్చుకోకుండా నవ్వుతూ "నా కళ్లు ఇంతవరకూ బాగానే పనిచేస్తున్నాయి." అన్నాడు.

"అవును ! పని చెయ్యనిది మెదడే !"

ఉమ ధోరణికి, గిరికి ఆశ్చర్యమూ, కించిత్కోపమూ కూడా కలిగాయి. అయినా తన కోపాన్ని నిగ్రహించుకుని, తలుపుకు జేర్లబడి నవ్వుతూ "హరికి, నిదానస్తురాలు భార్య అయితే బాగుండు ననుకునే వాడిని—మేనత్త, మేనమావ బిడ్డల పోలికలు వూరికినే పోలేదు. మీ దాంపత్యం చూడాలి." అన్నాడు.

ఉమ రెచ్చిపోయింది.

"మా దాంపత్యాని కేం ? మాకు ఏం ఉన్నా, ఏం లేకపోయినా సాధారణ మానవుల కుండాల్సిన సంస్కారం ఉంది." అంది.

గిరికి ఈసారి నిజంగా కోపం వచ్చింది.

"తెలుస్తూనే ఉంది. ఒక సాధారణ పరిచయస్థుడితో పగినంత కారణం లేకుండా ఇష్టమొచ్చినట్లు అమర్యాదగా మాట్లాడ గలగటం గొప్ప సంస్కారమే !"

ఉమ బిత్తరపోయింది. రోషంతో, అవమానంతో ఆమె ముఖం ఎర్రబడింది. ఏదో సమాధాన మియ్యాలనే తొందరలో "మీరు సాధారణ పరిచయస్థులు కారు." అంది.

ఉమ ఆవేశంలో గాడి తప్పిందని గిరి అర్థం చేసికొన్నాడు అయినా ప్రతీకార వాంఛ చల్లారక "ఎవరికీ?" అని అక్కడినుంచి వెళ్లిపోయాడు. గిరి వెళ్లిపోయాక ఉమకు తను అన్నదేమిటో తెలిసి వచ్చింది. ఒక్కసారిగా వళ్లంతా జలదరించింది. తల రెండు చేతులతో గట్టిగా పట్టుకొంది. తాను అనదలుచుకున్న దేమిటి? అన్న దేమిటి?

ఈ గిరి...పళ్లు పటపట లాడించింది ఉమ.

దుర్గను చూస్తే ఉమకు జాలిగా ఉంది. దుర్గ స్థితికి కారణమయిన గిరిమీద అందుకే కోపం! దుర్గ విషయం నాలుగూ అడిగేసి, గిరిని ఒప్పించి దుర్గతో వివాహం జరిపించాలని ఉమ కోరిక. అనుకోకుండా కథ యిలా అడ్డం తిరిగింది.

ఉమ దగ్గిరనుండి వెళ్లిపోయిన తరువాత గిరి చాలా పశ్చాత్తాప పడ్డాడు. ఏది ఏమైనా, ఉమ హరికి కాబోయే ఇల్లాలు. ఆమె రవంత పొరపాటు చేస్తే తాను క్షమించి ఉండగూడదా?! ఒకటికి రెండు రెట్లు బదులు తీర్చి వచ్చాడు. ఉమ మొదట్లో నవ్వుతూ ఎంతో సరదాగా ఉండేది. అకస్మాత్తుగా తనమీద ఎందుకు కోపం వచ్చినట్లు? అసలు కోపతాపాల పుట్టేటంత చనువు తమ యిద్దరి మధ్యా ఎక్కడ ఉందీ?

వణుకుతున్న పెదవులతో రోషంతో, నిస్సహాయంగా ఎర్రబారిన కనులతో పొడుగ్గా శిల్పిమలచిన విగ్రహంలా ఉన్న ఉమ అతని కనుల ముందు కదలాడింది. అతని మనసంతా

సానుభూతితో నిండిపోయింది. ఉమ దగ్గిరకు వెళ్లి తన తొందర పాటుకు క్షమార్పణ చెప్పుకోవాలనిపించింది. కానీ— వెళ్లలేదు. మనసంతా ఒక రకమైన చిరాకుతో నిండిఉండి అనుకోకుండా అతని కాళ్లు బీచికి దారితీశాయి. తల వంచుకుని ఆనాటి సంఘటనలను గురించి, ఉమ గురించీ ఆలోచిస్తూ నడుస్తూన్న గిరికి తల ఎత్తగానే ఎదురుగా ఇసుకలో కూర్చున్న ఉమ కనుపించేసరికి మతి చలించినట్లయింది. ఉమ కూడా అంతే ఆశ్చర్యంగా గిరి వంక చూసి తర్వాత నవ్వి "ఈ క్షణంలో మిమ్మల్ని గురించే ఆలోచిస్తున్నాను. మీరు ప్రత్యక్షమయ్యారు రండి, కూర్చోండి" అంది.

ఈసారి గిరి తనచెవులనుతానేనమ్మలేకపోయాడు—ఆమె మాటలకు ఇంచుమించు అలాంటి సమాధానమే అతని దగ్గిరా సిద్ధంగా ఉంది. అయినా ఆ సమాధానం చెప్పకుండా కొంచెం ఎడంగా కూర్చున్నాడు. ఉమకు క్షమాపణ చెప్పుకోవాలని అతని హృదయం ఆరాటపడుతూంది. మాటల కోసరం వెతుక్కుంటున్నాడు. అంతలో ఉమే "మధ్యాహ్నం నా ప్రవర్తన అనుచితంగా ఉందని ఒప్పుకుంటున్నాను. ఏమీ అనుకోకండి" అంది తల వంచుకుని ఇసుకలో గీతలు గీస్తూ.

గిరి ఒక్కసారిగా తనను కమ్ముకొన్న భావసంఘర్షణలతో తలక్రిందు లయ్యాడు. వెంటనే సర్దుకుని తన మామూలు ధోరణిలో నవ్వి "ప్లీజ్! మీ తప్పును ఒప్పేసుకుని, నా తప్పును వదింతులు చేయకండి." అన్నాడు—ఉమ మనసారా నవ్వింది.

"ఇంత మంచివారు, అంత కఠినంగా ఎలా ఉండగలరో"?

గిరి కొంత ఆశ్చర్యపోయి భయం నటిస్తూ "మళ్లీ ఏం ప్రళయం వచ్చిపడింది ?" అన్నాడు.

అతని అభినయమూ, మాటలూ, ఉమ కూడ దీసి కొంటున్న వోపికను చెదరగొడ్తున్నాయి. గిరి వెళ్లిపోయిన తర్వాత మళ్ళీ మళ్ళీ ఆ సంఘటన ఆమెకు గుర్తు రాసాగింది. జాగ్రత్తగా ఆలోచిస్తే తనదే తప్పని గూడా ఆమెకు తోచింది. గిరికి దుర్గ విషయం నచ్చజెప్పాలంటే అది నెమ్మది మీద జరగాలనీ, దానికీ చాలా శక్తి కావాలనీ కూడా గుర్తించింది. ఈ ఆందోళనతోనే ఆలోచిస్తూ, ఆమె వారికి కూడా చెప్ప కుండా ఒంటరిగా ఇలా బీచికి వచ్చింది. గిరి కన్పించేసరికి పశ్చాత్తాపంతో నిండిన ఆమె మనను, తేలిగ్గా తన తప్పును ఒప్పుకునేలా చేసింది. ఇక దుర్గ విషయమే ఆమెను బాధిస్తోంది. "మీరీమధ్య దుర్గను చూశారా ?" అంది సూటిగా — గిరి ఉలిక్కిపడ్డాడు. ఉమ కోపానికి కారణం అతనికి లీలగా స్ఫురించింది. కానీ, ఉమ కెంతవరకు తెలుసో అతనికి తెలియదు. అందుకని గడుసుగా "నాకు కనబడటం లేదు" అన్నాడు.

"అందుకనే ఇలా నవ్వగల్గుతున్నారు. దాన్ని చూస్తే ఎంత రాతిగుండె వాళ్లకైనా జాలి కలుగుతుంది." అంది ఉమ. గిరి తల వంచుకుని "పిచ్చి పిల్ల" అన్నాడు.

ఆ సమాధానం ఉమకు కొరుకుడు పడలేదు. "అవును పిచ్చిది కనుకనే మిమ్మల్ని ప్రేమించింది" అంది కొంచెం బాధగా. గిరి ఇరుకున పడ్డాడు. పరిస్థితిని ఉమ కెలా తెలియ జెప్పాలో అతనికి అర్థంకాలేదు.

"నన్ను ప్రేమించడంలో పిచ్చితనం లేదు. అది సరిగా అర్థం చేసికోకపోవటంలో పిచ్చితనం ఉంది. నేనూ హరి, దుర్గ చిన్నప్పటి నుంచి ఒక్కచోట పెరిగాం—నేను, హరినీ, దుర్గనూ, ఒకే దృష్టితో చూశాను. అలాగే దుర్గ కూడా నన్నూ, హరినీ ఒకే దృష్టితో చూస్తుందని అనుకున్నాను. అసలు నిజం కూడా అంతే! దుర్గ తనను తా నర్థం చేసికోలేక పోతూంది. ఇన్నాళ్ళుగా దుర్గ నాకు కనపడనందుకూ నిష్కారణంగా ఇలా క్షోభ పడుతున్నందుకు నేను కూడా ఎంత బాధపడుతున్నానో మీరర్థం చేసికోలేరు."

గిరి కళ్లలో నీరు తిరుగుతూంటే ముఖం పక్కకు తిప్పుకున్నాడు. ఉమ తెల్లబోయింది. ఉమది ఏ విషయమూ లోతుగా ఆలోచించే స్వభావము కాదు. గిరి అన్నట్లు ఉమది కూడా ఉద్రిక్త ప్రకృతి—దుర్గ ఆవేదన విని బాధపడినట్లే, గిరి కన్నీటికీ చలించింది. ఏం మాట్లాడలేక తల వంచుకుంది.

కొంత సేపటికి నిగ్రహించుకుని మళ్లీ గిరే అన్నాడు. "దుర్గ ఈ విషయాన్ని కొంచెం లోతుగా ఆలోచిస్తే తనే అర్థం చేసికో గలిగేది. నేను తనను అవమానించానని బాధ పడ్తూందే కాని, అసలు విషయం అర్థంచేసికోవటం లేదు. దుర్గ నాకు స్నేహితురాలు — సోదరీతుల్య—నేను మనసారా తన సుఖం కోరుకుంటున్నాను. చిన్నప్పటి నుండి కలిసి మెలసి తిరగటం వలన నామీద పెంపొందిన వాత్సల్య భావాన్నే దుర్గ మరోలా అర్థం చేసికొంటూంది. తన ప్రతి కదలికతో ఆమెను పులకరింప జేయగలిగిన పురుషుడు, ఆమె జీవితంలోకి ప్రవేశించినపుడు గానీ, నామాటలామెకు అర్థంకావు."

ఉమ ఏదో సమాధానం చెప్పడానికి తలెత్తే సరికి తమ వైపుకు వస్తూ హరి కనుపించాడు. ఉమా, గిరీ ఇద్దరూ స్వాగత పూర్వకంగా నవ్వారు. హరి వాళ్ల మధ్య కూర్చుంటూ "అరె! మీరిద్దరూ ఇక్కడ ఉన్నారా? ఉమా! నీకోసం బజారంతా వెతికి ఇక్కడకు వచ్చాను" అన్నాడు.

హరి ఈవిధంగా మాట్లాడటం క్రొత్త కాదు. కాని, ఉమ కెందుకో మనసు కలుక్కుమంది. హరి ఈ సమయంలో ఇక్కడకు రాకుండా ఉంటే బాగుండేదని కూడా అనిపించింది. తన అంతరాంతరాలలో కలిగిన ఈ భావానికి తనే ఆశ్చర్య పోయింది.

"ఒరేయ్! థేంక్స్ చెప్పుకో! పానకంలో పుడకలా మీ ఇద్దరిమధ్యా ఉండకుండా పోతున్నాను" అంటూ నవ్వుతూ లేచాడు గిరి—

"వెళ్లద్దు." చటుక్కున అంది ఉమ.

హరీ, గిరీ ఇద్దరూ ఆశ్చర్యపోయారు. గిరి తన ఆశ్చర్యాన్ని పైకి కనుపించనీయలేదు. హరి తన ఆశ్చర్యాన్నించి కోలుకోలేక పోయాడు. ఉమ తల తిప్పుకొంది.

"క్షమించండి. మీరు పొమ్మన్నా మీకోసమయితే పోయేవాడిని కాదు. కానీ, నాకు పనిఉంది" అని గిరి వెళ్లిపోయాడు.

ఒక క్షణకాలం వాతావరణం స్తబ్దమయింది. ఉమ మనసు తననుతానే అర్థం చేసుకోలేని అల్లకల్లోలంలా ఉంది. చటుక్కున లేచి "పద బావా! మనం కూడా ఇంటికి పోదాం"

అని నడవటం మొదలుపెట్టింది ఉమ. హరి యాంత్రికంగా ఆమె ననుసరించాడు.

# 5

ఏకాగ్రదేకంగా వ్రాసుకుంటున్న గిరికి, తలుపు నెట్టిన చప్పుడు అంతరాయం కలిగించింది. విసుగ్గా చిరాగ్గా లేచి తలుపుతీసి ఆశ్చర్యపోయాడు. ఎదురుగా దుర్గ నవ్వుతూ నిలువబడి ఉంది. ఒక్క క్షణం నిర్ఘాంత పోయినా, మరుక్షణం గిరికి, ఎక్కడలేని హుషారు వచ్చింది. చేతులు రెండూ పైకెత్తి, "కలయో, ఇది లేక వైష్ణవ మాయయో. ఇతర సంకల్పార్థమో, గిరినే కానో.." అంటూ పకపక నవ్వాడు.

దుర్గ తను కూడా నవ్వి లోపలకువచ్చి కూర్చుని మూతి ముడుచుకుని "ఇలా ఏడిపిస్తే నేను వెళ్ళిపోతాను," అంది. గిరి నవ్వుతూ "నీవాలకం నీ మాటలకు తగినట్లుగా లేదు. మూతి ఇంకా స్త ముందుకు రావాలి. కను బొమ్మలు ముడి పడాలి." అన్నాడు.

దుర్గ నవ్వేసింది. అంతలో గంభీరంగా "నువ్వెంత అదృష్టవంతుడివి గిరీ!" అంది.

"ఎందుకు తల్లీ! నీలాంటి చెల్లెలు దొరికి నందుకా?" కావాలనే అన్నాడు గిరి.

"నీ చుట్టుప్రక్కల ఆమడ దూరం వరకూ ఉల్లాసం నింప గల వ్యక్తిత్వము పొందగలిగినందుకు."

గిరి ఇబ్బందిగా నవ్వాడు.

"థేంక్స్! అది సరే! ఈ దీనుడిమీద ఇంత అనుగ్రహం కలిగిందేం? దేవుడా! మీకుటుంబంలో మనుష్యులు ఏ క్షణంలో ఏ మూడ్స్‌లో ఉంటారో మిమ్మల్ని పుట్టించిన ఆబ్రహ్మ దేవుడికి కూడా సరిగా అర్థంకాదు."

దుర్గ ముఖం సిగ్గుతో ఎర్రబడింది. ఒక్కక్షణ కాలం తల వంచుకుంది. అణచుకుందామన్నా అణగని భావోద్వేగంతో ఆమె కళ్లల్లో నీళ్లు తిరుగుతున్నాయి.

"గిరీ! నన్ను దెప్పకు! నీ ప్రేమ నాకు కావాలి. అది ఏ రూపంలోనైనా, సరే! నీతో మాట్లాడకుండా ఉండలేను. నువ్వు వదినతో 'దుర్గ నాతో మాటలు మానేసినందుకు బాధ పడ్తున్నానని అన్నావట! ఆ మాట మండుతున్న నా మనసుకి పన్నీటి జల్లులా అయింది. నీ దగ్గరకు పరిగెత్తుకుని వచ్చేశాను. నేను నిన్ను అర్థం చేసికోలేక పోతున్నాను. అన్నావట. అది నిజమో, అబద్దమో, నేను చెప్పలేను. పోనీయ్! మనం స్నేహితులుగా ఉందాము."

గిరి దుర్గ కళ్ళలోకి చూసి స్నేహంగా నవ్వి "పిచ్చి పిల్లా! ఇంత భోళాతనం పనికిరాదు. కాస్త గడుసుతనం నేర్చుకోక పోతే, రేపు మా బావగారు నిన్ను తోకపట్టుకు ఆడిస్తారు." అన్నాడు.

"నీకు బావగారు వచ్చినప్పటి మాట చూద్దాంలే" అంది దుర్గ.

"రాకపోతే, నేను పట్టుకొస్తాను. అదిసరే! ఇదంతా ఉమ పురుషకార మన్నమాట! నే నన్న మాటలన్నీ నీకు చెప్పిందా?"

"నువ్వన్న మాటలేకాదు. ఇంకా చెప్పింది" ఊరిస్తున్నట్లుగా అంది దుర్గ—గిరిలో కుతూహలం పెరిగింది.

"ఇంకా ఏమిటి?"

"హరి నువ్వంటే అంత పడి చావటంలో ఆశ్చర్యం లేదంది. నీతో పరిచయమున్న వాళ్ళు, నీ స్నేహం కోరకుండా ఉండలేరంది."

కొద్దిగా నవ్వింది దుర్గ. గిరి హృదయాంతరాళాలలో హాయి, హాయిమని అనిపించింది. ఇదమిద్ధ మనలేని ఏదో మధురిమ, అతని ఆపాదమస్తకమూ వ్యాపించింది. అంతలోనే తనను తను హెచ్చరించుకుని, మత్తులో పడబోతూన్న తన శరీరాన్ని, మనసునూ, అదుపులోకి తెచ్చుకుని తేలికగా నవ్వుతూ "ఉమ ఆగ్రహమూ, అనుగ్రహమూ కూడా శృతి మించినవే!" అన్నాడు.

"అయినా ఉమ వదిన మాటల్లో కొంచెమయినా అబద్ధం లేదు."

గిరి, నవ్వి "నువ్వొక దానివి;" అని వూరుకున్నాడు.

"నీతో ఒక ముఖ్యమైన విషయాన్ని చెప్పడానికి వచ్చాను." అంది గంభీరంగా దుర్గ.

దుర్గ గాంభీర్యాన్ని లక్ష్య పెట్టకుండా తేలికగా "ముఖ్యమైన విషయాలు, ఎప్పుడూ మాట్లాడకూడదు." అన్నాడు. బద్ధకంగా కుర్చీలో వెనక్కు జేర్లగిలబడుతూ.

"కాదు గిరీ! విను, ఉమ వదిన ఎం.బి.బి.ఎస్.లో చేరతానని పట్టు బడుతూంది. హరి అన్నయ్య కిష్టంలేదు."

గిరి ఒక్కసారి నిటారుగా కూర్చున్నాడు.

"ఇదెక్కడి పిడుగు! రేపు ఎండల్లో, హరి ఉమను పెళ్ళి చేసికోవాలనుకుంటున్నాడు గదా! ఉమ గూడా ఇంక చదువు ఆపివేద్దామనుకుంది గదా!" అన్నాడు ఎంతో కుతూహలంగా.

"అవును—కానీ ఉమ వదిన ఎందుకో ఇలా పట్టు పడ్తూంది. తను మెడిసిన్‌లో చేరుతుందిట. చదువు పూర్తయ్యే వరకూ, పెళ్లి చేసికోదట. ఒక వేళ ఈలోగానే అన్నయ్య పెళ్ళి చేసికోవాలనుకుంటే, మరొకర్ని చేసికోవటానికి తనకు అభ్యంతరం లేదట! అన్నయ్య చాలా బాధపడ్తున్నాడు గిరీ!"

దిగాలుగ్గా అంది దుర్గ—"అన్నయ్య బాధ పడ్తున్నాడు" అనే మాటలు, గిరిని కూడా బాగా కదలించాయి అమాయకమైన హరిముఖం, బుంగ మూతితో, రోషంతో ఎర్రబడిన కండ్లతో, అతని కనుల ముందు కదలాడింది.

చటుక్కున లేచి "పద! హరిని కలుద్దాం!' అన్నాడు. దుర్గ తాను కూడా లేచి, 'పద!' అంది.

ఇద్దరూ హరి ఇంటికి వచ్చేసరికి, ఇంట్లో సావిత్రమ్మగారొక్కరే ఉన్నారు. గిరి, ఆదుర్దాగా "హరి ఏడి పెద్దమ్మా?" అన్నాడు.

ఆవిడ ముసి ముసిగా నవ్వి, "ఇప్పుడే హరి, ఉమా, అలా వెళ్ళారు." అంది.

ఈ సమాధానంతో న్యాయంగా ఉత్సాహంరావాలి గిరికి. కానీ ఎందుకో నీరసంగా సోఫాలో కూలబడ్డాడు. దుర్గ నవ్వుతూ "హరి అన్నయ్య దిగులుగా ఉంటే ఓదార్చుదామని వచ్చావు ఆఛాన్సు తప్పిపోయినందుకు ఫీలవుతున్నావా?" అంది.

గిరి ఉలికిపడ్డాడు. "ఛ లేదానివి" అన్నాడు. అతని అంతరాంతరాలలో దుర్గమాటలు నిజమనిపించింది. చిత్రాతి చిత్రమయిన ఈ హృదయ సంచలనాని కతని కాశ్చర్య మయింది. సిగ్గు కూడా వేసింది. తన మనసు తనకు తెలియకుండానే ఏదారిన పరుగెడుతూందో అతని కర్థమవసాగింది. అతని నుదురు వేడెక్కింది. హరిని తాను చిన్న నాటినుండి ప్రాణానికి ప్రాణంగా ప్రేమించాడు. అలాంటి హరిపట్ల ద్రోహాన్ని వూహిస్తోందా, తన మనసు? అంతటినీచుడా తాను? కూర్చున్న చోటునుంచి చివాలున లేచిపోయాడు గిరి.

* * *

"తన ప్రతి కదలికతో ఆమెను పులకరింప జేయగలిగిన పురుషుడామె జీవితంలోకి ప్రవేశించినప్పుడు గానీ నా మాటలామెకు అర్థంకావు."

ఈ మాటలే పనిచేస్తున్నా, ఉమ మనసులో కదలాడ్తూనే ఉన్నాయి. ఈ మాటలేకాదు. ఆరోజు గిరితో నడచిన

సంభాషణలోని ప్రతి అక్షరమూ, ఏ పని చేస్తున్నా, ఆమె మనసులో ప్రతి ధ్వనిస్తూనే ఉంది. ఏదో అసంతృప్తి, ఆవేదన ఆమె హృదయాన్ని కలచివేయ సాగింది.

సావిత్రమ్మకు స్వయంగా అన్న కూతురు ఉమ. కలిగిన కుటుంబంలో ఏకైకపుత్రికగా ఉమ చాలగారాబంగా పెరిగింది. ఎన్నడూ, ఏ విషయాన్నీ ఇంత లోతుగా ఆలోచించేదికాదు క్షణికమైన ఆవేశాలకు ఆమె తరచుగా లొంగిపోయేది. చిన్నప్పటి నుండీ, హరినీ, ఉమనూ, అందరూ భార్యా భర్తలు అనేవారు. ఆ మాటలు విని, విని, ఉమ కూడా అలాగే భావించేది. ఆ విషయం గురించి తానుగా ఏమీ ఆలోచించేదికాదు—

ఈనాడామె కేదో క్రొత్త ప్రపంచపు తలుపులు తెరువ బడినట్లుగా తోచ సాగింది. ఈ ప్రపంచంతో, ఆమెకింతకు ముందెన్నడూ పరిచయం లేదు. ప్రేమలో రెండు రకాలున్నాయి. ఒకటి వాత్సల్య పూరితమైన ప్రేమ— మరొకటి మధురమైన ప్రేమ—మధురాతి మధురమై,తననూ ఎదుటి వారిని, సర్వ ప్రపంచాన్ని కూడా మరచి, అందులో లీనమయ్యేలా చేసుకోగలిగే ప్రేమ!... జీవితానికి, సార్ధక్యాన్ని కలిగించే ప్రేమ అలౌకికమయిన ఆనందానుభూతిని! అందివ్వగలిగే ప్రేమ! హృదయాన్నీ, శరీరాన్ని గూడా పులకరింపజేసి మనసును, స్వర్గ సీమల లోకి తీసికుపోగలిగే ప్రేమ! ఆ దివ్యమైన ప్రేమానుభూతి, తన జీవితంలోకి వచ్చిందా, అసలు ? హరి పట్ల తనకు ఉన్నది వాత్సల్యమా? ప్రేమా ? హరిని తలచుకున్నంత మాత్రాన, తన శరీరమూ, మనసూ ఉద్విగ్న మవుతాయా? హరి దర్శన మాత్రంతో తన కళ్ళు వింత కాంతు

లను నింపుకో గలుగుతాయా ? హరిని గూర్చిన భావనే తన జీవిత సార్ధక్యమని భావింపగలుగుతుందా?

ఉమ ఈ ఆలోచనలను భరించలేక పోతోంది. కాని వాటి నుండి తప్పుకోవటం, ఆమెకు సాధ్యం కావటంలేదు. హరి విషయంలో తనలో ఏ ప్రత్యేకమైన కదలికనూ ఆమె గుర్తించ లేక పోతూంది తనకు దుర్గమీద ఎన్న అభిమానం లాంటిదే హరి మీదా వుంది. తాను దుర్గ అంటే ప్రాణం పెట్టడం లేదా? దుర్గ బాధ పడుతూంటే బాధ పడటం లేదా? దుర్గను చూడాలని కోరుకోవడంలేదా? అంతే! అలాంటి అభిమానమే, హరి మీదా ఉంది. తన స్త్రీత్వాన్ని కదలించి వేయ గల గాఢమైన ఆకాంక్ష కాదది! కాలేదు కూడా!

ఉమకు ఆలోచించడానికికూడా భయమైంది. గిరి వ్యక్తిత్వంలో ఒక విశిష్టతఉంది ఎంత దగ్గరగావస్తాడో అంత దూరంగా ఉంటాడు. చనువిస్తూనే భయం కలిగిస్తాడు. నవ్వుతూనే గంభీరంగా ఉంటాడు.

ఆమె త్రోసి పారెయ్యాలని ప్రయత్నించిన కొద్దీ, ఆమె మనసులో, మరింత ప్రముఖ స్థానాన్ని ఆక్రమించుకొంటున్నాడు గిరి.

చివరకు, తాను గిరిని ప్రేమిస్తున్నాననే నిర్ధారణకు వచ్చింది ఉమ. అవును అందులో తప్పేమి వుంది? తాను అతడిని ఆరాధిస్తూంది. ఒక వేళ తన ఆరాధనను అతడు స్వీకరించక పోవచ్చు. అయినా తను మాత్రం బ్రతికినంతకాలమూ, మనసులో అతడిని ఆరాధిస్తూనే వుంటుంది. ఆ ఆరాధనే తన జీవితానికి మూలం తన బ్రతుకుకు బలం.

కానీ, హరి! హరి భావన లెలా ఉన్నాయో? ఈ విష యాన్ని హరి సహించగలడా? హరి తనను భార్యగా భావి స్తున్నాడు. తన అంగీకారం కూడా అతనికి లభించింది. ఇప్పు డెలా అతనిని నిన్ను భర్తగా భావించటంలేదని చెప్పడం? చెపితే ఏమనుకుంటాడు ?

హరి ఉమ ఉదాసీనాన్ని గ్రహించాడు. లక్ష విధాలుగా ప్రయత్నించీ కూడా ఆమెల్లో ఉత్సాహాన్ని తేలేకపోయాడు. ఒక సారి ఏకాంత సమయంలో ఆమెచెక్కిలిని ముద్దాడబోయి ఆమె బొమ ముడితో వెనక్కు తగ్గిపోయాడు. ఉమ కావాలని తనకు దూరంగా వుంట్తూందని గ్రహించాడు. కానీ దానికి కారణం మాత్రం అర్థం కావటంలేదు. ఉమకు తనమీద ప్రేమ లేక పోవచ్చుననే విషయం అతని వూహా కందనిది. ఏదో అలి గిందని అనుకున్నాడు.

"దేవి గారి అలకకు కారణం, ఈ దాసుడికి తెలియ జెప్పరాదా? తమ కటాక్ష వీక్షణం కోసం, ఏ పని చెయ్యడాని కైనా, సిద్ధంగా ఉన్నాను". అన్నాడు.

ఉమ చటుక్కుని అందుకుంది.

"నిజంగానాకోసం నీకిష్టంలేనిది ఏదైనాచెయ్యగలవా?"

"పరీక్షించి చూడరాదూ ?!"

"నాకింకా చదువు కోవాలనివుంది."

హరి ముఖంలో నవ్వు మాయమయ్యింది.

"ఏమంటున్నావ్ నువ్వు ?" నమ్మలేనట్లు అడిగాడు.

"నా నిశ్చయాన్ని చెపుతున్నాను. నేను ఎం.బి.బి.యస్. చదువుతాను డాక్టర్ను అయ్యాక కాని పెళ్ళి చేసుకోను." దృఢంగా అంది ఉమ— ఆ దృఢ స్వరానికి, హరి విచలితుడయ్యాడు—అతనికి కొంచము కోపమూ రోషమూ కూడా వచ్చాయి.

"కానీ; నేనంతవరకు ఆగలేను." కోపంగా అన్నాడు హరి.

"అంత ఓపిక లేకపోతే, నువ్వు పెళ్ళి చేసికో! నేను పెళ్ళి చేసికోనన్నాను, కానీ నిన్ను చేసికోవద్దని ఆపలేదుగా ?" తేలికగా నవ్వుతూ అంది ఉమ.

హరికి తల తిరిగినట్లయింది. ఆమాట్లాడిన తీరూ, ఆ మాటలు అర్థమూ, ఆ తేలిక నవ్వూ అన్నీ అతడిని దిగ్భ్రాంతుడిని చేసాయి. అయోమయంగా ఉమ ముఖంలోకి చూస్తూ నిలబడి పోయాడు.

ఆ చూపులకు ఉమ కడుపులో దేవినట్లయింది. అక్కడ నిలబడలేక లోపలకు పోయింది. ఇట్లాంటి సంఘటన లెవరి జీవితంలో నైనా వస్తాయా? ఇంత అల్లకల్లోలాన్ని భరించలేక పోతూంది తాను.

ఏదో పని మీద అటు వచ్చిన దుర్గ ఉమ కన్నీటిని చూసి తెల్లబోయింది— దగ్గరగా వచ్చి ఉమ భుజం మీద చెయ్యివేసి "ఉమా! ఏమయింది?" అని అనునయించింది.

ఎందుకనో, నిజం చెప్పాలనిపించలేదు, ఉమకు......

"నాకు డాక్టర్ని కావాలని ఉంది. చదువుకుంటానంటే మీ అన్నయ్య ఒప్పుకోవటంలేదు." అంది ఉమ.

దుర్గ చాల ఆశ్చర్యపోయింది. పరీక్షగా ఉమ ముఖం లోనికి చూసింది. ఉమ ముఖం తిప్పుకుంది.

"ఇంతదానికి బాధ పడటం దేనికి? నువ్వు మెల్లగా నచ్చ చెపుతే, అన్నయ్య కాదంటాడా? ఇందుకేనా, అన్నయ్య కూడా, ఇవాళంతా గదిలోంచి బయటకు రాలేదు?— ఇంత వరకూ అన్నంకూడా తినలేదు. ఆకలిగా లేదని తలుపు వేసి కొన్నాడు. ఏమిటి వదినా, చిన్నపిల్లలాగ. ఇద్దరూ రాజీ పడండి."

పెద్ద ఆరిందా లాగ చెప్పి, ఇంచుమించు ఉమను హరి గది దగ్గరకు లాక్కెళ్ళి అక్కడ విడిచిపెట్టి వెళ్ళి పోయింది దుర్గ. అంతవరకూ హరి అన్నం తినలేదంటే ఉమ కూడా బాధపడింది. మెల్లగా తలుపుతట్టింది. లోపలనుండి విసుర్గా "ఎవరూ?" అని సమాధానం వచ్చింది.

"ఉమను!" మెల్లిగా అంది ఉమ.

వెంటనే తలుపులు తెరుచుకున్నాయి.

"ఉమా?" అన్నాడు దీనంగా హరి.

ఒక్క రోజులో నమ్మలేనంతగా మారిపోయిన హరి ముఖాన్ని చూసేసరికి, ఉమ కదిలిపోయింది. "ఉమా?" అన్న అతని దీన స్వరం ఉమ గుండెల్లో మారుమ్రోగింది.

"ఇదేమిటి బావా? ఇంత అలకా?" ఎంతో ఆర్ద్రంగా నవ్వుతూ అంది. ఉమ చిరునవ్వు చూసే సరికి, హరి ప్రాణం

లేచి వచ్చింది. అంత క్రితం వరకూ, అతని మనసులో లావా మరుగుతూంది. అపరాని ఆవేశంతో ఉమను దగ్గరకు లాక్కొని ఇంచుమించు కొరుకుతున్నంత గట్టిగా ఆమెను ముద్దు పెట్టుకున్నాడు. ఉమ అతని కౌగిలినుండి విడిపించుకోలేక పోయింది. హరి గద్గదికంగా, "నీ కోసం ఎన్ని యుగాలయినా, ఎదురుచూస్తూ ఉంటాను ఉమా! నీకెలా సంతోషమో, అలాగే చేద్దాం, నీ సంతోషంకంటె నాక్కావాలిసింది లేదు." అన్నాడు.

ఏమనడానికీ, ఏం చెయ్యడానికీ, ఉమ అశక్తురాలయింది. అప్రయత్నంగా హరి తల మీద చెయ్యివేసి నిమిరింది. హరి ఆ చేతిని గుండెలకు హత్తుకుని "నా ఉమా? నా జీవితంలో నీ స్థానం ఎంత ప్రముఖమైనదో ఇవాళ మొదటి సారిగా అర్థమైంది." అన్నాడు.

ఉమ నిలదొక్కుకోలేక పోతూంది. పేలవంగా నవ్వి "కవిత్వం తరువాత! ముందు అన్నానికి పద!" అంది ఉమ చిరునవ్వులోని పేలవత్వం గమనించగలిగే స్థితిలో లేడు హరి— ఆమె చేతులు పట్టుకుని వూపుతూ "ఇవాళ సాయంత్రం నాతో సినిమాకు వస్తానంటే......" కొంటెగా నవ్వుతూ అన్నాడు.

"బాగుంది. నన్ను ఉద్ధరించడానికేమిటి?" చిరాకుగా అంది ఉమ. ఉమ చిరాకు నిజమైనదే అయినా, హరికి నటన అనిపించింది.

"అవును నిన్నుద్ధరించడానికే! నా బ్రతుకే నీకోసం!" అన్నాడు.

ఇంకా సంభాషణ పొడిగించటం ఇష్టం లేక ఉమ "సరే! వస్తాలే, తిను." అంది.

హరి హుషారుగా వెళ్ళి పోయాడు.

ఉమ దిగాలుగా కూలబడింది.

# 6

బయట పోస్ట్ జవాను "టెలిగ్రాం" అని కేక పెట్టంగానే ఆదుర్దాగా బయటకు వచ్చాడు శంకర్, సంతకం పెట్టి కవరందుకొని చింపుకున్నాడు.

"గాభరా పడవలసిందేమీ లేదు. వెంటనే బయల్దేరు." గిరి.

ఆ టెలిగ్రాం శంకర్‌కు చాలా ఆశ్చర్యం కలిగించింది. గిరి సాధారణంగా ఉత్తరాలే వ్రాయడు. అట్లాంటి వాడు, ఇట్లా వైరిచ్చాడంటే, ఏమనుకోవాలి? రకరకాల ఆలోచనలతో శంకర్ బయలుదేరి వచ్చాడు. తన ఆలోచనలకు విరుద్ధంగా, నవ్వుతూ స్టేషన్‌కు వచ్చిన గిరిని చూసి ఆశ్చర్యపోయి, "పెళ్ళికొడుకులా, లక్షణంగా ఉన్నావు. నాకు వైరెందుకిచ్చావ్?" అన్నాడు.

గిరి నవ్వి "నిన్ను చూడాలని మోజు పడ్డాను అబ్బాయ్" అన్నాడు—శంకర్ కూడా నవ్వాడు కానీ, అతనికి తమాషాగా ఉంది—శంకర్ గిరికి చాలా దూరపు బంధువు మొదట, శంకర్‌ది కలిగిన కుటుంబమే! ఒక్కడే కొడుకు

కావటంవలన తల్లి అతని కియ్యకూడనంత గారాబాన్ని ఇచ్చింది. ఫలితంగా అతనికి చదువు బదులు, దుర్వ్యసనాలు పట్టుబడ్డాయి. ఒకనాడు, ఆకస్మాత్తుగా తండ్రి చనిపోయే సరికి, శంకర్ ఒంటిగా నిలబడవలసి వచ్చింది. తండ్రి సంపాదించాడే కాని నిలువ జేయలేదు. శంకర్ తల్లీ గిరి తల్లీ బంధువుల కంటే స్నేహితులు—ఆమె గిరి తల్లి దగ్గరకు వచ్చి, తన పరిస్థితి చెప్పు కొంది. గిరి తల్లితప్పక, తాను చేయగలిగినంత సహాయం చేస్తానని ఆమెను వోదార్చి వారిని తన ఇంట్లో ఉండనిచ్చి, శంకర్ బాధ్య తను గిరికి అప్పజెప్పింది—గిరి శంకర్‌ను చదువులో పెట్టడానికి ప్రయత్నించాడు త్వరలోనే ఆ ప్రయత్నం వృధా అని గమనించి విరమించుకున్నాడు. క్రమంగా అతని లౌకిక జ్ఞానమూ, బేరసారాలలో అతడు చూపే మెలకువా గమనించి, అతడిని వ్యాపారంలో ప్రవేశపెడితే బాగుంటుందని అనుకున్నాడు. ఈ ఆలోచన శంకర్‌కూ, గిరి తల్లికీ నచ్చింది. శంకర్ తల్లి మొదట్లో అభ్యంతర పెట్టినా, చివరకు అంగీకరించింది. శంకర్ గిరి ప్రోత్సాహంతో స్టెయిన్ లెస్ స్టీలు సామాను వ్యాపారం ప్రారంభించాడు. గిరి, అంచనా నిజమై, శంకర్ వ్యాపారంలో మంచి ప్రజ్ఞ చూపించ గలిగాడు. అతని వ్యాపారం దిన దినాభివృద్ధి కాసాగింది. శంకర్ తన తల్లితో కూడా తన మకాము బొంబాయికి మార్చ దల్చుకున్నాడు—శంకర్ వ్యాపార దక్షతను గమనించిన గిరి అందుకు సంతోషంగా ఒప్పుకున్నాడు. శంకర్‌కు గిరి దేవత—గిరికి శంకర్ అంటే ప్రాణం. హరి తర్వాత అతడెక్కువగా అభిమానించేది శంకర్‌నే !—

ఆ రోజు హరి ఇంటి నుండి అలా అకస్మాత్తుగా లేచి వచ్చేసిన తరువాత, గిరికి, తన మనసు, ఏ దారిన పరుగెడు తూందో బాగా అర్థం కాసాగింది. అతనికి భయం వేసింది. తేలిగ్గా త్రోసి పారెయ్యాలని ప్రయత్నించి, ఈ అనుభూతి నంత తేలిగ్గా, త్రోసివెయ్యలేక పోయాడు. కొన్నాళ్లు ఉమకు దూరంగా ఉంటే మంచిదని ప్రయత్న పూర్వకంగా దానిని సాధించాడు. కాని. ఆ ఏకాంతం అతనిని మరింత బాధించింది. తన మనుసుకి చికాకుగా ఉన్న ఈ స్థితిలో స్వాంతన కోసం శంకర్‌ను రమ్మని వైరిచ్చాడు.

శంకర్, గిరి, ఇంటికి వచ్చేసరికి, గిరి ఇంట్లో, ఉమ, దుర్గ, హరి, కూర్చుని ఉన్నారు. ఏ ప్రలోభాన్నుంచి తప్పించుకు పోవాలని ప్రయత్నిస్తున్నాడో, సరిగా అదే తన ఎదుట వచ్చే సరికి, గిరి చలిజ్వరం వచ్చినట్లు లోలోన వణికాడు—అయినా అందరినీ చిరునవ్వుతో పలకరించాడు. శంకర్ అక్కడున్న వ్యక్తులకు క్రొత్త కాకపోయినా, అతనితో ఎవ్వరికీ అంత చనువులేదు. శంకర్‌ది నలుగురితో కలసి మెలసి తిరిగే స్వభావం కాదు. ఒక్క గిరితో తప్ప, అతడెవరితోనూ, ఎక్కువ మాట్లాడడు. శంకర్ పరిచయసూచకంగా నవ్వేసి అక్కడి నుండి వెళ్ళిపోయాడు.

హరి కృత్రిమ కోపంతో "ఇన్నాళ్ళ నుండి నాకు కనపడటం లేదేం?" అన్నాడు.

గిరి నవ్వుతూ "డామిట్! నేను మీయింటికి రానందుకు థేంక్స్ చెప్పక తిడుతున్నావా? ఇదే, కృతజ్ఞత, అంటే!" అన్నాడు. ఆ మాటలంటూ అతడు ఉమ వంక చూడకుండా

ఉండలేక పోయాడు. ఆ క్షణంలో ఉమ కూడా అతని వంకే చూస్తూంది. ఉమ కళ్ళలో తన కళ్ళు కలవగానే, తనలో నిలువెల్లా ఏదో విద్యుత్తు ప్రవహించినట్లయి చటుక్కున కళ్ళు తిప్పుకున్నాడు.

ఉమ వెంటనే నవ్వుతూ "ఓ! స్నేహితులంటే మీరే! స్నేహధర్మాలన్నీ, ఈయన దగ్గరే నేర్చుకోవాలి." అంది. ఉమ మాటలు కేవలం నవ్వుతూ అన్నా, గిరికి మాత్రం వాడి బల్లెంలాగ గుచ్చుకున్నాయి. తల ఎత్తి హరి ముఖంలోకి చూసే సాహసం కూడా లేక పోయిందతనికి. హరి తను కూర్చున్నచోటు నుంచి లేచి గిరి భుజం తట్టుతూ, "ఏదెలా ఉన్నా, నువ్వు కనపడకపోతే నాకు పిచ్చిగా ఉంటుందిరా! అది సరే! ఇవాళ మేమంతా కలిసి వచ్చిందెందుకో తెలుసునా?" అన్నాడు.

"ఏదో పిక్చర్ ప్రోగ్రాం" అన్నాడుగిరి నిరుత్సాహంగా.

"కాదు. పిక్నిక్ ప్రోగ్రాం, రేపు మన తోటలోకి."

"ఏమిటి విశేషం?"

"విశేష మేముందీ? ఉమకు ఎం.బి.బి.ఎస్. సీటు వచ్చింది. ఇంకో రెండు రోజుల్లో ఉమ హైదరాబాదుకు వెళ్ళిపోతుంది. తను వెళ్ళబోయేముందు అందరం ఒక్కరోజు సరదాగా గడుపుదామని."

ఉమ వెళ్ళిపోతూందనే వార్త వినగానే, గిరి హృదయం కలుక్కుమంది. వాలుగా ఉమ వంక చూశాడు. ఉమ విస్ఫారిత

నే(త్రాలతో, ఆర్ద్రమైన చిరునవ్వుతో గిరికి తన ఆహ్వానాన్ని అందజేసింది.

గిరి కనులు వాల్చుకుని "నన్ను క్షమించు హరీ! నాకు రేపు చాలా పనులున్నాయి. నేను రాలేను." అన్నాడు.

ఉమ నిస్సహాయంగా దుర్గ వంక చూసింది. ఎందుకనో ఉమ ఇదివరకటిలా గిరితో, చనువుగా మాట్లాడలేక పోతూంది. ఉమ చూపులందుకున్న దుర్గ "నువ్వు రాకపోతే, వీల్లేదు గిరీ! అసలు మేమెవ్వరమూ బయలుదేరం" అంది.

"ఇష్టం లేక కాదు దుర్గా! కానీ నాకు..." అంటూ మధ్యలో తలెత్తిన గిరి వాక్ప్రవాహానికి ప్రార్థనా పూర్వకమైన ఉమ చూపులు అనకట్ట వేశాయి.

"సరే వస్తాను." అనకుండా ఉండలేక పోయాడు. ఉమ సగర్వంగా నవ్వుకుంది. దుర్గ హుషారుగా చప్పట్లు కొట్టింది. హరి ఉల్లాసంగా నవ్వి "నాకు తెలుసు, రానని నువ్వు బ్రతకగలవా?" అన్నాడు.

గిరి కదోలా అయింది. ఏం విచిత్రమో, ఇది వరకు చాలా సాధారణంగా వినిపించే ప్రతిమాటా, ఇప్పుడేవో క్రొత్త అర్థాలతో వినిపిస్తూంది అతనికి—

"శంకర్ కూడా వస్తాడు" అన్నాడు గిరి.

అందరూ ఏక కంఠంతో సంతోషంతో అంగీకారం తెలిపారు. హరి వెంటనే లేచి "వెళ్దామా?" అన్నాడు. ఉమకు అక్కడినుండి వెళ్ళాలని లేదు.

"ఇంటికి వెళ్ళి ఏం చేయాలి? కాస్సేపు పేకాడు కుందాం." అంది అలవాటుగా స్వతంత్రంగా లోపలకు వెళ్ళిన దుర్గ అక్కడ కుర్చీలో కూర్చుని చదువు కొంటున్న శంకర్‌ను చూసి తడబడింది. శంకర్ మర్యాదగా లేచి "ఏం కావాలి?" అన్నాడు. "పేక" అంది. తల వంచుకుని—శంకర్ డ్రాయరు లాగి పేక తీసి దుర్గకు అందించాడు" యధాలాపంగా దుర్గ "మీరు రండి పేకాటకి" అంది.

ఆశించని ఈ ఆహ్వానం, శంకర్‌కు ఆనందాన్ని కలిగించింది. అయినా మొహమాటంగా "నాకు సరిగ్గా రాదు." అన్నాడు.

"ఫరవాలేదు. మీకేకాదు, ఎవ్వరికీ రాదు" అంది దుర్గ.

ఒకరి ప్రక్కన ఒకరు నడిచి వస్తున్న దుర్గా శంకర్‌లను చూసేసరికి, గిరి, మనసులో, అంతకు ముందెన్నడూ కలుగని ఆలోచన మెరిసింది.

తన క్రొత్త ఆలోచన కలిగించిన ఉత్సాహంతో హుషారుగా పేక కలిపి వేశాడు. చీకటి పడేవరకూ కులాసాగా పేకాటతో గడిచిన తర్వాత, అంతా లేచారు. ఉమ కనుసైగతో దుర్గ, గిరిని మరునాటి పిక్నిక్ ప్రోగ్రాం గురించి మరోసారి హెచ్చరించింది. హరి శంకర్‌ను కూడా రమ్మని మరీమరీ చెప్పిన తరువాత శంకర్ కూడా అంగీకరించాడు.

ఉమా, దుర్గా గిరీ వెళ్ళిపోయారు. శంకర్ అలా పార్కుకేసి వెళ్దాం రమ్మన్నాడు. గిరి తనకు ఒద్దకంగా ఉన్నదంటే శంకర్ ఒక్కడే వెళ్ళిపోయాడు.

గిరి బద్ధకంగా సోఫాలోంచి కూడా లేవకుండా అక్కడే జేర్లగిలబడి కళ్ళు మూసుకున్నాడు.

"ఉమ ఇవాళంతా తనతో ఏమీ మాట్లాడ లేదు. కానీ చాలా మాట్లాడింది. ఉహు! ఆమె మాట్లాడలేదు ఆమె కళ్ళు మాట్లాడాయి. ఉమ కళ్ళు ఎంత అందమైనవి? క్షణ క్షణానికీ చిత్ర విచిత్రమైన భావాలతో కదలాడిపోతూ నీటికెరటాలతో గెంతులు వేసే చేప పిల్లలా మిలమిల లాడుతుంటాయి. ఆమె కళ్ళతో అంత చక్కగా మాట్లాడ గలదని తన కింతకుముందు తెలియదు. ఆజ్ఞలు, లాలనలు, ప్రార్థనలు, అలకలు అన్నీ పెదవి కదల్పక తన కనురెప్పల కదలికలతో తెలియజెప్పింది. ఆ కళ్ళలోకి చూస్తూ కూచుంటే చాలు యావత్ప్రపంచాన్నీ మరిచిపోవచ్చు.

ఇంత అనురాగాన్ని ఎలా అణచిఉంచటం ? తన హృదయమూ, శరీరమూ "ఉమా, ఉమా!" అని ప్రతి ధ్వనిస్తూంటే కాదని తనను తాను మోసం చేసికోవడం సాధ్యమా?

అయినా ఇది కేవలం మనసుకు సంబంధించినది. అమితమైన ఆకర్షణతో ఉమ వైపుకు పరుగెత్తి పోయే మనసును మరల్చడం తనవశంకాదు. అసలు మరల్చవలసిన అవసరం మాత్రం ఏముందీ? తన అంతరాంతరాలలో నిండి తన అనుభూతిలోకి మాత్రం వచ్చే ఈ విషయంవల్ల ఎవరికిమాత్రం ఏంనష్టం? తనకెవ్వరిపట్లా ద్రోహచింత లేదు— ఎవ్వరికి తాను అన్యాయం తలపెట్టడు. తనవల్ల తనప్రాణమిత్రుడు హరికిగాని అతని ప్రణయిని ఉమకుగానీ, తనకు స్నేహితురాలూ, సహోదరీతుల్యా దుర్గకు కానీ ఎన్నడూ ఏ విధమైన క్లేశమూకలుగదు

ప్రకృతి సిద్ధమూ, అత్యంత మధురమూ అయిన ఈ ఆకర్షణ నుండి తప్పించుకోవడం సాధారణ మానవులకు అసాధ్యం—సృష్టి చరిత్ర ప్రారంభంనుండీ స్త్రీపురుషుల నిష్కల్మషానురాగమే సృష్టి స్థితికి మూలమై, మానవ జీవిత మాధుర్యమై నిలిచింది. నిర్మలమయిన ఈ అనురాగాన్ని ఈర్ష్యా ద్వేషాలతో కాంక్షలతో మలినం చేసినపుడు మాత్రమే, అది క్షుద్రమవుతుంది. అప్పుడే వాతావరణం కలుషిత మవుతుంది.

అసలిటువంటి అనుభూతి పొందగలిగే అదృష్టం మాత్రం ఎందరికీ ? ఇది జీవితానికి వరము. శాపము కాదు.

ప్రయత్నంమీద సాధించి అలవరచుకున్న తన మనో సంయమనంతో చాలా రోజుల తరువాత, గిరి నిశ్చింతగా, హాయిగా నిద్రపోయాడు.

# 7

ఆ తోటలో ఒక మూలగా పెద్ద తోట బావి ఉంది. హరి కుటుంబం ఆ తోటలో రక రకాల ఫల వృక్షాలనూ, కొన్ని పువ్వుల మొక్కలనూ పెంచుతున్నారు. తోట బావి నుండి నీళ్ళు తోటంతా ప్రవహించడానికి ఒక మిషను ఉంది. తోటంతా సిమెంటుతో తయారు చేయబడిన తూములున్నాయి—ఆ తూములగుండానే నీళ్ళు మొక్క లన్నింటికీ ప్రవహిస్తూ ఉంటాయి. పువ్వుల మొక్కల మధ్య భాగంలో ఒక విశాలమైన స్థలం ఉంది. అక్కడ ఒక పందిరి వేసారు, ఆ పందిరి క్రింద

కొంచెం ఎత్తు తక్కువగా ఉన్న ఒక విశాలమైన అరుగు కట్టబడి ఉంది. ఎప్పుడైనా అక్కడికివచ్చి కూర్చోడానికని, హరే ఏర్పాటు చేశాడు. అలాగ—అదిగాక, ఆ తోటలో ఒక పెంకుటిల్లు కూడా ఉంది. ఆ ఇంట్లో ఆ తోట చూసుకునే మాలి కుటుంబంతో సహా ఉంటున్నాడు. హరి, గిరీ, దుర్గా, శంకర్, ఉమా బిలబిల్లాడుతూ తోటలోకి వచ్చారు. కూడా వచ్చిన పనివాడు, ఫలహారాల బుట్టలూ, ఫ్లాస్కూ, పళ్ళు అన్నీ సిమెంటు అరుగు మీద ఒక వారకు సర్దాడు.

గిరి చాలా హుషారుగా ఉన్నాడు. దుర్గకూ హుషారుగానే ఉంది. శంకర్ ఎప్పటిలా నిర్లిప్తంగా ఉన్నాడు-హరీ, ఉమా మాత్రం దిగులుగా ఉన్నారు. కానీ, వారి దిగుళ్ళకు కారణాలు వేరు. దుర్గ గ్రామఫోన్ తీసి రికార్డులు పెట్టడం ప్రారంభించింది. ఉమతో కలిసి తోటంతా చుట్టిరావాలని హరి కోరిక. ఒకసారి, చిన్నగా ఉమ దగ్గర ఆ విషయం కదిపి, ఉమ కస్సు మనడంతో ఆగిపోయాడు. ఈ విషయం పరధ్యానంగా ఉన్నట్లే గమనించాడు గిరి—అతనికి శంకర్ విషయం దుర్గతో ప్రస్తావించాలని ఉంది. తన మాటలకు దుర్గ విలువ నిస్తుంది—శంకర్‌కు తన మాట వేదమే! అయినా, తను ఎవ్వరినీ నిర్బంధించాలని అనుకోవటంలేదు. దుర్గా, శంకర్‌లకు ఇద్దరికీ ఇష్టమయి, ఇద్దరూ భార్యాభర్తలయితే అది అందరికీ; సంతోషకరమయిన సంగతి.

చటుక్కున "దుర్గా! ఏ రికార్డులు తరువాత ఒకసారి అలా తిరిగివద్దాం వస్తావా ?" అన్నాడు.

దుర్గ వెంటనే తన అంగీకారం తెలిపింది. శంకర్ అంతకు ముందే ఆ తోటమాలితో ఆ తోట ఫలసాయం గురించీ, దాని వల్ల వచ్చే లాభ నష్టాల గురించీ మాట్లాడుతూ, దాని వివరాలు కనుక్కుంటూ, అతని దగ్గర కూర్చున్నాడు.

దుర్గతో కలిసి బయలుదేరుతూ, గిరి వెనక్కు తిరిగి హరి వంక చూసి కొంటెగా నవ్వి వెళ్ళాడు. హరి మనసులో గిరికి వెయ్యి ధన్యవాదా లర్పించుకున్నాడు. అంతేకాదు అతనంత స్వతంత్రంగా దుర్గను తనతో రమ్మనటం, దుర్గ సంతోషంగా ఒప్పుకోవటం హరికి మొదటిసారిగా లీలగా ఏదో భావం స్ఫురించింది. ఆ భావన అతని కెంతో ఆనందాన్ని కూడా కలుగజేసింది.

ఉమ మనసు కలుక్కుమంది—అంతకంటె గిరి పోతూ, పోతూ నవ్విన నవ్వు ఆమె మనసును మండించింది. ఆ నవ్వులో అర్థం స్పష్టంగానే ఉంది. గిరి భావముల కది ప్రతిబింబం. అయ్యో! తనను హరి ప్రియురాలుగానే భావిస్తున్నాడు గిరి ఎన్ని యుగాల కయినా. తానాతనిని ఒక దేవతలాగ ఆరాధి స్తూందని అర్థం చేసికోగలడా?

"ఎలాగైనా, గిరికి చొరవ ఎక్కువ—చూడు! నువ్వు నా దానివని ఇక్కడ అందరికీ తెలిసిందే గదా! అయినా నిన్ను నాతో రమ్మని అడగలేకపోయాను. గిరి దుర్గను తీసుకు పోయాడు." కృత్రిమమైన చిరునవ్వుతో అన్నాడు హరి—ఆ మాటలకు ఉమకు కడుపులో తిప్పినట్లయింది. ముఖం పక్కకు తిప్పుకు కూర్చుంది. "గిరి దుర్గను ప్రేమిస్తున్నాడని అను మానంగా ఉంది ఉమా! గిరి నాకు బావ కావటం కంటే

నేకోరుకునే దేముంటుందీ" అన్నాడు. మళ్ళీ—ఉమకు కంపర మెత్తుతూంది.

"గిరి ఒక్క దుర్గనే ఏం కర్మ. నిన్నూ, నన్నూ, శంకర్‌నీ అందరినీ ప్రేమిస్తున్నాడు, అందుకే అందరికీ ఇన్ని తిప్పలు" అని కెయ్యిమంది—ఆమె విసుగుకు తెల్లబోయాడు హరి. ఆమె మాట లతనికి సరిగా అర్థం కాలేదు. అయినా వివరంగా అడిగే టంత సాహసం మాత్రం కలుగలేదు. కొన్ని క్షణాలు మౌనంగా గడిచాయి—నిశ్శబ్దాన్ని భరించలేక, హరి "మళ్ళీ ఎన్నాళ్ళకు కలుస్తామో ?" అన్నాడు.

ఉమ దూరంగా విరబూసిన చామంతుల వంక చూస్తూ మౌనంగా కూర్చుంది.

"గిరి పుణ్యమా అంటూ మన కేకాంతం లభించింది. అలా ముభావంగా ఉండకు ఉమా! ఏదైనా మాట్లాడు" ప్రాధేయపడుతున్నట్లుగా అడిగాడు హరి.

ఉమ ముఖం చిట్లించి, "ఏకాంతం కావాలనుకుంటే శ్రమపడి ఇంత దూరం రావటమెందుకూ ? నలుగురం కలిసి సరదాగా గడపటానికి వచ్చాంకాని పద! మనం కూడా వాళ్ళ దగ్గరకు వెళ్దాం!" అంటూ సమాధానంకోసం ఎదురు చూడకుండానే నడవటం మొదలు పెట్టింది—హరి గత్యంతరం లేక ఈసురోమంటూ, ఆమె ననుసరించాడు. ఆఖరి ప్రయత్నంగా "పాపం ! దుర్గా, గిరీ, ఏ సన్నివేశంలో ఉంటారో ? మనం వాళ్ళని డిస్టర్బ్ చెయ్యటం...." అంటూ నసిగాడు.

ఉమ అసహ్యంగా హరి వంక చూసి, "ఏం మనుష్యులూ? అంత మనలాగే అనుకుంటాం! మనచేత డిస్టర్బ చేయించబడే ఏ భయంకర సన్నివేశంలోనూ, వాళ్ళు ఉండరు. మరేం ఫర్వాలేదు." అంది. హరి మాట్లాడలేక పోయాడు. కాని, తానన్న సామాన్యమైన మాటలకు, ఉమ ఎందుకింత అసహ్యించుకొంటూందో అతని కర్థం కాలేదు.

బత్తాయి చెట్లమధ్య ఒత్తుగా మొలిచిన పచ్చ గడ్డిమీద కూర్చుని ఉన్నారు. దుర్గా, గిరిలు — ఎర్రగా కందిపోయిన ముఖంతో, భరించలేని సిగ్గుతో తలవంచుకుని "హా! గిరీ.... అంటూ ఏదో అనబోయిన దుర్గ హరి, ఉమలను చూసి చటుక్కున ఆగిపోయి, "అరే! మీరూ ఇక్కడకు వచ్చారే!" అంది. దుర్గ సిగ్గూ, ఆమె ముఖములోని అరుణిమా ఉమ గుర్తించలేదు. కాని, అదే దృష్టితో ఉన్న హరి. అది గమనించి తనలో తను నవ్వుకున్నాడు.

"ఏం కష్టంగా ఉందా?" కొంటె నవ్వుతో అడిగాడు హరి. గిరి అందుకుని, "మాకేం కష్టం? మీరు కష్టపడుతున్నారని గాని"—అన్నాడు.

"అందరి కష్టసుఖాలూ చూసుకునే దయామయులు మీరుండగా, ఎవరికీ మాత్రం ఏ కష్టం?" ఎత్తి పొడుపుగా అంది ఉమ కూర్చుంటూ.

"ఏం? నేను మీకేం కష్టం కలిగించానూ? చూడరా హరీ! మీ ఉమకు కొంచమైనా కృతజ్ఞతలేదు" అన్నాడు గిరి.

"ఇవాళ ఎందుకనో ఉమ మూడ్‌లో లేదు.".

"ఆవేదనరా బాబూ! ఆవేదన!—అంత మాత్రం అర్థం చేసుకోవేంరా" హరి, ఉమల వంక చూస్తూ పకపక నవ్వాడు గిరి. హరి తాను కూడా శృతి కలిపాడు—దుర్గ ముఖం పక్కకు తిప్పుకుంది. ఉమ చికాకుగా ముఖం చిట్లించుకుంది.

అంతలో తోటమాలితో మాట్లాడుతూ శంకర్ కూడా అటువైపునకు వచ్చాడు. శంకర్‌ను చూసి గిరి చప్పట్లు కొడుతూ "ఏమయ్యోయ్ ఆది శంకరా, భవానా శంకరా! ఈ లోకంలో బేరాలు సారాలు, లాభనష్టాలు కాక తెలిసికో వలసినవి, చూసుకోవలసినవి చాలా ఉన్నాయి—ఇలారా!" అన్నాడు. శంకర్ కూడ వాళ్ల మధ్యకువచ్చి కూర్చుంటూ "నేను ఇక్కడికి వద్దామని అనుకుంటున్నాను. నాకు ఆకలి వేస్తూంది." అన్నాడు. గిరి నవ్వాడు. "ఏం మనిషివిరా! ఆకలి వేస్తేనేకాని. మేమంతా గుర్తురాలేదన్న మాట!. పద నాయనా! పద! తిందువుగాని" అంటూ లేచాడు. అతనితో పాటు అందరూ లేచారు. అందరూ పందిరి క్రిందకు చేరు కున్నారు. ఉమ అన్యమనస్కంగా ఒక వారకి కూర్చుంది. దుర్గే అందరికీ, ఆకులు వేసి, ఫలహారాలు పెట్టసాగింది.

"చూడు శంకరా! మా దుర్గ ఎంత పనిమంతురాలో!" అన్నాడు గిరి నవ్వుతూ.

శంకర్ పరధ్యానంగా "మరే! కానీ! ఈ తోటలో చాలాభాగం పువ్వుల మొక్కలకు వృధాచేస్తున్నారు. ఇక్కడే వైనా, కాయగూరలు పండిస్తే బాగుండేది? అన్నాడు.

శంకర్ సమాధానానికి దుర్గ నవ్వుకుంది, . గిరి శంకర్ భుజం తడ్తూ, "నేను నీతో మాట్లాడింది. ఆ విషయం కాదు నాయనా! సరేలే! ఫలహారం కానివ్వు." అన్నాడు.

అందరూ, ఫలహారాలు, కాఫీలు ముగించాక పేకాట ప్రారంభించారు. క్రమక్రమంగా చీకటి పడసాగింది.. ఇక లేద్దామని లేచి నౌకరుని కేక లెయడానికి వెళ్ళాడు హరి. దుర్గ సామానులు సర్ద సాగింది. శంకర్ బయట మొక్కలను పరీక్ష చెయ్యడంలో మునిగి పోయాడు. సందుచూసుకొని ఉమ గిరితో "వెడుతున్నాను. ఉత్తరాలు వ్రాస్తే సమాధానమిస్తారా?" అంది. ఈ ప్రశ్నకు గిరి ఆశ్చర్య పోయాడు. మనసులో ఉవ్వెత్తున లేచిన ఆనంద తరంగాలను నిర్దాక్షిణ్యంగా అణచి వేస్తూ, అతి సాధారణంగా "నాకెవరుత్తరాలు వ్రాసినా సమాధానం వ్రాస్తాను. కాకపోతే, కాస్త ముందు వెనుకా, అంతే!" అన్నాడు. అతని నిర్లిప్తత ఉమకు కష్టం కలిగించింది. "మీ సమాధానం కోసం, ఆత్రుతగా ఎదురు చూస్తూ, ఉంటాను." అంది ఊరుకోలేక.

"ఎందుకూ, ఎదురు చూడటం? పోస్టులో వేసింది, మీరు ఎదురు చూసినా, చూడకపోయినా వస్తుంది." అని అక్కడ ఉండకుండా "శంకర్" అంటూ బయటకు నడిచాడు.

దుర్గ అక్కడకు కొంత దూరంలోనే, ఉండటం వలన ఉమా, గిరిల సంభాషణ అంతా వింది. ఒక్కసారిగా దుర్గకు ఉమ ఎం.బి.బి.యస్.లో చేరతా ననడానికీ, ఆమె ముభావానికీ, హరి మీద ఆమె చీటికీమాటికీ, విసుక్కోవటానికీ గల కారణం అర్థమయింది. ఆశ్చర్యంతో ఉమ దగ్గరగా వచ్చి కూర్చుంది.

ఉమ కళ్ళలో నీళ్ళు తిరుగుతున్నాయి. దుర్గ ఏమీ మాట్లాడకుండా ఉమ కన్నీళ్లు తుడిచింది. సానుభూతితో ఉమ చేతిని తనచేతిలోకి తీసుకొని మృదువుగా నొక్కింది. ఉమ "దుర్గా" అంటూ ఏదో చెప్పబోయేలోగా, హరి, నౌకరు, గిరి, శంకర్ వచ్చారు. అందరూ తిరుగుముఖం పట్టారు.

# 8

ఆరోజు తోటలో, గిరి చెప్పిన దగ్గర్నుండీ శంకర్ గురించి ఎక్కువగా ఆలోచించసాగింది. దుర్గ

"దుర్గా! నేను కూడా నిన్ను హరిలాగానే ప్రేమిస్తున్నాను. అందుకనే ఈ విషయం చెప్పడానికి సాహసిస్తున్నాను. శంకర్, నువ్వు భార్యాభర్త లయితే బాగుంటుందనిపిస్తుంది నాకు అయినా నువ్వే ఆలోచించుకో! అతను ఏమీ చదువుకోలేదు. ఆచదువు లేకపోవటానికి కారణం అతని తెలివి తక్కువకాదు. చిన్నప్పటినుండి తగిన శ్రద్ధతీసికోక పోవటం, అయినా అతనికి డబ్బుకేలోటూ లేదు. చాలా రోజుల్నుండీ నాకు బాగా తెలుసు. సహృదయుడనే అనిపిస్తుంది. నాకొక చెల్లెలుంటే తప్పక శంకర్ కే ఇచ్చేవాడిని అందుకే ఇప్పుడు ఈ నీ దగ్గర ఈ ప్రస్తావన తెస్తున్నాను." అన్నాడు గిరి.

దుర్గకామాటలు తరుచు గుర్తుకు వస్తున్నాయి. శంకర్ ది మంచి నిండైన విగ్రహము, చామనఛాయ—కళ్ళు

చిన్నవైనా, ఆకర్షణీయమైనవి. మొత్తానికి చూడంగానే చాలా అందగాడనిపిస్తుంది. శంకర్ చాలా అందమైనవాడని దుర్గ ఇదివరకే మనసులో అనుకొంది. ఆలోచించినకొద్దీ శంకర్ తన భర్త కావటం తన అదృష్టమే ననిపించింది దుర్గకు—అతనికి చదువులేదు. అయితే ఏం? అదీగాక, తను మాత్రం మరీ చదువుకుందా ?

ఆలోచించి, ఆలోచించి, తన అంగీకారాన్ని గిరికి చెప్పింది దుర్గ. శంకర్‌ను గూడా సంప్రతించి హరి ద్వారా ఈ విషయం దుర్గ తల్లిదండ్రులకు చెప్పించే భారం తనమీద వేసికొన్నాడు గిరి.

శంకర్‌ను వివాహం చేసికోవాలని నిశ్చయించుకున్న క్షణంనుంచీ, దుర్గ శంకర్‌ను హృదయపూర్వకంగా ప్రేమించ నారంభించింది. ఏ పని చేస్తున్నా, ఆమె కళ్లముందు శంకర్ సుందరరూపమే ప్రత్యక్షం కాసాగింది. అట్లాంటి శంకర్ భార్య కాగలిగే అదృష్టం తనకు కలిగించినందుకు, గిరిని మనసారా అభినందించుకుంది. శంకర్‌తో తను మాట్లాడింది చాలా తక్కువ. అసలతడిని పరిశీలనగా చూసిందికూడా లేదు. అయినా అతడిని మనసులో తలచుకోగానే, తన హృదయ మంతా అనిర్వచనీయమైన ఒక మధురిమతో నిండిపోతూంది.

ఒకనాడు దుర్గ ఒక్కతే తోటకు బయలుదేరింది. అప్పుడప్పుడు పూలకోసం ఒక్కతే అలా రావటం దుర్గ కలవాటే పూలమొక్కల మధ్య నడుస్తూంటే ఆనాడు శంకర్ ఈ పూలమొక్కల గురించి చేసిన వ్యాఖ్యానం గుర్తుకు వచ్చి నవ్వుకుంది. అంతలో దూరంగా శంకర్ తనవైపే వస్తూండడం

చూసి తన కళ్లను తాను నమ్మలేక పోయింది. దుర్గ శంకర్ సమీపిస్తున్నకొద్దీ ఆమె శరీరం సిగ్గుతో, భయంతో వణక సాగింది. శంకర్ దుర్గ దగ్గరగా వచ్చి, "చాలా రోజుల్నుంచీ సరిగ్గా ఈ సమయంలో, ఈ వనంలో తపస్సు చేస్తున్నాను. ఇన్నాళ్లకు దేవి సాక్షాత్కారమయింది." అన్నాడు. దుర్గకు ఆశ్చర్యమయింది. భయమూ, సంతోషమూ కలిసిన ఒకానొక భావోద్వేగంతో ఆమె మనసు ఉద్విగ్నమవుతూంది. మాట్లాడ లేక నిల్చుంది.

"అలారా దుర్గా! ఆ సన్నజాజి పందిరి క్రింద కూర్చుందాం." చొరవగా, చనువుగా, అడిగాడు శంకర్. దుర్గ రానననలేక పోయింది. తడబడే అడుగులతో అతని వెనుకనే, నడచి, అతనికి కొంచెం దూరంగా పచ్చికమీద కూర్చుంది.

"నీకు సన్న జాజి పువ్వులంటే చాలా ఇష్టం కదూ!" అన్నాడు చేతికందిన సన్నజాజి మొగ్గలను తుంపుతూ శంకర్.

"మీకు ఎవరు చెప్పారు ?" మృదువుగా అంది దుర్గ తలవంచుకుని.

"ఒక రోజున బత్తాయి పళ్లకోసం ఇక్కడికి వచ్చాను. అప్పుడు, మాలి ఏదో మాటలమీద నీకు పువ్వులంటే చాలా ఇష్టమనీ, అందుకనే మీ నాన్నగారు, ఇన్ని పూల మొక్కలు వేయించారనీ అందులో సన్న జాజులంటే నీకు చాలా ఇష్ట మనీ రోజూ ఆ పూలు నీకు పంపిస్తుంటారని, అప్పుడప్పుడు

నువ్వే వచ్చి కోసుకెళ్తుంటావనీ చెప్పాడు. అప్పట్నుంచీ, ఇంచుమించు ఈ సమయంలో రోజూ నీకోసం ఎదురు చూస్తున్నాను."

"ఎందుకూ ?"

"నీతో మాట్లాడవలసి ఉంది."

దుర్గ ఆశ్చర్యంగా కనుబొమలు పైకి లేపింది.

"అసలు మన పెళ్ళి నిశ్చయం కాకముందే నీతో మాట్లాడాలనుకున్నాను. కానీ, అవకాశం చిక్కలేదు. గిరి ఈ వార్తను చెప్పినప్పుడు నమ్మలేక పోయాను." ఆగాడు శంకర్.

"అసలు విషయం ఏమిటన్నట్లు చూసింది దుర్గ.

శంకర్ కొంత గొంతు సవరించుకుని "నీకు తెలుసు నేనేమీ చదువుకోలేదు..." అని ఇంకా ఏమో చెప్పుతుండగానే దుర్గ మధ్యలో అడ్డు తగిలి "అందుకు నాకేమీ అభ్యంతరం లేదు. నేను పెద్ద చదువుకున్న దానిని కాను." అంది వినయంగా—శంకర్ అల్పంగా విస్కుకుని "అదికాదు—విను, కొందరు ముందర గబుక్కుని పెళ్ళిళ్ళు చేసేసుకుని ఆ తరువాత తీరుబడిగా ఒకళ్ల లోపాలు, ఒకళ్లు వెతుక్కుంటారు పెళ్ళంటే కనీసం మన భారతదేశంలో ఆజన్మాంతమూ ఉండే బంధమని అందరికీ తెలిసే అందరూ సరిగ్గా ఈ విషయమే మరచిపోతారు. అందుకనే నీతో అన్ని విషయాలూ నేను ముందుగానే మాట్లాడదల్చుకున్నాను. నేను చదువుకోలేదని నావ్యక్తిత్వాన్ని నేనెన్నడూ తక్కువగా భావించలేను.

నా భార్య తనమాటలోగాని, తన ప్రవర్తనలోగాని ఏ సందర్భంలోనైనా నా కంటె ఎక్కువదాన్ననే భావం చూపించటం నేను సహించలేను" అన్నాడు.

దుర్గ వ్యాకుల స్వరంతో, "నా కంటే అన్నివిధాలా అధికుడయిన వ్యక్తినే నేను వివాహం చేసుకుంటున్నాను. అయినా ప్రేమమయ జీవితంలో ఎక్కువ తక్కువ లేమిటి?" అంది. ఈ మాటలకు శంకర్ అదోకరకంగా నవ్వాడు. ఆ నవ్వులో భావం దుర్గకు అర్థం కాలేదు.

శంకర్ మళ్ళీ "నాకు తండ్రి లేరు—కానీ తల్లి ఉంది. ఆమె ఏ సందర్భంలోనూ అవమానింప బడకుండా నాతోనూ, నా కుటుంబంతోనూ, చూడబడాలని నా కోరిక. ఒక అక్క గూడా ఉంది. ఆమె సంసారం ఆమె చేసుకుంటూంది. ఎప్పుడైనా ఆమె నాఇంటికివస్తే తిరిగి సంతృప్తిగా వెళ్ళాలి."

"నేను మనసారా అభిమానించే వ్యక్తికి అభిమాన పాత్రులయిన వారందరూ నాకు అభిమాన పాత్రులే! వారందరినీ నేను మనసారా అభిమానించి గౌరవిస్తాను."

ఆర్ద్ర స్వరంతో సమాధాన మిచ్చింది దుర్గ — శంకర్ కళ్ళు సంతోషంతో మెరిసాయి. తడబడుతున్న అడుగులతో, ఆమె సమీపానికి వచ్చి, తన చేతిలోని ఒక్క సన్న జాజి మొగ్గనూ ఆమె జడలో తురిమాడు. ముందుకు వంగి దుర్గ గెడ్డం పుచ్చుకుని ముఖంపైకెత్తి కళ్ళలోకి చూస్తూ "దుర్గా" అన్నాడు. మత్తుగా—పరవశత్వంతో, సిగ్గుతో దుర్గ కనులు అరతోడ్పులయ్యాయి. దుర్గ నిలువెల్లా పులకించింది. మృదు

వుగా అతని చేతులను విడిపించుకుని, దూరంగా తొలగి "వస్తాను" అని గాలిలో తేలిపోతున్నట్లుగా తన ఇంటికి చేరుకుంది. ఆ రాత్రి దుర్గకు కనులు మూత పడలేదు. తన తలలోని సన్నజాజి మొగ్గను ఆప్యాయంగా గుండెలకు హత్తుకుంది. కొద్దిపాటి పరిచయంతోనే తనను 'నువ్వు' అని పిలవగలిగిన అతని చొరవ, పక్కా వ్యాపార సరళిలో సాగిన అతని సంభాషణ, అతని మాటలలో ధ్వనించిన అధికారమూ, కొద్ది పాటి అపస్వరాల నామె మనసులో పలికింపక పోలేదు. అయినా శంకర్ సుందర స్వరూపం ఆమెకు సమస్త అపస్వరాలనూ అణచి వేసే మోహన రాగమయింది — "దుర్గ తనను తానే అర్థం చేసికోలేకపోతూంది" అన్న గిరి మాట లామెకిప్పు డర్థమియ్యాయి—గిరిని మనసారా "నా గిరి అన్నయ్య! దేవత!" అనుకుని తృప్తిగా నిద్రపోయింది.

# 9

పెళ్ళి పందిరంతా మెర్క్యురీ లైట్ల కాంతితో ధగధగ ప్రకాశిస్తోంది. పట్టుచీరెల రెపరెపలు, గాజుల గల గలలు, సువాసనల ఘుమ ఘుమలు, పిల్లల ఏడుపులు, హడావుడి కేకలు, కన్నె పిల్లల విలాసాలు, వయసుగాళ్ళ హోయలు, ఆడంగుల కబుర్లూ వీటన్నిటితో ఆ పందిరి కళ కళలాడిపోతోంది. పురోహితులు మంత్రాలు పఠిస్తున్నారు. సన్నాయి అత్యంత మధురంగా "సీతమ్మ పెళ్ళి కూతురాయెనే" వాయిస్తోంది. శంకర్ లేచి తన ఎదురుగా సీతాదేవిలాగ కూర్చున్న దుర్గ

మెళ్లో మాంగల్యాలను సూత్రంతో బంధించాడు. దుర్గ గుండెలు దడదడలాడాయి. ఆనాటితో తన జీవిత చరిత్ర పూర్తిగా మారిపోయిందనుకుంది. తనను తాను మనసారా శంకర్ పాదాలకు సమర్పణ కావించుకుంది. అంతులేని సంతోషంతో గిరి వాళ్ళ మీద ఉత్సాహంగా అక్షింతలు వేశాడు. మనసులో ఏమేమో ఆశీర్వదించుకుంటూ. హరీ, ఉమా కూడా వధూవరులపై అక్షింతలు జల్లారు——గిరి హరి వెనుకగా వచ్చి, భుజం మీద చెయ్యివేసి "తొందరపడకు నాయనా! ఇంకో మూడేళ్ళాగు. నీ నెత్తిమీద కూడా మేమంతా అక్షింతలు వేస్తాం," అన్నాడు. హరి నవ్వాడు. కానీ, ఆ నవ్వులో ఏదో వెలితీ, దిగులు కనిపించాయి. అది గమనించిన గిరి మనసు సానుభూతితో నిండిపోయింది. తాను ఆ చిరు నవ్వులోని దిగులును పోగొట్ట గలుగుతే....అది సాధ్యమా ? అప్రయత్నంగా ఆతని చూపులు ఉమకోసం వెతికాయి. ఆడ వాళ్ళలో ఎవరితోనూ కలవకుండా, ఒక స్థంభానికి ఆనుకుని నిపుణుడైన శిల్పి చెక్కిన విగ్రహంలా ఉన్న ఉమ, తదేకంగా దుర్గా, శంకరులను చూస్తోంది. గిరి తీక్షణమయిన చూపులకు ప్రభావితురాలయి, ఉమ కూడ తన చూపులను తిప్పింది. అప్రయత్నంగా ఆమె పెదవులపై చిరునవ్వు నాట్యం చేసింది. గిరిని చూస్తూనే ఉమ కళ్లు ప్రాణం పెట్టాయి—ఆమె చిరునవ్వులోని మాధుర్యమూ, కళ్ళలోని ఆప్యాయత, గిరికి తేలికగానే అర్థమయ్యాయి. సమాధానంగా తను నవ్వాడు. సంతోషమూ, దుఃఖమూ, అతని మనసులో సమంగా నాట్యం చేస్తున్నాయి.

పెళ్ళి పనుల్లో ఉమ ఎంతో పాల్గొంది. వడ్డనలలో దుర్గను తయారు చెయ్యటంలో, బ్రాహ్మణులకు, పెద్దలకూ, అవీ, ఇవీ అందించటంలో అంతటా ఉమ తానే ఐంది.

కానీ, అక్కడ సమావేశమయిన వారిలో ప్రతి ఒక్కరు తనను హరి కాబోయే భార్యగా గుస గుస లాడి నప్పుడూ, కొందరు మోటుగా ముఖం ఎదురుగానే, వేళాకోళం చేసినప్పుడు మాత్రం ఉమ మనస్సు కలుక్కు మనేది. హరి కూడా హడావుడిగా తిరుగుతూనే ఉన్నాడు. కానీ, అతని కంత హుషారుగా లేదు. శంకర్ స్థానంలో అతను మొదటి నుంచీ గిరినే ఊహించుకున్నాడు. దుర్గా శంకర్ ల వివాహ ప్రస్తావన విన్నప్పుడు, హరి ఎంతో ఆశ్చర్యపోయాడు. బహుశా, దుర్గే గిరిని కాదని ఉంటుందని ఊహించుకున్నాడు. చెల్లెలి మీద ఎంతో కోపమూ, గిరి పట్ల సానుభూతి కలిగాయి. గిరి పెళ్ళి పనుల్లో ఉత్సాహంగా పాల్గొంటూంటే, గిరి మీద అతనికి గౌరవం పెరుగ సాగింది. ఈ సానుభూతి భావన హరిని గిరికి మరింత సన్నిహితుడ్ని చేసింది.

దుర్గా శంకర్ లకు ఆ రాత్రే పునస్సంధానం నిర్ణయించారు. ఉమ తన చేతులతో స్వయంగా దుర్గను అలంకరించింది. తెల్లని చీర, తెల్లని జాకెట్టు, జడలో తెల్లని సన్న జాజులు, ఎక్కడలేని అందాన్ని సంతరించు కుంది. ఉమ వంగి దుర్గ చెవిలో "ఈ రోజు నీ కోసం క్రొత్త ప్రపంచపు తలుపులు తెరుచు కుంటున్నాయి. పో. జాగ్రత్తగా ప్రవేశించు, ఆ లోకం లోకి". అని బుగ్గ మెలిపెట్టింది. నోట మాట రాక దుర్గ ఆమెను తన చేతితో మృదువుగా వెనక్కు నెట్టింది.

అప్సరసలా, అడుగు పెట్టిన దుర్గను చూసి శంకర్ నిలువెల్లా పులకరించాడు. ఆమెను సమీపించి కౌగిట్లో పొదివికొని, "నీ, శరీర కాంతితో, ఈ గది నంతా ప్రకాశమానం చేశావు. నీ ఆంతరంగిక సౌందర్యంతో నా బ్రతుకును తేజోమయం చేయాలి." అన్నాడు. ఈ మాటలకు దుర్గ ఎంతో సంప్రీతురాలయింది. ఆరాధనాభావంతో అతని వంక ఒకసారి చూసి, అతని కౌగిట్లోంచి జారి పాదాలకు నమస్కరించింది. శంకర్ ఆమెను ఆప్యాయంగా లేవనెత్తి గాఢంగా గుండెలకు హత్తుకుని, సిగ్గుతో తల వంచిన ఆమె చుబుకాన్ని స్పర్శించి ముఖాన్ని పైకెత్తి "సమాధానం ఇయ్యావూ" అన్నాడు.

దుర్గ బలవంతాన గొంతు పెగుల్చుకుని "నాదేమీ లేదు. మీ తేజస్సే, నాలో ప్రతిఫలిస్తూండ వచ్చు." అంది. శంకర్ నవ్వి ఆమెను తన రెండు చేతులతో ఎత్తుకుని మంచం మీద పడుకో బెట్టాడు.

కోడి కూత విన్న దుర్గ "ఎలా తెల్లవారిందా?" అని ఆశ్చర్య పోయింది, తనవంక కొంటెగా గర్వంగా చూసే శంకర్ నేత్రాలను, తన మెత్తని చేతులతో మూసి, చటుక్కున మంచం మీంచిలేచి గది తలుపులు తీసుకుని తడబడే కాళ్ళతో బయటకు నడచింది.

# 10

ఉమ తన ప్రయాణానికి, అన్నీ సర్దుకుంటూంది-హరి ఆమెకు సమీపంలోనే ఒక సోఫాలో కూర్చున్నాడు. ఎంతకూ

ఉమ తలెత్తక తలవంచుకుని తన పని తాను చూసుకుంటూంటే, హరి విసుగెత్తి 'ఉమా' అన్నాడు ఆమె దృష్టి మళ్ళించడానికి ఉమ ఒకసారి తలెత్తి చూసి మళ్ళీ తన పనిలో లీనమయింది.

"కాస్త నా మాట విను". అన్నాడు హరి కరుగ్గా.

"వింటూనే ఉన్నాను. మాట్లాడు." అంది. ఉమ నిర్లక్ష్యంగా తలెత్తకుండానే.

"అదికాదు ఉమా ! మనం పెళ్ళి చేసికొంటే మాత్రం నువ్వు చదువుకోవటానికి కేం ?"

"బావా !...." విసురుగా తలెత్తిన ఉమ హరి ముఖం చూసి తల దించుకుంది.

"నన్ను పది సార్లు విసిగిస్తే నీకేం వస్తుంది ?"

హరి ముఖం మీద చన్నీళ్లు జల్లినట్లుంది ఆ సమాధానం కొన్ని క్షణాలు మాట్లాడలేక పోయాడు.

"నిన్ను విసిగిస్తున్నానా, ఉమా !"

"చాలా !..."

హరికి కష్టం తోచింది. ఉమ వంక నిదానించి చూస్తూ "అసలు నీకు నా మీద మునుపటి ప్రేమ లేదులా ఉంది." అన్నాడు.

"ప్రేమలో, మునుపటికి, ఇప్పటికీ, తేడా ఏమీ లేదు. అర్థం చేసికోవటంలో ఉంది."

"అంటే..."

ఉమ హరి ముఖంలోకి చూసింది. ఏదో చెప్పాలని ఆమె పెదవులు కదిలాయి. అంతలో తల వంచుకుంది ఆమె ఏదో చెప్పబోయి సందేహిస్తూందని హరి గ్రహించాడు.

"నా దగ్గిర సంకోచ మెందుకు ఉమా! చెప్పు!..." అన్నాడు.

ఉమ ధైర్యం చేసింది.

"నా మనసు చదువుమీద తప్ప మరి దేనిమీదా లేదు. నువ్వు పెళ్లి చేసేసుకుంటే మంచిది బావా?"

హరి ఉలికిపడి నిటారుగా కూర్చున్నాడు.

"ఇలా నువ్వు మాట్లాడటం, ఇది రెండవసారి. ఇదేమిటి ఉమా! నేను నిన్ను తప్ప, ఇంకెవరినీ పెళ్లి చేసికోను. నన్ను తప్ప ఇంకెవర్నీ నిన్ను చేసికోనివ్వను. నువ్వు నా దానివి."

ఉమ గుండెలు ఝల్లుమన్నాయి. హృదయంలోనుండి మూగగా అల్లరి పెడ్తున్న అంతం లేని అనేక భావాలు, హరి ముందు భాషను కల్పించుకోలేక పోతున్నాయి. హరి అమాయకమైన ముఖమూ, అతని నిర్మలమైన అనురాగమూ, ఆమె గొంతు నొక్కివేస్తున్నాయి. హరి దీక్షగా క్షణకాలం, ఉమ ముఖంలో మారే రంగుల్ని పరిశీలించాడు. ప్రప్రథమంగా అతనికి ఉమకు తనమీద గల అనురాగంమీద శంక జనించింది. కానీ, ఆ భావన కూడా అత డెక్కువ కాలం భరించలేక పోయాడు. తన వ్యథిత హృదయాన్ని తానే అసందర్భపు సమాధానాలతో ఊరడించుకున్నాడు.

"పోనీయ్‌లే ఉమా! రెండేళ్లు గడిచిపోయాయి. ఇంక మూడేళ్లు ఎంతలో గడిచిపోతాయీ? ఇంకెప్పుడూ నిన్ను విసిగించనులే!" అన్నాడు. ఉమ కడుపు తరుక్కుపోయింది. ఇటువంటి హరికి తను అసలు విషయాన్నెలా చెప్పగలదు? చెప్పకుండా ఎలా ఉండగలదు?

"నన్ను క్షమించు బావా!" అంది చెమ్మగిల్లిన కళ్లతో.

ఉమ చెమ్మగిల్లిన కళ్లు, హరికి మరొక విధంగా అర్థమయ్యాయి. అతని మనసులో అంతకు పూర్వం ఉన్న గ్లాని అంతా ఎగిరి పోయింది.

"ఊరుకో ఉమా! మనమధ్య క్షమాపణలేమిటీ? ఆర్ద్ర స్వరంతో అన్నాడు—

ఉమ మాట్లాడలేదు. హరే, మళ్లీ సంభాషణ ప్రారంభించాడు.

"పోనీ, ఇంకో రెండురోజు లుండరాదా?"

"వీల్లేదు బావా! నాకు సెలవు లేదు. అయినా నే నిక్కడుండి చేసేదేముంది?"

ఈ ఆఖరు మాటలు హరి మనసులో గుచ్చుకున్నాయి. ఎంత ఉత్సాహం తెచ్చిపెట్టుకున్నా, హరి మనసు మాటిమాటికీ ఉమ మాటలతో కృంగిపోతూంది. ఆమెతో సరదాగా కాలక్షేపం చెయ్యాలని - తానెంత ఉబలాట పడుతున్నాడో, ఆమె అంతగా దూరంగా పోతుంది.

విసుగ్గా అక్కడి నుంచి లేచిపోయాడు హరి—హరిలోని భావ పరివర్తనను ఉమ గమనించకపోలేదు. అతనిని వెనక్కు పిలుద్దామని అనుకునీ తన సానుభూతిని అతడు మరోకలాగ అర్థం చేసికోవచ్చుననీ, అతడిని మరింత ఉత్సాహ పరచడం మంచిది కాదనీ ఊరుకొంది.

సామానులన్నీ సర్ది వారగా ఉంచి, ఒక పత్రిక చేతిలోకి తీసికొంది. అంతలోనే బయట అడుగుల చప్పుడు వినిపించి ఉమ గుండెలను గుబ గుబ లాడించింది. ఆ అడుగుల చప్పుడు ఎంత గందరగోళంలో నైనా ఉమ గుర్తించగలదు. అవి గిరివి.

ఉమ, ఒక్కతే ఉండటం చూసి ఆశ్చర్యంగా "హరి ఇంట్లో లేడా?" అన్నాడు గిరి.

"లేడు. ఇప్పుడే రావచ్చు. కూర్చోండి." అంది ఉమ.

ఇట్లాంటి సన్నివేశాన్ని ఎదుర్కోవలసి వచ్చినందుకు గిరి ఇరుకున పడ్డాడు. నేను కూర్చోనని వెళ్లిపోవటం అతనికి సబబుగా తోచలేదు. ఆ శక్తీ లేకపోయింది. ఇట్లాంటి అవకాశం కోసం ఉమ రెండు సంవత్సరాలుగా తపస్సు చేసింది. ఎన్నెన్నో మాట్లాడాలని ఊహించింది. ఈనాడు నిజంగా తాను కోరుకున్న అవకాశం లభించినా ఆమెకు నోట మాట రావటంలేదు.

"బాగా చదువుతున్నారా?" అన్నాడు గిరి యథాలాపంగా—

"ఆ! కానీ, తరచు మీరంతా గుర్తుకొస్తూ ఉంటారు."

"మీరంతా అని నన్ను కూడా కలుపుతా రెందుకూ ?" మీరు చెప్పకపోయినా. మీకు హరి ఎప్పుడూ గుర్తుకు వస్తాడని నాకు తెలుసు."

"కాదు ! కాదు !—ఒక రకంగా మీరే ఎక్కువ గుర్తుకు వస్తారు. ఏం ? మీకు నే నెప్పుడు గుర్తుకు రానా ?"

"నాకు చేతినిండా పని ఉంటుంది. నేను ఎవ్వరి గురించీ ఆలోచించను." అని చటుక్కున లేచి నుంచుని "నాకు పని ఉంది. హరి వస్తే, నన్ను కలవమని చెప్పండి" అని అక్కడి నుండి వెళ్లిపోయాడు గిరి.

అలా వెళ్లిపోవలసి వచ్చినందుకు అతని హృదయము అంతులేని ఆవేదనతో మూల్గుతూందని తెలియని ఉమ అతడు నడిచిపోయిన మార్గం వంక శూన్యంగా చూస్తూ ఉండిపోయింది.

# 11

ప్రతినిత్యమూ, తమ ఇంటికి వచ్చిపోయే ఆంగ్లో ఇండియన్ స్త్రీ సముదాయంతో ఉక్కిరి బిక్కిరిగా ఉంది దుర్గకు. రీటా, థెరిస్సా, దిలారా ఇంకా ఎవరెవరో, ఇంచుమించు ప్రతి సాయంత్రమూ, తమ ఇంటికి వస్తూనే ఉంటారు. వాళ్ల ప్రవర్తన చాలా వెకిలిగానూ, అసహ్యంగానూ, అనిపించేది దుర్గకు—అన్నింటికంటె, వాళ్లతో మితిమీరిన చనువుతో వేళాకోళాలాడే భర్త ప్రవర్తన ఆమెకు కొంత సహింపరాని దిగా ఉన్నా, ఇంతింత మాత్రానికి వేరుగా భావించటం,

అనుచితమని తనకు తాను నచ్చచెప్పుకుంది. అయినా సాహసించి ఒకరోజు సాధ్యమైనంత సాధారణంగా "మీ షాప్స్‌లో అందరూ, ఇలాంటి ఆడవాళ్లనే ఉంచుకుంటే పని చక్కగా సాగుతుందా ? వీళ్లకు పనిమీద శ్రద్ధ ఉంటుందా ?" అంది.

శంకర్ పకపక నవ్వాడు.

"పిల్లు లేకపోతే పని సాగదు. వీళ్లుండేది వళ్లు వంచి పని చేయడానికి కాదు. దానికి వేరే మగ గుమాస్తాలున్నారు—తమ హొయలతో, వాల్చూపులతో, చిరునవ్వులతో అందరినీ షాపుకి ఆకర్షించటం-తమ మాటల చాకచక్యంతో ఒక రూపాయి వస్తువు కొనదల్చుకున్న వాళ్లచేత, వంద రూపాయల వస్తువులు కొనిపించటంవీళ్ల పని. ఆ పనిలో వీళ్లు చాలా నేర్పరులు తెలియటంలా ?"

దుర్గ ఆశ్చర్యంగా చూసింది.

"అయితే మరి..." అని క్షణకాలమాగి "అట్లాంటి తేలిక మనుష్యులతో మీరంత స్నేహముగా ఎలా మసలగలుగుతున్నారూ ?"

శంకర్ ఇంకోసారి బిగ్గరగా నవ్వాడు-

"నీ తలకాయ ! స్నేహ మేమిటి ? నా అందం చూసి వాళ్లు నా వెంట పడుతున్నారు. ఏదో కులాసా కాలక్షేపంలే, అని నేనూ సాగనిస్తున్నాను."

ఈ సమాధానానికి దుర్గ నిర్ఘాంతపోయింది. ఎంత అణచుకుందామన్నా అణగని అసహ్యం ఆమె మనసంతా

క్రమ్ముకోసాగింది-తాను తేలికగా భావించే వ్యక్తులతో కాలక్షేపం కోసం ఆనందాన్ని వెతుక్కోగలిగినవాడా తానారాధించే తన భర్త? తన సౌందర్యపు విలువను ఈ విధానంలో కొలుచుకోవా లనుకుంటున్నాడా?

శంకర్ దుర్గ ముఖంలో మార్పును కని పెట్టాడు. దగ్గిరగా వచ్చి నవ్వుతూ, "ఈర్ష్యా?" అన్నాడు.

దుర్గ ముఖం జేవురించింది. "ఛీ! నేను ఈర్ష్యపడటం సంభవిస్తే, నా సాటివారిని చూసి మాత్రమే ఈర్ష్య పడతాను." తీవ్రంగా అంది– ఆ తీవ్రత్వము శంకర్ మనసుకు చురుక్కున తగిలింది. ఒక లిప్త మాత్రం అతని బొమలు ముడి పడ్డాయి. అంతలో నవ్వుతూ దుర్గను తన చేతులతో చుట్టివేసి "వాళ్ళంతా, నా చేతిక్రింద పని చేసెవాళ్లు, వాళ్లతో మంచిగా ఉంటే, పని చురుకుగా సాగుతుంది. నువ్వీ విషయం గురించి ఆలోచించకు" అన్నాడు. అంతే! దుర్గ మనసులోని సమస్తమైన గ్లానీ ఎగిరిపోయింది. శంకర్ చిరునవ్వులో ప్రపంచంలోని సౌందర్యాన్నంతా, చూడగలదు దుర్గ-అతని లాలనలో ప్రపంచాన్నే మరచిపోగలదు.

స్వల్పమైన అపశ్రుతు లప్పుడప్పుడు విన్పిస్తూన్నా, తన సంసారం స్వర్గతుల్యమనే భావింప కలుగుతూంది దుర్గ–

"దుర్గా!" అన్న శంకర్ గర్జనలాంటి పిలుపు విని హడలిపోతూ, గదిలోకి పరుగెత్తింది దుర్గ–

గిరి, దుర్గను ముందరే హెచ్చరించాడు. శంకర్ కు అన్నీ మంచి గుణాలే కానీ కోపమూ, మొండి పట్టుదల ఎక్కువ.

అతనితో ఎప్పుడూ వాదనలకు దిగకు, పంతాలకు పోకు, సౌమ్యంగా సర్దుకుపోవటానికి ప్రయత్నించు." అని. ఇంత వరకూ దుర్గ శంకర్ కోపం రుచి చూడలేదు. మొదటిసారిగా, ఉద్రేకంతో ఎర్రబారిన అతని ముఖం చూసి పులిని చూసిన లేడిపిల్లలాగ వణికి పోయింది.

"ఈ డ్రాయర్‌లో మొన్ననే కదా వంద రూపాయలు పెట్టింది? ఇవాళ చూస్తే రెండే ఉన్నాయి. రెండు రోజులలోనే వంద ఖర్చయినాయా?"

శంకర్ బుసలు కొడుతూ తీక్షణంగా అడిగాడు. దుర్గ తెల్లబోయింది. అసలు ఆ పర్స్‌లో ఎంత ఉందో దుర్గకు తెలియదు—శంకర్ ఎప్పటి కప్పుడు ఇంటి ఖర్చులకు కొంత డబ్బు ఆ పర్స్‌లో పెట్టి డ్రాయర్‌లో ఉంచుతాడు. అవసరాలకు దుర్గ వాడుతూ ఉంటుంది. ఎంత తీస్తుందో, ఎంత పెడ్తుందో దుర్గకేమీ గుర్తు ఉండదు. శంకర్ అకస్మాత్తుగా వేసిన యీ ప్రశ్నకు ఏం సమాధాన మియ్యాలో దుర్గకు తెలియలేదు.

"అందులో వంద రూపాయలు ఉన్నాయా?" అంది అయోమయంగా—శంకర్ రెచ్చిపోయాడు.

"ఏం? నేను అబద్ధ మాడుతున్నా నంటావా? కాకపోతే నా ఇంట్లో నేనే దొంగతనం చేసానంటావా?

దుర్గ చెవులు మూసుకుంది. కళ్లలో తిరుగుతున్న నీళ్లను బలవంతాన ఆపుకుంటూ నిల్చుంది. ఇంతలో ఈ కేకలకు శంకర్ తల్లి కామేశ్వరమ్మ అక్కడికి వచ్చింది.

"ఏమిట్రా శంకర్ ! ఆ కేకలు? పిల్ల బిక్క చచ్చిపో తుంది అంది. దుర్గకు అత్తగారిని చూశాక ప్రాణం లేచివచ్చింది. ప్రాథేయపూర్వకంగా ఆవిడ వంక చూసింది.

"ఇందులో మొన్ననే వంద రూపాయలు పెట్టాను. ఇవాళ రెండే ఉన్నాయి. మిగిలినవి ఏం ఖర్చయ్యాయని అడుగుతున్నాను." గట్టిగా అన్నాడు శంకర్.

కామేశ్వరమ్మపొడి నవ్వు నవ్వింది. "బాగుందిరా ! వంద రూపాయలంటే మీకొక లెక్కా ఏమిట్రా? నువ్వొక షాహుకారివి, ఎంతైనా తేగలవు. ఇంక దుర్గ కలవారింట్లో అపురూపంగా పెరిగింది-ఇలాంటి వందలు రోజుకో ఎన్ని ఖుచు చేసిందో? ఒక వంద రూపాయలకు ఇంత రాద్ధాంతం చేస్తా వేమిటి?"

అత్తగారి ధోరణికి దుర్గ రాపడి పోయింది. మతిలేని దానిలా ఆవిడ ముఖంవంక చూస్తూండి పోయింది. శంకర్ చిరాకుతో ఉన్నాడేమో. ఈ మాటలు అతనిని మరింత మండించాయి.

"కలవారి పిల్లయితే, వాళ్లింట్లో ఖర్చు పెట్టుకోమను. అక్కణ్నుంచి తెచ్చి పెట్టుకోమను. ఇక్కడేం నేను రాసులు పోసుకోలేదు దుబారా చెయ్యటానికి."

తన కన్నీళ్లు ఆపుకోలేక, అక్కణ్నుంచి వెళ్లిపోయింది దుర్గ.

ఆ పగలంతా ఎలాగో తన మనోభారాన్ని అణచుకున్న దుర్గ, ఆ రాత్రి శంకర్ పాదాలమీద వాలిభోరున పడ్చింది.

దీనమైన ఆమె ముఖం చూసే సరికి శంకర్ హృదయం ద్రవించింది. ఆమెను గుండెల కదుముకుని లాలనగా తల నిమిరి "మేము ఎంత హీనస్థితిలో నుండి ఈ స్థితిలోకి వచ్చామో, నీకు తెలియదు దుర్గా! మొదట్లో బాగానే ఉండే వాళ్లం. కానీ, మా నాన్నగారి దుబారా వల్లనే చితికిపోయాం. మళ్లీ అలా కాకూడదు, కొంచెం జాగ్రత్తగా ఖర్చు చేయటం నేర్చుకో!" అన్నాడు.

ఈ ఓదార్పుతో దుర్గ కొంత స్థిమితపడింది. వెక్కుతూ, "నేను ఎక్కువ ఖర్చు చేసినట్లు లేదు. ఏమో, అయినా లెక్క తెలియదు ఇంక ముందు జాగ్రత్తగా ఉంటాను" అంది. శంకర్ "గుడ్" అని ఆమెను దగ్గిరకు లాక్కున్నాడు. దుర్గకు మాత్రం మనసులో అల్లకల్లోలం ఇంకా తగ్గలేదు. ఏదో అశంకతో మూలిగే హృదయాన్ని ఓదార్చుకుంటూ కలత నిదుర అనుభవించింది.

# 12

చాలా రోజుల తర్వాత ప్రసాద్ దగ్గరి నుంచి వచ్చిన ఆ ఉత్తరాన్ని మళ్లీ ఒకసారి చదువు కుంది. దుర్గ.

"డియర్ దుర్గా!

నేను కొన్ని స్వంత పనులమీద బొంబాయి రావలసి వచ్చినందుకు సంతోషిస్తున్నాను. జానకి కూడా అక్కడే ఉంది. మొన్న హరి కనబడి నీకు వివాహమయిన సంగతి చెప్పాడు.

చాలా సంతోషమయింది. దొంగా ! మా కెవరికీ తెలియపరచ లేదు కదూ ? బొంబాయి రాంగానే, నిన్నూ, శంకర్‌నూ కలుస్తాను. మీ వైవాహిక జీవితం సుఖప్రదం కావాలని కోరుకుంటున్నాను. వెంటనే సమాధానం రాయి.

ప్రసాద్ ..."

ఈ ఉత్తరం దుర్గకు ఎంతో ఆనందాన్ని కలుగజేసింది. ప్రసాద్ జానకి అన్న—జానకి కుటుంబం చిన్నతనంలో దుర్గా వాళ్ల పొరుగున ఉండేవారు. జానకి, దుర్గకు క్లాస్‌మేట్. ఇద్దరూ చాలా స్నేహంగా ఉండేవారు. ప్రసాద్ చిన్నతనంలో చాలా బలహీనంగా ఉండేవాడు. తోటి మొగ పిల్లలతో ఆడకుండా, జానకితోను, దుర్గతోనూ కలిసి అచ్చనగాయలు, వామనగుంటలూ, కళ్ల గంతలూ ఆడేవాడు—ఆ కారణంవల్లనే అతనితో కూడా బాగా చనువయింది దుర్గకు. తరువాత జానకి తండ్రికి ట్రాన్స్‌ఫర్ కావటం వలన వాళ్లు విడిపోయారు. జానకి కూడా అక్కడే ఉన్నందుకు చాలా సంతోషించింది. దుర్గ—చిన్ననాటి జ్ఞాపకాలతో ఆమె మనసు. పొంగిపోయింది. వెంటనే కాగితం, కలం తీసికొని సమాధానం వ్రాసింది.

"డియర్ ప్రసాద్,

నీ ఉత్తరం చేరింది. నీ ఉత్తరం చదువుతూంటే నిన్ను చూసినట్లే ఉంది. నీ ఎడ్రస్ తెలియక, నా పెళ్లి సంగతి నీకు తెలియపరచలేదు. జానకి, ఇక్కడుందని వ్రాసిన వాడవు జానకి ఎడ్రస్ వ్రాయలేదేం ? తొందరగారా ! నీ రాకకోసం ఎదురు చూస్తూ ఉంటాము.

దుర్గ...."

ఈ వార్త శంకర్ కెప్పుడు చెప్తామా అని ఎదురు చూసిన దుర్గ శంకర్ షాపునుంచి వచ్చి, టిఫిన్, కాఫీ పూర్తి చేసి విశ్రాంతిగా కూర్చోగానే "ఇవాళ ప్రసాద్ దగ్గిర నుండి ఉత్తరం వచ్చిందండీ!" అంది ఉత్సాహంగా.

"ప్రసాద్ ఎవరూ?" అన్నాడు శంకర్ ఆశ్చర్యంగా-

"నా చిన్నప్పటి స్నేహితుడు. అతని చెల్లెలూ, నేనూ చాలా స్నేహంగా ఉండేవాళ్లం."

శంకర్ కనుబొమలు విచిత్రంగా ముడి పడ్డాయి. తన ఉత్సాహంలో అది గమనించలేదు దుర్గ.

"జానకి, అంటే ప్రసాద్ చెల్లెలు. తను కూడా ఇక్కడే ఉందట—ఇక్కడికి వస్తున్నాననీ, రాంగానే మన ఇంటికి వస్తామనీ వ్రాసాడు. తప్పక రమ్మని సమాధానం వ్రాసాను."

"సమాధానం వ్రాసావా? ఎవరి నడిగి వ్రాసావూ?" గర్జించాడు శంకర్. ఆశించని ఈ పిడుగుకు దుర్గ బిత్తర పోయింది.

"ఉత్తరానికి సమాధానం వ్రాయడానికి ఎవరి నడగాలి?" అంది వణుకుతున్న గొంతుకతో-

శంకర్ మండి పడ్డాడు.

"అంటే, అడ్డూ, అదుపూ, లేకుండా, అడ్డమైన వాళ్ళకీ ఉత్తరాలు వ్రాస్తూ కూర్చుంటా వన్నమాట"

"అడ్డమైన వాళ్ళకేంకాదు—నా స్నేహితులకి వ్రాస్తాను."

శంకర్ మండి పడ్డాడు.

శంకర్ పళ్ళు పట పటనూరాడు.

"స్నేహితులు, బహువచనం కూడాను ! సిగ్గు లేకపోతే సరి ! నీకు మొగ స్నేహితులు ఎంతమంది ఉన్నారేం ?" చీదరింపుగా, వెటకారంగా అన్నాడు.

ఆ చీదరింపుకు దుర్గ మనసు చివుక్కు మంది. ఆమె మనసులో భయం స్థానానే రోషం ప్రవేశించింది.

"ఏమో, లెక్క పెట్టలేదు."

ఈ సమాధానం దుర్గ పూర్తి చెయ్యటమూ, దుర్గ చెంప చెళ్ళు మనటమూ, దుర్గ కళ్ళు చీకట్లు కమ్మి క్రిందకూల బడటమూ, అన్నీ ఏది ముందో ఏది వెనుకో తెలియకుండా జరిగిపోయాయి.

"ఇప్పుడు లెక్కపెట్టు—అంతేకాదు. విను ఇక ముందు నీకే ఉత్తరం వచ్చినా, నాకు చూపించాలి. నన్నడగకుండా ఎవ్వరికీ, సమాధానం వ్రాయటానికి వీలులేదు. తెలిసిందా ? నేను మీ అంత చదువుకున్న వాణ్ని కాను. కానీ, నా సంసారంలో నా మాట ఎలా నిలబెట్టుకోవాలో నాకు తెలుసు."

విసురుగా వెళ్ళిపోయాడు శంకర్, దుర్గ చెంప మండ సాగింది. అంతకంటే వెయ్యిరెట్లు ఎక్కువగా మనసు మండ సాగింది. తాను ఎవరిని దేవతలాగ ఆరాధిస్తుందో, ఎవరి అడుగు జాడలే తన జీవిత మార్గమని నిర్ణయించుకొందో, ఆ వ్యక్తి తనను అవమాన పరచడానికి సంకోచించ లేదు. పైపెచ్చు అట్లా అవమానించడం తన హక్కనట్లు, భావిస్తున్నాడు. ఒక

వేళ ఆ విధంగా ఉత్తరం వ్రాయడం ఆయనకు ఇష్టం లేకపో వచ్చు. ఆ విషయం సౌమ్యంగా చెప్ప వచ్చుకదా! ఇందులో తాను నీచంగా,భావించేదేమీ పోజెట్టేకదా, తానుగా, ఆయనకు చెప్పింది.? మధ్యలో తన చదువు ప్రసక్తి ఎందుకూ? దీనికీ చదువుకూ సంబంధమేమిటి? తనను బలవంతపెట్టి, ఆజ్ఞాపించీ పనులు చేయించాలనా తన భర్త ఉద్దేశ్యం? దుర్గ కుమిలి, కుమిలి, పడ్చింది. అట్లా ఎంత సేపు పడి ఉందో, వంటింట్లోంచి గట్టిగా మాటలు విన్పిస్తూంటే, కళ్ళు తుడుచుకు గబ గబ అక్కడికి వెళ్ళింది. దుర్గను చూడగానే శంకర్ క్రోధంతో మండి పడుతూ, "ఏం, మా అమ్మ మనకు వంటమనిషనుకున్నావా. దర్జాగా నువ్వు గదిలో పడుకుని అమ్మతో పచ్చడి రుబ్బిస్తు న్నావా?" అన్నాడు. దుర్గ సమాధానం చెప్పేలోగానే కామేశ్వరమ్మ అందుకుంది...

"ఎందుకురా, పసిదానిమీద అలా విరుచుకుపడ్తావ్! కలవారింట్లో గారాబంగా పెరిగిందా?! దానికి తోడు మొదటి నుంచీ చదువు లొకటి—పాపం చదువులే చదువుతారా, పనులేచేస్తారా? నేనున్నానుగా, నేను మాత్రం ఏం చెయ్యాలి? నాకు ఓపిక లేకపోతే, అప్పుడే దాన్ని పిలుస్తాను. నాకు మొహ మాటమా?"

దుర్గ నిలబడలేక, తూలి గోడకు జేర్లగిల బడింది. తనకు పని అలవాటు లేదా? రోజూ, ఇంట్లో పనులన్నీ చేస్తున్న దెవరు? అది చెయ్యమంటావా? ఇది చెయ్యమంటావా? అంటుంది కామేశ్వరమ్మ పీట మీద కూర్చుని—సహజంగానే 'వద్దులెండి' అంటుంది దుర్గ—ఆ తర్వాత మెల్లిగా, 'ఆ ముక్కలు ఇంకాస్త సన్నగా తరుగుతే బాగుండేది. ఆ పోపు మరీ మాడి

పోయింది.' అలాంటి రిమార్కులు పాసు చేస్తూ, ఏదో లే ఇంకా చేస్తూన్నావు. "హాహాహా" అని కృత్రిమంగా ముసిపోతూ కూచుంటుంది, ఆవిడ రోజూ—ఇప్పుడెలా మాట్లాడుతుందో?! చాణుక్యుడి నీతి, ఎందుకు పనికి వస్తుంది ఈవిడ నీతిముందు ?

"నువ్వే మరీ అలుసిచ్చి, దాన్ని నెత్తికెక్కించు కుంటున్నావు. ఈ పెద్ద వయసులో, కృష్ణా, రామా, అంటూ కూర్చోక ఈ పనులన్నీ ఏమిటి?" బాధగా అన్నాడు శంకర్. రుబ్బిన పచ్చడి పైకి తీస్తూ "పోనీయ్‌రా! పరాయి వాళ్ళకి చేస్తున్నానా ?" అంది కామేశ్వరమ్మ.

అసలు విషయం శంకర్‌కు ఎలా తెలియ జెప్పాలో అర్థం కాలేదు. దుర్గకు—అసలు చెప్పడానికైనా అవకాశమేది? పోనీ, అత్తగారికైనా, తానేమని సమాధానం చెప్తుంది ?ఆవిడ తనసేమైనా అంచేగా సమాధానం చెప్పడానికి ? నాలుగు మాటలని కొట్టినా బాగుండును. హాయిగా పైకి ఏడవవచ్చు. ఇలా లోలోపల కుమలలేక తన మనసు కృంగిపోతూంది.

తనను కొట్టినందుకు శంకర్ బాధపడి అనునయిస్తాడే మోనని నాలుగు రోజులెదురు చూసింది దుర్గ. శంకర్ అదేమీ లేదు సరికదా, ఇంకా దుర్గదే తప్పయినట్లూ ఆమే తనను క్షమార్పణ కోరుకోవాల నన్నట్లు ప్రవర్తించాడు శంకర్. ఒక ప్రక్కన కామేశ్వరమ్మతో వేగిపోతూంది దుర్గ. ఏదో వెలితి ఆమె హృదయాన్ని ఆవరించుకుంటోంది. ఆ శూన్యాన్ని భరించలేక, తానే శంకర్ దగ్గిరకువెళ్ళి "క్షమించండి—ఇంక మీదట మీ ఇష్టం లేకుండా ఏం చెయ్యను." అంది. శంకర్ గర్వంగా నవ్వుకున్నాడు. ఆ నవ్వు దుర్గ గుండెలను చీలుస్తున్నా జాపిన అతని చేతుల్లోకి వాలిపోయింది నిలబడలేని దుర్గ.

# 13

అప్రస్తుతగా పేపరు వెతికిన హరి అందులో ఉమ నెంబరు కనబడటంతో, సంతోషంగా చిన్న పిల్లాడిలా ఎగిరి గెంతు లేశాడు. వెంటనే పోస్టాఫీసుకు వెళ్ళి, ఉమకు కంగ్రాచ్యులేషన్సు పంపించాడు-ఇంటికి రాకుండా. అట్నుంచి అటే, గిరి దగ్గరకు వెళ్ళాడు-గిరి, హరికూడా 'లా'లో డిగ్రీ పుచ్చుకుని, అప్పుడే నాలుగేళ్ళయింది—ఇద్దరూ ప్రాక్టీసు పెట్టారు. గిరి త్వరలోనే పైకి వచ్చాడు. హరి ప్రాక్టీసు ఒక రకంగా ఉంది. ఆ రోజు ఆదివారం కావటం వలన, గిరి ఇంట్లోనే ఉన్నాడు—హరి వెళ్ళి గిరి చేతులు పట్టుకుని ఉత్సాహంగా వూపుతూ "ఉమ పాసైందిరా!" అన్నాడు. గిరి కూడా ఉత్సాహంగా "కంగ్రాచ్యులేషన్స్" అన్నాడు. కానీ అతని ముఖం దిగులుగా ఉంది. అదేమీ గమనించకుండానే హరి "నాలుగేళ్ళు గడిచి పోయాయి. ఇంకొక్క సంవత్సరం-అబ్బ! కాలం ఇంత మెల్లిగా, నడుస్తుందేం ?" అన్నాడు.

"మనకు కాలం మీదే దృష్టి ఉన్నప్పుడు అది కదలదు" అన్నాడు గిరి -క్షణ కాలమాగి "నువ్వు నాకు సంతోషకరమయిన వార్త చెప్పావు. కానీ నేను నీకొక విచారకరమయిన వార్త చెపుతున్నాను. క్షమించు." అన్నాడు—

హరి ఆందోళనతో "ఏమిటి ?" అన్నాడు.

"ఆవేశ పడకు! ఇవాళ దుర్గ దగ్గర నుండి ఉత్తరం వచ్చింది. తన సాంసారిక జీవితం అంత సుఖప్రదంగా లేదని వ్రాసింది."

"అదేమిటీ? దుర్గ ఇష్టపడి చేసుకున్నదేగా?..."

"అయితే?...." విషాదంగా నవ్వాడు గిరి.

హరి ఉత్సాహమంతా ఎగిరి పోయింది. అతడికి దుర్గ అంటే ప్రాణం-దుర్గ గిరిని చేసికొంటే బాగుంటుందని మనసులో అనుకునీ కూడా, దుర్గ శంకర్ ని చేసికొంటానని అన్నప్పుడు, తన మనసులో ఇష్టం లేకపోయినా అంగీకరించాడు. తల్లిదండ్రులు శంకర్ కు చదువులేదని తటపటాయించినపుడు, దుర్గ అభీష్టం నెరవేరడానికి, ఆమె తరఫున తల్లిదండ్రులతో వాదించి, వారిని ఈ వివాహానికి ఒప్పించాడు. గిరి ఇంతవరకూ ప్రయత్నం చెయ్యక పోవటానికి దుర్గ మీద అతనికున్న ప్రేమే కారణమని హరి అనుమానం.

ఒకసారి హరి, గిరితో "నేను విధిలేక నా పెళ్లి వాయిదా వేసికోవలసి వచ్చింది. నువ్వెందుకింకా పెళ్ళి చేసికోవు?" అన్నాడు. దానికి గిరి మొదట నవ్వి వూరుకున్నాడు. హరి మళ్ళీ మళ్ళీ అడగ్గా, "బహుశా చేసికోను." అన్నాడు.

"అదేం? ప్రేమ విఫలమయిందా?" తన మనసులోని అనుమానాన్ని నివృత్తి చేసుకోవాలనే వూహతో, వేళాకోళంగా అన్నాడు హరి.

"విఫలమూ కాలేదు. సఫలమూ కాలేదు. ఆ ప్రేమ ప్రేమగానే ఉండి పోతుంది. నేను ప్రేమించిన వ్యక్తిని, నా దానిని చేసుకునే ప్రయత్నమే చెయ్యను నేను. అలా చెయ్యకూడదు." నిర్వికారంగా అన్నాడు గిరి.

హరి ఎన్నో విధాల ప్రయత్నించినా కూడా గిరి చేత, అతని ప్రణయిని పేరు చెప్పించ లేకపోయాడు—హరి సమంగా అర్థం చేసికోలేకపోయాడు. అర్ధ మయినంతవరకూ, గిరి మాటలను దుర్గ పరంగానే అన్వయించుకున్నాడు.

ఇప్పుడవన్నీ గుర్తుకు వచ్చాయి హరికి. తాను కష్ట సమయంలో ఉన్నప్పుడు స్వంత అన్నకయినా, వ్రాయకుండా గిరికి వ్రాసిన దుర్గ, గిరిని ఎందుకు కాదందా, అనుకున్నాడు. హరి.

"ఏదీ, ఆ ఉత్తరం చూపించు" అన్నాడు ఆందోళనగా. గిరి ఇరుకున పడ్డాడు—దుర్గ, ఆ ఉత్తరంలో అనేక సంగతులు వ్రాసింది. తన సాంసారిక పరిస్థితినంతటినీ వివరించింది. ఏం చెయ్యమంటావని అడిగింది. చివర ఆ విషయాలన్నీ రహస్యంగా ఉంచమనీ, ఆ ఉత్తరం ఎవ్వరికీ చూపవద్దని మరీ, మరీ, వ్రాసింది.

"క్షమించు, దుర్గ దాన్ని ఎవ్వరికీ, చూపించ వద్దంది." హరి గతుక్కుమన్నాడు. స్వంత అన్నకు కూడా తెలియరాని రహస్యాలున్నాయా, గిరి. దుర్గల మధ్య? హరి అంతరాంతరాలలో ఈర్ష్య తొంగి చూసింది. దానిని అణచుకుంటూ, "అయితే, నేను వెళ్ళి దుర్గను చూసి వస్తాను." అన్నాడు.

"తొందర పడకు, నువ్వు వెళ్ళి ఉమను కలిసిరా! నేను దుర్గ సంగతి విచారిస్తాను." అన్నాడు గిరి.

హరి మనసు మండింది. ఉద్రేకంగా లేచి "థాంక్స్, నా చెల్లిలి క్షేమంకంటే, నాకు నా ప్రణయం ఎక్కువకాదు.

నువ్వు నీ స్వంత పనులేమైనా ఉంటే చూసుకో! నేను దుర్గ దగ్గిరకు వెడతాను.” అన్నాడు.

హరి ఉద్రిక్త స్వభావానికి బాగా అలవాటు. గిరి, ఇంకేమీ వాదించకుండా ఊరుకున్నాడు.

తలవని తలంపుగా తన ఇంటికి వచ్చిన అన్నను చూసి ఆశ్చర్యపోయింది దుర్గ—దుర్గను చూసి, అంతే ఆశ్చర్యపోయాడు హరి. పెళ్ళినాటి దుర్గ కాదు. ఈ రెండేళ్ళలోనూ ఆనవాలు పట్టలేనంతగా మారి పోయింది. ముద్దబంతి పువ్వులా ఉండేది పూచిక పుల్లలా అయింది. ముఖంలో కళాకాంతులు తగ్గి పోయాయి. శిథిలమైన చిరునవ్వుతో తనను ఆహ్వానించిన దుర్గవంక బాధగా చూసి, “ఇలా, అయిపోయావేం దుర్గా?” అన్నాడు.

లాలనతో కూడిన ఆ ఓదార్పుకి దుర్గ కరిగి పోయింది. ఆమె హృదయంలో గూడు కట్టిన దుఃఖం కరిగి కన్నీరై ప్రవహించి ది. “అన్నయ్యా అని హరి ఒళ్ళో వాలిపోయింది. హరి దుర్గ కన్నీళ్ళు తుడిచి, “ఏమిటి దుర్గా! ఇంత బాధ పడ్తున్నావేం?” అన్నాడు.

దుర్గ తనను తాను నిగ్రహించుకోలేక పోయింది.

“బాధేమిటంటే, ఏం చెప్పనన్నయ్యా! బంగారు పంజరంలో చిలుకలాగున్నాను. నా కసలు మనసనేది ఉన్నమాటే మర్చిపోయాను. నా మాటకు విలువలేదు. నా ఆలోచన పనికి రాదు. అసలు నా అనేది ఏమీలేదు. ఇవాళ నిన్ను చూస్తే నిద్రపోతూన్న నా మనసు మేల్కొని ఏడుపు వచ్చింది. లేక పోతే, ఏడుపు కూడా రాదు.”

"మీ అత్తగారా? లేక బావగారేనా? దీనికంతకూ కారణం?".

"అందరి కందరూ—మన బంగారం మంచిది కాక పోయాక.—"

సరిగ్గా ఆ సమయంలోనే పొరిగింటికి వెళ్ళిన కామేశ్వరమ్మ తిరిగి రావడంతో దుర్గ సంభాషణ చటుక్కున ఆపేసింది. హరి బుసలు కొడ్తూ తనను పలకరించిన కామేశ్వరమ్మకు నిర్లక్ష్యంగా సమాధానం చెప్పి, శంకర్ రాక కోసం ఎదురు చూస్తున్నాడు. దుర్గ తనను తాను నిగ్రహించుకోలేక హరి దగ్గర తేలిపోయిందే గాని, రోషంతో బుసలు కొట్టే హరి ముఖం చూసాక, ఏం ప్రళయం వస్తుందోనని కంగారు పడింది.—

శంకర్ ఇంటికి వచ్చి హరిని చూసి ఆశ్చర్యపోయాడు. తన ఆశ్చర్యాన్ని అణచుకుని మామూలుగా పలుకరించాడు. హరి బలవంతాన చిరునవ్వుతో సమాధాన మిచ్చాడు. అందరి భోజనాలు అయ్యే వరకూ, ఎలాగో నిగ్రహించుకున్న హరి, ఇంక ఆగ లేక తిన్నగా "మీరు మా చెల్లెల్ని ఇలా చూడటం న్యాయం కాదు." అన్నాడు-ఎలాంటి ఉపోద్ఘాతమూ లేకుండా తలవని తలంపుగా హరిని చూడంగానే ఇలాంటి దేదో ఊహించుకున్న శంకర్ ఏమీ కంగారు పడలేదు. అతనికి కూడా చాలా కోపం వచ్చింది.

"నా భార్యను నా యిష్టం వచ్చినట్లు చేసి కొంటాను."

"దుర్గ మీకు భార్యే కాదు, నాకు చెల్లెలు కూడాను."

"అవును.—పెళ్ళి కాకమునుపు-."

"కాదు-ఇప్పటికీను—,"

"ఎంత మాత్రం కాదు. కనీసం, నా ఇంటిలో ఉన్నంత వరకూ ఆమె బాధ్యతలన్నీ నావే! ఆమె బాధ్యతలను మీరు తీసికో దల్చుకుంటే, ఆమెను నా యింటిలో నుంచి తీసికొని పోవచ్చు."

"తప్పకుండా తీసికొని పోతాను."

ఈ సమాధానంతో శంకర్ "దుర్గా!" అని గట్టిగా పిలిచాడు. అంత క్రితం వరకూ, గోడవారగా నిలబడి సంభాషణలన్నీ వింటున్న దుర్గ భయంగా శంకర్ దగ్గరకు వచ్చింది.

"మీ అన్నయ్య ఏమిటో అంటున్నాడు విను." అన్నాడు శంకర్ నిర్లక్ష్యంగా.

"నీ సామాను సర్దుకో దుర్గా! పద పోదాం!" అన్నాడు హరి ఉద్రేకంగా. దుర్గ మాట్లాడక నిలబడింది. ఆమెకు వంచిన తల ఎత్తే ధైర్యం కూడా లేకపోయింది.

"ఏం దుర్గా!" అన్నాడు మళ్ళీ హరి—

"నేను రానన్నయ్యా!" అంది దుర్గ గద్గదికంగా—

హరి బిత్తర పోయాడు. మూఢుడిలా, శంకర్ వంకా, దుర్గ వంకా చూడసాగాడు.

శంకర్ వంకరగా నవ్వి, "మిష్టర్ హరీ! మీరింకా బ్రహ్మచారులు. దాంపత్యమంటే ఏమిటో తెలియదు. ఏదైనా,

తన దాకా వస్తేనే కాని అర్థంకాదు." అని దుర్గ వైపు తిరిగి "దుర్గా! నువ్వు వెళ్ళాలనుకుంటే మీఅన్నయ్యతో వెళ్ళవచ్చు. ఉందామనుకుంటే, మాత్రం మీ అన్నయను ఇంకెప్పుడూ యిక్కడకు రావద్దని చెప్పాలి. నన్ను అవమానించే ఉద్దేశం కలవారు నా ఇంటికి రావటం, నా కిష్టం లేదు." అన్నాడు.

ఈ మాటలతో, హరి, దుర్గ యిద్దరూ నిర్ఘాంత పోయారు "ఊ! తొందరగా తేల్చు." అన్నాడు శంకర్ కఠినంగా—దుర్గ రెండు చేతులతో ముఖం కప్పుకుని గొణుగుతున్నట్లుగా "మీ యిష్టం." అని అక్కడి నుండి వెళ్ళి పోయింది—

# 14

తమ గుమ్మంముందు కారు, ఆగేసరికి, బయటకు వచ్చింది దుర్గ. కారులోంచి అత్యంత ఆధునికంగా అలంకరించుకున్న యువతీ, యిద్దరు యువకులూ దిగేసరికి, ఆశ్చర్యంతో అలాగే నిలబడింది. దుర్గను చూసిన ఆ యువతి చిరునవ్వుతో ముందుకువచ్చి "ఏమే! కాళీ, నన్ను గుర్తు పట్టలా?" అంది.

ఆ సంబోధనతో, దుర్గ చటుక్కున ఆవ్యక్తిని పోల్చుకొంది చిన్నతనంలో జానకి ఆటల్లో, ఓడిపోయినప్పుడల్లా దుర్గను "దుర్గా! మహంకాళీ!" అని ఏడిపించేంది. "నువ్వా, జానకి!" అంది నమ్మలేనట్లుగా—

"ఆ! నేనే! ఏం, జానకి అంటే, 'యింకా లంగా జాకెట్లు వేసికొనే, ఒక చిన్నపిల్ల అనుకున్నావా? అది సరే, గుమ్మంలో నిలబెట్టే మాట్లాడతావా? లోపలికి రమ్మనవా?"

అప్పటికి దుర్గ సంభ్రమం లోంచి తేరుకుంది. అందరినీ లోపలి కాహ్వానించి కూర్చోపెట్టింది. జానకి ఆ పురుషులలో ఒకరిని పరిచయం చేస్తూ, "ఈయన మా శ్రీవారు. పేరు రాజారాం. యిక, రెండవ వారెవరో, నీకు తెలియక పోతే, నిన్నేంచేసినా, పాపంరాదు." అంది. అతడు ప్రసాద్ అని గుర్తించిన దుర్గ, అతనివంక చూసి చిరునవ్వు నవ్వింది—సమాధానంగా తనూనవ్విన ప్రసాద్ "నీ ఉత్తరం అందిన దగ్గిరనుండీ రావాలనే అనుకొంటున్నాను. ఇన్నాళ్ళకు గానీ, వీలు పడలేదు." అన్నాడు. అంత వరకూ, చిన్ననాటి స్నేహితులను కలిసానన్న సంతోషంలో మునిగిఉన్న దుర్గకు అతడు ఉత్తరం అనంగానే, తన గొడవలన్నీ గుర్తుకు వచ్చాయి. మళ్ళీ ఏం ప్రళయం వస్తుందోనని గాబరా పడింది.

కాఫీలు తయారు చేసి అందరికీ, అందిస్తున్న దుర్గను చూసి ఆశ్చర్యంగా, జానకి "అదేమే ! వంట నువ్వు చేస్తున్నావేం? వంట మనిషిని పెట్టుకోక ! ఎన్నడైనా, పని ముట్టుకునే దానివా ?" అంది.

దుర్గ నవ్వి "మరే! దుర్గ అంటే యింకా బువ్వాలాటలు ఆడుకునే పాపాయి అనుకుంటూంది." అని తిప్పి కొట్టింది.

అందరూ నవ్వు కున్నారు. అంతలో శంకర్ వచ్చాడు. దుర్గ ముఖంలో నెత్తురుచుక్క లేకుండా పోయింది. అతని ముఖంలో మారే రంగుల కోసం ఆత్రుతగా నిరీక్షిస్తూంది. దుర్గ భయాలకు పూర్తి వ్యతిరేకంగా, శంకర్ ఉత్సాహ పూరితమైన చిరునవ్వుతో అందరినీ పలుకరించాడు. వాళ్ళమధ్య కూర్చొని

అందరితో సరదాగా మాట్లాడాడు. వాళ్ళు వెళ్ళిపోతుంటే, మళ్ళీ వీలైనప్పుడల్లా రమ్మని ఆహ్వానించాడు. వాళ్ళూ దుర్గా, శంకర్‌లను ఆహ్వానించారు. దుర్గ తెల్లబోయింది. జరుగుతున్నది కలో, నిజమో; అర్థంకావటం లేదు. విపరీతమైన చనువుతో తన ఆంగ్లో ఇండియన్ స్నేహితులతో, మాట్లాడే శంకర్,యింత సరదాగా, జానకి. రాజారాం, ప్రసాద్‌లతో మాట్లాడిన శంకర్, తన నెందుకంత తేలిక పరచి మాటలాడాడు? ఎంత మాట్లాడినా ఫర్వాలేదు కాని, కాగితం మీద కలం పెట్టి వ్రాస్తే మాత్రం తప్పని అతని భావనా ?

అసలు ఈ తప్పొప్పులను గురించి ఆలోచిస్తే అంతా అల్లకల్లోలంగా ఉంటుంది. మనము మన క్షేమం కోసం ఏర్పాటు చేసికొన్నదే ఈ సంఘం—మన వాతావరణానికీ, మన జాతీయతకూ, మన స్వభావాలకు, మనస్తత్వాలకు అనుగుణంగా సక్రమమైన జీవన విధానానికి కొన్ని నియమాలను ఏర్పరచుకొన్నాం. ఆ నియమాలను అనుసరించి తీరవలసిందే! అయితే, ఆ సంఘ స్వరూపాన్ని గురించి ఆలోచించినపుడే అనేక తికమకలు వస్తున్నాయి. ఏ దేశపు సారస్వతమైనా, ఆ దేశపు సంఘ స్వరూపానికి ప్రతిబింబమంటారు, కానీ, అది పూర్తిగా నిజం కాదనిపిస్తుంది. మహీధర రామమోహనరావుగారి నవలలు చదివి సంఘం అలా ఉందనుకున్నా, విశ్వనాధ సత్యనారాయణ గారి నవలలు చదివి సంఘం అలా ఉందనుకున్నా, పూర్తి పొరపాటే అవుతుంది. ఆయా రచయితలు, సంఘంలోని, ఒక ప్రత్యేకమైన భాగాన్ని తమ దృష్టికోణంలోంచి చిత్రించారు. చలం లాంటి కొందరు అతి భావకులు, తమకు సంఘం ఎలా వుంటే బాగుంటుందనిపిస్తుందో అలా చిత్రించారు.

ఏ కాలంలోనైనా నూతనంగా మార్పులు రావాలని ప్రయత్నించే వాళ్ళు కొన్ని నిందలను భరించక తప్పదు. శ్రీ వీరేశలింగము పంతులుగారు, గురజాడ అప్పారావుగారు, ఈనాడు ఎంతటి గౌరవనీయులైనా, ఒకనాడు వారు సహితం, నిందలను భరించవలసి వచ్చింది. వితంతు వివాహాలు, మతాంతర, కులాంతర వివాహాలు, స్త్రీ విద్య లాంటివి ఈనాడు సాంఘిక సమస్యలు కానేకావు— "స్వర్గానికి నిచ్చెనలు" లాంటి నవలలో విశ్వనాథ సత్యనారాయణగారు వితంతు వివాహాలు, హిందూ ఆధ్యాత్మిక తత్వానికే గొడ్డలిపెట్టు లాంటివని నెత్తీ, నోరూ, మొత్తుకొన్నా, చాదస్తమని తోసి పారేస్తాం—స్త్రీ విద్య ఉచితమా, కాదా. అని ఎవరైనా చర్చ ప్రారంభిస్తే ముఖం ఎదురుగానే పకాలున నవ్వుతాం. ఉత్సాహంతో ప్రగతి పథంలోకి ఉక్కిరి బిక్కిరిగా సాగిపోయే సంఘానికి, యిలాంటి అల్ప విషయాలు పట్టించుకునే తీరిక లేదు. ఒకనాటికి స్త్రీ పురుషుల పరస్పర స్నేహ సౌహార్ద్రాలు అత్యంత సహజంగా భావింప బడవచ్చు—కానీ, ఆనాటి వరకూ, సాహసించి ఆ విధంగా ప్రవర్తించే వ్యక్తులు—ముఖ్యంగా స్త్రీలు. కొన్ని నిందలపాలు కాక తప్పదు. ప్రస్తుత కాలంలో సంఘ వ్యవస్థ ఒక నిర్దిష్టమైన, విధానంలో లేనేలేదు. ఆడది గడప దాటితే మహాపరాధమనుకొనే రోజులు గడిచిపోయాయి. స్త్రీ సంపూర్ణ వ్యక్తిత్వాన్ని గుర్తించిన రోజులు యింకా రాలేదు. ఈ సంధి యుగంలో, మనుష్యుల స్వభావాలను బట్టి, ఆయా ప్రదేశాలనుబట్టి, సంఘ వ్యవస్థ రకరకాలుగా ఉంది. మొత్తం మీద స్త్రీలు విద్యా సంస్కారాలను అలవరచుకొని అన్ని రంగాలలోనూ ప్రముఖ పాత్రలు వహిస్తున్నారు.

సంఘంలో అధిక భాగం, స్త్రీ పురుషులు ప్రకృతి సిద్ధమైన తమ హద్దుల నతిక్రమించకుండా, పరస్పర స్నేహసౌహార్ద్రాలతో ప్రవర్తించడం సభ్యతగానే భావించబడుతూంది. కొంత భాగం మరీ విచ్చల విడిగా ప్రవర్తిస్తుంటే, మరికొంత మంది, ఆడది మొగవాడితో మాట్లాడితేనే కొంపలు మునిగి పోతాయన్నట్లు ప్రవర్తిస్తారు.

విచిత్రాలలో కెల్లాం విచిత్రము, తాము కలివిడిగా అందరితో మసలే వ్యక్తులే, అలా స్నేహంగా మసలే ఇతరులను గూర్చి తేలికగా మాట్లాడటం—

ఈ విషయం గురించే. ఆలోచిస్తూంది దుర్గ—తానూ హరి అన్నయ్యా, గిరి, ఉమా, అంతా కలిసి మెలిసి అన్యోన్యంగా ఉండేవాళ్ళు. ఎన్నడూ, ఒకరిని గురించి తేలకగా ఆలోచించే వారు కారు. శంకర్, తాను ఎంతో కలివిడిగా అందరితో మసలుతూ కూడా, తనను గూర్చి తేలికగా భావించ గలిగాడు.

"ఆ ప్రసాద్ గురించి ఆలోచిస్తున్నావా ?"

శంకర్ గొంతు విని ఉలికిపడి ఈ లోకంలోకి వచ్చిన దుర్గ "కాదు! మిమ్మల్ని గురించే" అంది.

"కొయ్ !" "కోయ్యటం కాదు—మీ ఆంగ్లో ఇండియన్ సేల్స్ గరల్స్ సంగతి వదిలెయ్యండి. మా జానకితో కూడా అంత స్నేహంగా మాట్లాడారు, నేను ప్రసాద్‌ను స్నేహితుడిగా భావించానని అంత కోపమెందుకు ?"

"చాలాబాగుంది నీ వాదన. నేను మొగవాణ్ణి. నాకు సాగినట్లు నీకెలా సాగుతుందీ ?"

"బొత్తిగా అర్థంలేకుండా మాట్లాడుతున్నారు. మొగ భావనలూ, ఆడ భావనలూ, కూడా ఉంటాయా?"

శంకర్ విసుక్కున్నాడు.

"నీ చదువుకొన్న తెలివితేటలన్నీ నా దగ్గర చూపించకు —నీతో వాదిస్తూ, కూర్చోటానికి నాకు టైంలేదు. నా ఇష్ట ప్రకారం ఉండదలచుకుంటే ఇక్కడ ఉండు. లేకపోతే, వెళ్ళిపో!"

దుర్గ మనసులో మంటలు లేచాయి. చీటికీ, మాటికీ ఇలా వెళ్ళిపొమ్మనటం, ఆమె మనసును కెలికి నట్లైంది. "నా ఇంట్లోంచి నేను ఎక్కడకు వెళ్తాను?" కావాలని అంది దుర్గ. శంకరే దుర్గ వంక విచిత్రంగా చూశాడు. కనుబొమ లెగురవేసి "ఓహో! అంతవరకూ వచ్చిందా?..." అని ఇంకేమో అనబోతుండగనే, బయటి నుంచి "శంకర్" అన్న గిరి పిలుపు వినిపించింది. శంకర్ హడావుడిగా బయటకు పరుగెత్తాడు.

# 15

తనకు దుర్గ ఉత్తరం అందిన దగ్గిరనుంచీ, గిరి చాలా తరచుగా, శంకర్ ఇంటికి రావటం సాగించాడు. గిరి సమక్షంలో శంకర్ స్వరూపమే మారిపోతూంది. గిరి ఉన్నంత సేపూ, ఆ ఇల్లు స్వర్గ ధామమే! గిరి నిశితంగా పరిస్థితులను పరిశీలించి, సమస్యలను కొంతవరకు. ఆకళింపు చేసికొన్నాడు. శంకర్‌కు తన దాంపత్య జీవితాలలోని వెలితి ఏమిటో, అతనికి అర్థ మయ్యేలా, ఎలా బోధించాలా అని ఆలోచిస్తున్నాడు.

సమయంకోసం నిరీక్షిస్తున్నాడు. శంకర్ చిరునవ్వుతో తన దగ్గరకు రాంగానే గిరి, అతని భుజంమీద వాత్సల్యంగా చేయివేసి "ఏం శంకర్ ! ప్రళయ తాండవం చెయ్యటం లేదుకదా !" అన్నాడు. శంకర్ సిగ్గుపడి చిన్నగా నవ్వి "ఏవో చిలిపితగవులు" అన్నాడు. అంతలో లోపలినుంచి దుర్గ కూడా అక్కడకు వచ్చి "చిలిపి తగవులు కాదు గిరీ ! నన్ను ఇంట్లోంచి పొమ్మంటున్నారు." అంది రోషంగా. శంకర్ ఆమె వంక కోపంగా చూశాడు. గిరి ఇదేమీ పట్టించుకోనట్లే బిగ్గరగా నవ్వుతూ "వాడి ముఖం వాడు నిన్ను పొమ్మనటమూ, నువ్వా మాటలు సీరియస్‌గా తీసికోవటమూ, నువ్వు గుమ్మం కదిలి రెండడుగులు, వేసి వెనక్కు తిరిగిచూడు ! వాడు, నీ కొంగు వెనకాల ఉంటాడు." అన్నాడు గిరి. తననలా వెనుక వేసికొని వచ్చినందుకు, శంకర్ ముఖం వికసించింది. తనమీద వాత్సల్యంతో శంకర్‌కు గట్టిగా బుద్ది చెపుతాడని ఆశపడ్డ దుర్గ గిరి, శంకర్‌ను సమర్ధించడంతో నిరాశపడింది. మూతి ముడుచుకుని లోపలకు వెళ్ళిపోయింది. శంకర్ గిరితో "ఎప్పుడు వచ్చినా, ఒక్కరోజులో వెళ్ళిపోతావు. ఈ సారి రెండు రోజులుండ రాదూ?" అన్నాడు. గిరి నవ్వుతూ. "ఈసారి రెండు కాదు నాలుగు రోజులుందామని సెలవు పెట్టి వచ్చాను. ఒక్కడికీ ఏం తోచటం లేదు. హరి కూడా వూళ్ళోలేదు" అన్నాడు.

ఆ రాత్రి శంకర్ సినిమా ప్రోగ్రాం పెట్టాడు—దుర్గ తాను రానంది. శంకర్ మళ్ళీ బ్రతిమాల లేదు. గిరి కూడా ఏం మాట్లాడలేదు. గిరి, శంకర్, కలసి బయటకు వెళ్ళారు. దుర్గ విపరీతంగా బాధపడింది. శంకర్ సరే, గిరైనా, తనను రమ్మని బలవంతం చేయలేదు.

సినిమాకు వెడుతూ దారిలో యధాలాపంగా అన్నట్లు, గిరి శంకర్ తో "దుర్గ మనసు కరిగిన మైనం ముద్దలాంటిది. దాని మీద నీ ఇష్టం వచ్చినవచ్చినవి చిత్రీకరించుకోవచ్చును. సుందర చిత్రాలు, చిత్రించుకొని, ఆనందించటమో, పిచ్చి గీతలతో దాన్ని ఖరాబు చెయ్యటమో, నీ చేతులలోనే ఉంది." అన్నాడు.

శంకర్ కు ఆ మాటలు సరిగా అర్థంకాలేదు. గిరి దుర్గను స్వంత చెల్లెలిలా అభిమానిస్తాడని శంకర్ కు తెలుసు. గిరి ప్రోత్సాహమే, ఈ వివాహానికి కారణమని కూడా తెలుసు తాను దుర్గతో కలహం పెట్టుకున్నందుకు, గిరి కష్ట పెట్టుకొన్నాడేమో ననుకొని కొంచెం కలవరపడ్డాడు. కొద్దిగా తట పటాయించి "మీ దుర్గకు అహంకారం చాలా ఎక్కువ. తాను చదువుకున్న దాన్నని గర్వం. నా అంతటి దాన్ని నేను ఈయన మాటలు లక్ష్యం చేయటమేం ?" అన్నట్లు ఉంటుంది అన్నాడు.

గిరి నవ్వి "మీ దుర్గ అంటావేమిటి? నువ్వు మా శంకర్ వి కాదా ? దుర్గ అలా అంటుందా ? నేను చెప్పి చూస్తానుండు." అన్నాడు.

శంకర్ ఉప్పొంగి పోయాడు.

ఆ మరునాడు శంకర్ షాపుకి, కామేశ్వరమ్మ పెత్త నాలకూ బయలుదేరిన తరువాత గిరి దుర్గతో సంభాషణ ప్రారంభించాడు. "ఏం ? అమ్మాయిగారి అలక ఎలా ఉందీ ?"

దుర్గ ముఖం తిప్పుకొంది.

"పిచ్చి పిల్లా ! నిన్ను బాధ పెడ్తున్నందుకు నేను శంకర్ ని మందలించ లేదని కోపం వచ్చిందా ? నేను చటుక్కున,

ఎవరినైనా, మందలించటం నువ్వెరుగుదువా? ఏదైనా చెప్పినా స్నేహంగా తెలుపుతాను. కాని, ఆజ్ఞాపూర్వకంగా ఎవ్వరికీ, ఏమీ చెప్పను. అంతే కాదు. ఏ విషయాన్నైనా, విచారించబోయే ముందు నిష్పక్షపాతంగా, అన్ని కోణాలలో నుండి పరిశీలించడం కూడా నేర్చుకోవాలి, ఒక కోణంలో నుండి చూసి నప్పుడు ఎంతో చెడ్డవిగా కనుపించే కొన్ని విషయాలు మరో కోణం నుంచి చూసినపుడు సమంజసమైనవిగా కన్పిస్తాయి. చిన్నతనంలో శరత్‌బాబు నవలలు చదివి నేను ప్రపంచంలో 'చెడు' అనేది లేదేమోనని భావించే వాడిని. ప్రతి విషయాన్నీ, అన్ని కోణాలనుండి ప్రదర్శించగల శరత్‌బాబు ప్రతిభా ప్రభావం అది.

"శంకర్‌ను గురించి నీకు ఇదివరకే చెప్పాను. ఒక రకంగా అతని ఇప్పటి మనస్తత్వానికి, అతడు పెరిగిన వాతావరణం కూడా కారణమనిపిస్తుంది నాకు. శంకర్ తండ్రి పెద్ద ఆస్థిపరుడయి కూడా లేనిపోని దురుద్దేశాలతో విలాసాలతో, అంతా పాడుచేసాడు. కామేశ్వరమ్మ ఏమి అనడానికి వీలులేక పోయింది. అననిచ్చే వాడు కాదు అతను. తన నగలు, తన చీరలూ కంటె వేరు ఆలోచనలామె కుండేవి కావనుకుంటాను. తన తలితండ్రుల దాంపత్య జీవితం అతని మనసు మీద కొంత ప్రభావాన్ని చూపి ఉండాలి. అంతేకాదు. చిన్నతనం నుంచీ శంకర్ అతి గారాబంగా పెరిగాడు. కొండమీది కోతి కావాలన్నా, అతని మాటను అందరూ శిరసావహించే వారు. అభిమానమూ, అహంకారమూ అతనితో పాటే పెరిగాయి. కొంచెం కష్టస్థితిలో కొన్నాళ్లు మా ఇంట్లో ఉన్నారు. అతనూ, అతని తల్లి-ఆ పరిస్థితులలో కూడా అతను తన వ్యక్తిత్వానికి

ఎంత చిన్న దెబ్బనైనా, సహించగలిగే వాడు కాడు. అలాగని ఇప్పుడాతని ప్రవర్తన సమంజసమని నా ఉద్దేశ్యం కాదు. నీ కన్యాయం జరుగుతున్నదని బాధపడి పంతాలు పెంచుకోవటం, కంటే సానుభూతితో అతనిని అర్థం చేసికొని అతనిలో పరివర్తన తీసికొనిరాలేవా ?

దుర్గ ఇలా అంది :

"నువ్వు చెప్పేదంతా కథగా వినడానికి చక్కగా ఉంది. కానీ. అనేభవించే వాళ్ళకు తెలుస్తుంది. నేను మనిషినా ? యంత్రాన్నా ? నన్ను మనిషిగానైనా గుర్తించలేని వాళ్ళ వ్యక్తిత్వాన్ని నేను గుర్తించగలనా ? పరుషంగా మాట్లాడటానికి కూడా వెనక ముందు లాలోచించ వలసిన సభ్య సమాజంలో ఒక వ్యక్తిగా చెలామణి అవుతూ, కేవలం తన పురుషత్వపు అహంకారంతో చేయెత్తి కొట్టే వ్యక్తిని ఎలా ప్రేమించటం ? అనురాగంతో చెప్పే ఏ మాటనైనా వినగలను - కానీ, ఒక ఆజ్ఞ కూడా నేను పరిపాలించలేను."

దుర్గ క్షోభతో కుమిలి, కుమిలి ఏడ్చింది. గిరి మనసు అంతా కలత చెందింది. దుర్గ పరిస్థితికి అతనెంతో బాధపడుతున్నాడు. అంతేకాక, ఈ వివాహానికతనే కారణమన్న విషయం అతని ఆవేదనను ద్విగుణీకృతం చేస్తూంది. దుర్గ తలమీద చెయ్యి వేసి నిమురుతూ ఉండిపోయాడు. ఆమెను ఓదార్చటానికి మాటలు కూడా దొరకటం లేదు. అతనికి.

మళ్ళీ దుర్గే మొదలు పెట్టింది.

"గోరుచుట్టు మీద రోకటి పోటన్నట్టు, మా అత్తగారి విషయం చూడు. తెలియకూడని విషయం ఒకటి నాకీ మధ్యనే

తెలిసింది. ఆయన ఇంటి ఖర్చుల కిచ్చిన డబ్బంతా నేను డ్రాయరులో ఉంచేస్తాను ఈ లెక్కలు సాధారణంగా చూడను. ఎంత ఉంచినా, రెండు రోజుల్లో అయిపోతుంటే నాకు ఆశ్చర్య మనిపించి ఈ మధ్య జాగ్రత్తగా లెక్క చూడటం మొదలు పెట్టాను. ఎన్ని సార్లు లెక్క పెట్టినా, బాగా యాభై, అరవై రూపాయలు తేడా కనుపించింది. నాకు ఆశ్చర్యమూ, భయమూ, కలిగాయి. పనివాళ్ళెవరూ, ఆ గదిలోకి రారు. ఉదయం నేనే దగ్గిరుండి గది వూడ్పిస్తాను. ఎంత జాగ్రత్తగా ఉన్నా మళ్ళీ తేడా కనిపించింది. నాకు తల తిరిగి నట్లయింది. డ్రాయరుకు తాళం పెట్టాలన్న ఊహే నాకురాలేదు. ఒక నాడు మేమిద్దరమూ బయటకు వెళ్ళిన తరువాత, ఆయన కేదో పని ఉండి నన్ను ఒక్కదాన్నే యింటికి పంపేశారు. ఆనాడు మా అత్తగారు నా డ్రాయర్లోంచి సొమ్ము తీయటం నా కళ్ళతో చూశాను. నేనూ చూసినట్లు ఆవిడకు తెలిస్తే. ఏం గొడవలొస్తాయో అని పిల్లిలా వెనక్కు వచ్చి హాల్లో కూర్చున్నాను. ఏం చేయ మంటావో చెప్పు. ఈ సంగతి ఆయనకు చెప్పటం ఎలా ? చెబితే నమ్ముతారా ? పైపెచ్చు "మా అమ్మను దొంగ" అంటావా ? అని నన్ను నాలుగు బాదరా ? ఈవిడ కేం కావాలన్నా సమస్తమూ ఆయన లోటు లేకుండా చూస్తూనే ఉన్నారు. అయినా ఈవిడ ఇలా పోగుచేసి తన కూతురికి పంపిస్తుంది. ఈ విషయం తెలియని ఆయన నేను దుబారా చేస్తున్నానని తిడ్తారు. ఆలోచించి, ఆలోచించి, ఒక నిర్ణయానికి వచ్చాను. ఆయన దగ్గిర నేను దుబారా మనిషినని ఒప్పేసుకుని, "నా చేతికి అసలు డబ్బియ్యొవద్దనీ, ఎప్పటి ఖర్చులకు కావలసింది అప్పుడడిగి తీసికొంటాననీ" చెప్పాను. ఈ ఏర్పాటుకి ఆయన చాలా

సంతోషించారు. నాకూ ప్రాణానికి సుఖంగా ఉంది. దీంతో ఆవిడకు నామీద మరింత కోపం—ఏవో సూదుల్లాంటి మాటలతో, పొడుస్తూ ఉంటుంది. ఆయన నన్ను కొట్టినా, తిట్టినా, ఈవిడకు పరమ సంతోషం. కానీ పైకి కొంచెమయినా తెలదు. చెప్పినా, ఎవరూ నమ్మరు. పైగా నామీద అపారమైన అభిమానాన్ని కుమ్మరిస్తుంది. సాయంత్రం పని అంతా ముగించుకుని, నేను ఏదో చదువుకుంటూ కూర్చునే వేళకు ఈయన వస్తారు. సరిగ్గా ఈవిడ అప్పుడే, ఏదో అనవసరపు పని కల్పించుకుని కూర్చుంటుంది. ఆయన, నేను చదువుకుంటూ కూర్చున్నాననీ, తన తల్లే అంత పనీ చేస్తుందనీ అనుకుంటారు. ఆ భావనకు బలమిస్తూనే, ఆవిడా మాట్లాడు తుంది. చెప్తే 'సిల్లీ'గా ఉంటాయి. అనుభవంలో తగని క్షోభను కలిగిస్తాయి. నాకు సాధ్యమైనంత వరకూ, అందరికీ, సంతృప్తికరంగా ప్రవర్తించాలనే చూస్తాను. కానీ, నా తరం కావటం లేదు."

గిరి సమాధానం చెప్పకుండా పాంటు జేబుల్లో చేతులు పెట్టుకుని, కాసేపు అటూ, ఇటూ పచారులు చేసి అకస్మాత్తుగా దుర్గ వైపుకు తిరిగి "పోనీ శంకర్‌కు విడాకులిచ్చేసి ఇంకెవరినైనా చేసికొంటావా ?" అన్నాడు.

దుర్గ అదిరిపడింది.

"ఛీ! ఛీ!. అవేం మాటలూ ?"

"నీ దగ్గర నుండి ఇట్లాంటి సమాధానాన్ని ఆశించే నేనా ప్రశ్నను వేశాను. మనం ఏ సమస్యనైనా వాస్తవిక దృష్టితో కూడా పరిశీలించాలి. నువ్వు చెప్పిన సమాధానమే ఒక విధంగా, నీ సమస్యకు పరిష్కార మార్గం, ఏదో ఒక విధంగా నీ జీవితం

ఈ పరిధిలో రాణించవలసిందే. కానీ, ఈ గిరులు దాటి నువ్వు రాలేవు. అంతేకాదు. నువ్వు శంకర్‌ను ప్రేమిస్తున్నావు. అందుకనే నిన్ను ఓర్మి వహించ మంటున్నాను. నేను శంకర్‌ను వెనుక వేసుకు వచ్చి, నిన్ను ఎత్తి చూపుతున్నానని అపోహపడకు. నీకు చెప్పగలిగే చనువు, నా మాటలు అర్థంచేసికో గలిగే సంస్కారం నీకుందన్న నమ్మకమూ, నాకు ఉండటం వల్ల, నీతో ఇలా చెప్తున్నాను. "నువ్వు దుర్గను చాలా కష్టపెడుతున్నావు. అలా కష్ట పెట్టవద్దు." అని శంకర్ లాంటి వాళ్ళతో చెప్పటం, వాళ్ళను మరింత రెచ్చగొట్టటమే అవుతుంది. అలా చెప్పటంకంటే చెప్పకపోవటమే, నీకు మేలు చేసినట్లు అవుతుంది. ఉద్రేకపూరితమైన ఉపన్యాసాలతో మనుష్యులు మారి పోవటానికి జీవితాలు కథలూ, సినిమాలూ కావు గదా !"

దుర్గ నీళ్ళునిండిన కళ్ళతో నిరాశగా గిరివంక చూసింది. గిరి, జాలిగా, ఆమె కన్నీళ్లు తుడుస్తూ, "శంకర్ మూర్ఖుడు కాడు. దుర్మార్గుడు కాడు. కొన్ని కొన్ని విషయాలనతడు సమంగా అర్థంచేసికోలేక పోతున్నాడు. మీ జీవితాలు సుఖమయం కావ కావటానికి నేను చెయ్యగలిగిందంతా చేస్తాను." అన్నాడు.

దుర్గ భారంగా నిట్టూర్చింది.

# 16

అనుకోకుండ వచ్చిన ఉమను చూసి ఆశ్చర్య సంభ్రమాలతో ఉక్కిరిబిక్కిరయ్యాడు హరి. అతనికి ఆశలు ఆకాశా

న్నంటుకున్నాయి. హాస్యుసర్జను కూడ పూర్తి చేసిన ఉమ, ఇక శాశ్వతంగా తనది కావటానికే ఇలా వచ్చిందనుకున్నాడు. ఆమె ముఖంలోని నీలినీడలు, కన్నులలోని నిరుత్సాహమూ, చిరునవ్వులోని పేలవత్వమూ, పొంగిపొర్లే హరి ఉత్సాహానికి ఆనకట్టలు కాలేకపోయాయి. హరి ఉత్సాహాన్నీ, ఆనందాన్నీ చూచిన ఉమ మరింత కృంగి పోయింది. పసిపిల్లాడిలాంటి ఈ నిర్మలమూర్తికి తాను చెప్పదలచుకున్నది ఎలా చెప్పటం? తన నింత గాఢంగా ప్రేమించిన హరి, తనకోసం తహ తహతో ఐదేళ్లు నిరీక్షించిన హరి, వూహలు తెలియని పసితనంనుంచీ తనమీద సర్వాధికారాలూ చెలాయించిన హరి, ఈ ఆశాభంగాన్నెలా ఎదుర్కొంటాడూ? అతి సున్నితమైన హృదయమూ, అత్యంత ఉద్రిక్తమయిన స్వభావమూ కల తన బావ ఈ దెబ్బకు తట్టుకోలేక ఏమయినా అయిపోతే? ఆ పాపమంతా ఎవరికి చుట్టుకుంటుందీ? అలా అని హరిని అంగీకరింటం తనను తాను మోసం చేసికోవటమేగాక, హరినికూడా మోసం చేసినట్లే అవుతుంది. హరి కోరుతున్నది తన అనురాగాన్ని కానీ తన శరీరాన్ని కాదుగదా! అలా అనుకుంటే హరి కోరితే, తనకంటే అందమైనవాళ్లు అతనికి భార్యగా దొరకరా?

వెనుకనుండి తన కనులు మూయబడటంతో ఉలికిపడి ఆలోచనలలోంచి తేరుకుంది. ఆ కనులు మూసిన ఆ చేతులనూ, ఆ స్పర్శనూ, తేలికగానే గుర్తించగలదు ఉమ. ఏ విధమయిన సంచలనమూ లేకుండా ప్రశాంతంగా "చేతులు తియ్యి బావా!" అంది.

ఉమ ప్రశాంత గంభీర స్థిర స్వరం హరికి, ఉమ ప్రసన్నతగా భాసించింది. చిరునవ్వుతో చేతులుతీసి ఆమెమీదకు వంగబోయాడు—ఉమ చటుక్కున లేచి "బావా! నన్ను ముట్టుకోకు" అంది స్థిరంగా.

ఇప్పటికి హరి తెల్లబోయాడు. అంతలో తేరుకొని నవ్వుతూ, "ఇంకా ఎన్నాళ్లు ఇలా నన్ను దూరంగా ఉంచగలవో చూస్తాగా! అప్పుడు నా కసిఅంతా తీర్చుకొంటాను" అన్నాడు.

"నన్ను క్షమించు బావా! నిన్ను ఒకప్పుడు దగ్గిర చేసికొందామనే భావన నాలో ఉంటే, ఇప్పుడే నిన్ను దగ్గిర చేసికొనేదానిని. నిన్ను శాశ్వతంగా నాకు దూరంగా ఉంచాలనే నా నిశ్చయం. నాకు వివాహంమీద కోరికలేదు. నీకు తగిన ఎవరినైనా, చూసుకొని పెళ్ళిచేసికో! నన్ను మర్చిపో!"

హరి నోట మాటరాక, పిచ్చివాడిలా అలా ఉమవంకే చూస్తు నిలబడిపోయాడు. ఆ చూపులకు ఉమ గుండెలు అవిసిపోతున్నాయి. ఆపుకుందామని ఎంత ప్రయత్నించినా ఉమ కన్నీళ్లు ఆగటంలేదు. హరి దగ్గరగావెళ్ళి భుజాలు పట్టుకుని కుదుపుతూ "బావా!" అంది ఆందోళనగా—హరి ఉమ చేతులు విదిలించి వెనకకువెళ్ళి "నన్ను ముట్టుకోకు" అన్నాడు కసిగా.

ఉమ నవ్వింది. "నువ్వుమనసారా, ఆ మాట అనగలుగుతే అదృష్టవంతురాలిని."

"నవ్వుతున్నావా? అవును. నీకు నవ్వులాటగానే ఉంటుంది. అయితే నువ్వు ఎం. బి. బి.ఎస్. లో చేరటానికి కూడ

కారణం ఇదే కదూ! ఈ ఉద్దేశం మనసులో ఎన్నడో కలిగింది కదూ! నువ్వు నాకంటే అందగాణ్ణి, గొప్పవాణ్ణి. ఎవర్నో ప్రేమించిఉండాలి. అందుకనే నన్ను అసహ్యించుకొంటున్నావు. ఛీ! ఏం ఆడవాళ్ళు! ఎంత చంచలమైన మనస్సూ?"

హరి ఉద్రేకంతో వూగిపోతున్నాడు. ఉమ కన్నీళ్ళను ఆపలేకపోతూంది.

"ఇంకా తిట్టుబావా! భాషలో ఉన్న పదాలన్నీ ఉపయోగించి తిట్టు. ఎంతటి తిట్లకయినా నేను అర్హురాలినే. కానీ, నేను నిన్ను అసహ్యించుకోవటం లేదు—బావగా నిన్నెప్పటికీ అభిమానిస్తూనే ఉంటాను. నా భర్తగా మాత్రం నిన్ను చూడలేను."

"నిన్ను తిట్టడానికి నేనెవర్ని ఉమా! నీమీద నాకేం హక్కుఉంది? నీ పెళ్ళి ఎప్పుడోచెప్పు. వచ్చి మీ ఇద్దర్నీచూసి సంతోషిస్తాను."

"నేనసలు పెళ్ళి చేసికోనుబావా! నాకు దేశసేవ చేద్దామని ఉంది. అందుకనే డాక్టరునయ్యాను. ప్రస్తుత దేశ పరిస్థితినిబట్టి ఎందరో డాక్టర్లు యుద్ధంలో గాయపడినవారికి అవసరం. నేను తేజ్‌పూర్ హాస్పిటల్‌లో అప్పాయింట్ అయ్యాను. డ్యూటీలో చేరడానికి నిశ్చయించుకున్నాను. వెళ్లబోయేముందు మిమ్మల్నందరినీ ఒకసారి చూడాలనిపించి వచ్చాను."

హరి ముఖం పాలిపోయింది. చాలాసేపటివరకూ, అతను మాట్లాడలేకపోయాడు. చివరకు "ఉమా! ఎందుకింత కసి నామీద నీకు?" అన్నాడు.

ఉమ వంచిన తల ఎత్తలేకపోయింది.

"క్షమించు బావా! క్షమించు. ఈ స్వార్థపరురాలిని నిర్లక్ష్యం చేయటం నేర్చుకో! నీ బ్రతుకు బాట నువ్వుదిద్దుకో!" అంది చివరకు.

హరి సమాధానం చెప్పలేదు. చాలా సేపు ఆ ఇద్దరిమధ్య నిశ్శబ్దం రాజ్యం చేసింది. హరిలేచి నిలబడి "ఈ లోపమేదో నా జాతకంలోనే ఉంది నా ప్రాణంలా అభిమానించిన దుర్గ తానే స్వయంగా నా ఇంటికి రావద్దంది. నా సర్వస్వంగా భావించిన నువ్వు నాకు దూరంగా పోవటమేకాక, ఈ లోకపు బంధాలకు కూడా దూరంగా పోవాలనుకుంటున్నావు. వద్దు ఉమా! నేను నిన్నేవిధంగానూ బాధించను. నాకు భయపడి ఆ యుద్ధ రంగంలోకి పారిపో వద్దు. నీకెలా సంతోషమో, అలాగే. ఉంటాను. నీ సంతోషంలోనే నా సంతోషాన్ని వెతుక్కుంటాను అక్కడికి వెళ్ళనని మాట ఇయ్యి" అన్నాడు.

ఉమ తన ఆవేదన అణచుకోవటానికి విశ్వప్రయత్నం చేస్తూంది.

"నువ్వు దేవతవి బావా! నీ ప్రేమకు అర్హురాలిని కాలేకపోవటం, నా దురదృష్టం. కాని నా నిశ్చయాన్ని మార్చటానికి ప్రయత్నించకు. ఇలాంటి అవకాశం మాత్రం ఎంతమందికి వస్తుంది బావా! ఇది బ్రతుకును సార్థకం చేసి కోవటంకానీ వ్యర్థం చేసికోవటంకాదు. నాకు సంతోషం ఇందులో ఉంది గనుకనే ఇలా నిశ్చయించుకొన్నాను."

హరి అక్కడినుంచి వెళ్ళిపోయాడు. ఉమ బరువుగా నిశ్వసించింది. ఆమె గుండెలమీదనుండి ఎవరో పెద్ద కుంపటిని

దింపినట్లయింది. ఆవేదనతో గుండెలు కరిగి కన్నీరుగా ప్రవ హించినా, ఈ కన్నీటిలో కొంత సంతృప్తి ఉంది.

రెండు రోజులు గడచిన తరువాత ఉమ తన మొహ మాటాన్ని అణచుకొని, "బావా! గిరిని చూసి వద్దామా?" అంది. హరి నిర్లిప్తంగా "పద!" అన్నాడు.

ఏదో పత్రిక చదువుకొంటూన్న గిరి, హరి, ఉమలను చూసి చిరునవ్వుతో ఆహ్వానించాడు. నీరసంగా, నిరుత్సా హంగా ఉన హరిని చూసి "ఏమయ్యా పెళ్ళికొడుకా, అలా ఉన్నావ్" అని వేళాకోళ మాడాడు—ఈ వేళాకోళం హరి మనసునూ, ఉమ మనసునూ కూడ కలతపరిచింది. హరి, నిర్జీవంగా నవ్వి "ఉమ యుద్ధంలో గాయపడినవారికి వైద్యం చెయ్యటానికి తేజ్‌పూర్ వెళ్తూంది. మనకందరకూ "గుడ్ బై చెప్పడానికి వచ్చింది" అన్నాడు.

గిరి స్థాణువులా అయి, "ఏమిటీ?" అన్నాడు నమ్మ లేనట్లు—ఉమ నవ్వుతూ—"ఈ మధ్య సరిగా వినబడటం లేదా" అంది. గిరి తిరిగి నవ్వలేకపోయాడు. ఉమ నిశ్చయా నికి కారణమేమిటో అతనికి చక్కగా తెలుసు. అంతులేని ఆవేదన అతని కళ్ళలో సుడులు తిరిగించి. అతని పెదిమలు కదిలాయి. కానీ మాటలు పైకి రాలేదు.

అతని ఆవేదన గ్రహించిన ఉమ తృప్తిగా నిట్టూర్చింది. "ఇది చాలు" అనుకొంది.

గిరిబాధ పడుతున్నాడని గ్రహించిన హరి, అది తన మీది సానుభూతిగా అర్థంచేసికొని, "ఎందుకు గిరీ! అలా బాధ

పడతావ్ ! మనలో ఒకరైనా ఇలాంటి మంచిపని చేస్తున్నందుకు మనం గర్వపడాలి" అన్నాడు.

గిరి దిగాలుగా "దేశసేవ చేయాలనే దీక్ష సహజంగా ఉంటే చాలా మంచిదే! కానీ, వేరు కారణాలేవైనా దీనికి దారితీస్తే మాత్రం..." అని ఆగి పోయాడు.

ఉమ వూరుకోక "కారణమేదైతేనేం ? జరుగుతున్నది మంచిదేగా !" అంది.

గిరి, హరివంక చూస్తూ, "కానీ, ఒక అనురాగభరిత హృదయాన్ని క్షోభిల్లజేయటం మాత్రం క్షమింపరాని నేరం" అన్నాడు.

ఉమ కొంటెగానవ్వి "నిజంగా ?" అంది.

ఆ ఎత్తిపొడుపు సూటిగా గిరి గుండెల్లో గుచ్చుకొంది. ఆ తరువాత ఎంత ప్రయత్నించినా, ఆ ముగ్గురిలో ఎవ్వరూ సహజంగా ఉండలేక పోయారు. ప్రతి ఒక్కరి మనసులోనూ ప్రచండమైన తుపాను చెలరేగుతూంది. కొంతసేపు ఎలాగో కృత్రిమమైన మాటలతో గడిపి హరి, ఉమ, సెలవు తీసికొని వెళ్లిపోయారు.

# 17

తన ఇంటికి వచ్చిన జానకిని పది క్షణాల పాటు ఎగాదిగా చూస్తూ నిలుచుంది దుర్గ—దుర్గ చూపులలోని భావం గ్రహించిన జానకి, కృత్రిమకోపంతో బొమలు ముడిచి నవ్వుతూ "దృష్టి బొమ్మలా అలా చూస్తావేం ? నాముఖాన కోతు

లాడుతున్నాయా ? అంది కూర్చుంటూ, దుర్గ తను కూడా జానకి ప్రక్కన కూర్చుని. "నీ అలంకరణ నిజంగా దృష్టి కొట్టే లాగే ఉంది ఎంత టైం పట్టింది నీకు ? ఇంక ఇంట్లో వేరే పను లేమీ ఉండవా ?" అంది.

జానకి చెక్కిళ్లు కొంచెం ఎర్రబడగా, "ఏం చెయ్యను ? ఇలా అలంకరించుకోక పోతే ఆయన చంపేస్తారు." అంది. "అలా చెప్పు ! ఇదంతా మా బావగారి కళా ప్రావీణ్యమన్న మాట!" దుర్గ కిలకిల నవ్వింది. జానకి తనుకూడా నవ్వి "ఆయ నకు అలంకరణ విషయంలో ఎంత చాదస్తమనుకున్నావ్. ఎక్కడా ఏలోటు ఉండడానికి వీలులేదు. చీరా, జాకెట్టు, గాజులూ, పువ్వులు, లాకెట్టు అన్నీ ఒక దానితో ఒకటి శ్రుతి కలిసి తీరవలసిందే ! లేకపోతే అప్పటికప్పుడు బజారునుంచి కొని తీసికొని వస్తారు. అంతేకాదు పేరం టాలకి ఒకలాగ, డిన్నర్లకు ఒకలాగ. పార్టీలకు మరో లాగ అలంకరించుకోవాలి—నిజంగానే నువ్వన్నట్లు నా టై మంతా ఈ అలంకరణలకి వృధా అవుతుంది. నాకొక్కొక్క సారి విసుగొస్తుందికూడ ! అయినా ఆయన మనసుని కష్టపెట్ట లేను" అంది.

దుర్గ కనుబొమ్మలు ఆశ్చర్యంగా పైకి లేచాయి. "అయితే నువ్వు తరచుగా క్లబ్బులకూ, పార్టీలకు, సినిమాలకు వెడుతుంటావా ?"

"అయ్యా బాబోయ్। తరచుగా ఏమిటీ ? ఇంచు మించు రోజు ఏదో ప్రోగ్రాం ఉంటుంది. ప్రతిరోజూ నేను నిద్ర పోయే సరికి పన్నెండు, ఒంటిగంట అవుతుంది. అప్పు డప్పుడు మేం కూడా పార్టీలిస్తూఉంటాము—ఇంటి పనులు

నువ్వన్నట్లుగానే నాకేమీ లేవు. అజమాయిషీ తప్ప—అయినా ఈ వ్యాపకాలన్నింటితో ఉక్కిరి బిక్కిరిగా ఉంటుంది.

"నీకు బాగుందా ఇలా ?"

"బాగుందా అంటే ఏం చెప్పను ? ఆయనకిలా చాలా యిష్టం—ఒకొక్కొక్కసారి నాకు ప్రశాంతంగా ఇంటి దగ్గరే ఉండాలనిపిస్తుంది—కాని తను నన్ను వదలరు. తప్పించుకోవా లంటే ఒకటే మార్గం—ఏ తలనొప్పి అనో, కడుపు నొప్పిఅనో వంక పెట్టాలి—అప్పుడు నేను వస్తానన్నా తనుతీసికొని వెళ్ళరు. కాని ఇంకా ఇబ్బంది వస్తుంది. తను కూడా అన్ని వ్యాపకాలు మానుకుని నానా కంగారు పడుతూ నా దగ్గరే కూర్చుంటారు డాక్టరుని పిలిపిస్తారు. ఎంత గొడవ జరగాలో అంతా అవు తుంది. ఇంతకంటే ఆయనతో కలిసి బయటకు పోతేనే మేలని పిస్తుంది."

అప్రయత్నంగా దుర్గ భారంగా నిట్టూర్చింది.

"ఎంత అదృష్టవంతురాలవే నువ్వు జానీ !"

జానకి పకపక నవ్వింది. "అవును ! నా అదృష్టాన్ని నువ్వు పొగుడుతే వినిఆనందిస్తాను."

"అదేం ? ఇంతకంటే ఏమి అదృష్టం కావాలి ?"

నవ్వుతున్న జానకి ముఖం క్షణంలో నల్లగా అయి పోయింది. భారంగా, "పోనీవే! అదృష్టవంతురాలిననే అనుకో!" అంది—దుర్గ ఆశ్చర్యపోతూ "నాకు చెప్పకూడని రహస్యమే మైనా ఉందా ?" అంది—

"అసలు రహస్యమే కాదు—కాని అనుకోవటానికే చాలా కష్టంగా ఉంటుంది. మొన్నీ మధ్యనే మా ఆయనకు గుండె జబ్బు ఉన్నట్లుగా తెలిసింది. ఏ క్షణంలోనైనా నా ఈ స్వర్గమంతా అంధకారంలో కరిగిపోవచ్చు—దుర్గా! నా అదృష్టాన్ని మెచ్చుకుంటావా? నన్ను చూచి జాలి పడతావా?"

దుర్గ నిర్ఘాంత పోయింది—మూఢురాలిలా జానకి ముఖం వంక చూస్తూ ఉండి పోయింది. చైతన్యానికి మారు పేరులా ఉండే జానకి, సృష్టిలో విలాసము రూపు ధరించి వచ్చిందా, అన్నట్లుండే జానకి, తన గుండెల్లో ఈ ఆరని కుంపటిని ప్రజ్వలింప జేసికొంటూ పైకి పకపక నవ్వ గలుగుతుందా?

ఎప్పుడూ నవ్వుతూ ఉండే జానకి కళ్ళ నీళ్లు దుర్గ గుండెలను పిండి చేశాయి. ఆప్యాయంగా జానకి చేతిని తన చేతిలోకి తీసికొని "పాపిష్టి దానిని—నవ్వుతూ వచ్చిన నిన్ను ఏడిపిస్తున్నానే నవ్వు. కన్నీళ్ళు నీకు తగినవి కావు—" అంది.

జానకి పెదవుల పైకి పేలవమైన చిరునవ్వు మెరిసింది. "నిజం దుర్గా! కన్నీళ్ళు నాకు తగినవి కావు. నా గురించి నాకు ఏమీ బాధ లేదు. కానీ అంతరాంతరాలలో ఆయన పడే పడేక్షోభ చూస్తుంటే నా గుండె పగిలి పోతుంది—

"ఈ సంగతి ముందే గుర్తించకుండా నిన్నన్యాయం చేశాను. నన్ను క్షమించగలవా జానకీ?" అని ఆయన అంటూంటే ఏం సమాధానం చెప్పాలో తోచదు. "నాకుముందే ఈసంగతి తెలిసినా, మిమ్మల్ని ఒదులుకునే దానిని కాను.", అంటాను. ఆయన దరిదాపులకు విషాద మేఘాలు రాకుండా

నా శాయశక్తులా ప్రయత్నిస్తాను. అయినా తన అంతరంగంలో ఆవేదన తుడిచి వెయ్యటం నా తరం కావటం లేదు."

దుర్గ మనసు కరిగి పోతోంది. జాలిగా జానకి వంక చూడటం కంటే ఏమీ మాట్లాడలేక పోయింది. జానకి యింకా ఏదో చెప్పబోయేటంతలో శంకర్ రావటంతో ఆగి పోయింది— శంకర్ జానకిని చూసి "హలో! జానకీ! ఈ మధ్య బొత్తిగా కనబడటంలేదే." అన్నాడు. జానకి నవ్వింది.

"నేను రాకపోతే పోనీ, మీ ఇద్దరూ రాకూడదా? మీరూ అసలు కనపడటంలేదు."

"వద్దామనే అనుకున్నాను. రెండుసార్లు దుర్గా నేను బయలుదేరి కూడా, ఏవో అవాంతరాలవల్ల ఆగిపోయాం. అయినా, మీరు కనపడకపోతే మాకేం తోచదు."

"అవునా! దుర్గా," అంటూ జానకి దుర్గవంక చూసింది. తన భర్త ఈ లేనిపోని అబద్ధాలన్నీ ఎందుకు చెబుతున్నాడో అర్థంకాని దుర్గ అయోమయంగా తల ఊపింది.

శంకర్ "దుర్గా! జానకికి కాఫీ అదీ ఏమైనా ఇచ్చావా, లేదా?" అన్నాడు.

కబుర్ల సందడిలో ఆమాటే మర్చి పోయిన దుర్గ హడావుడిగా లేవబోతుంటే జానకి దుర్గను బలవంతాన కూర్చోబెట్టి "నాకు కాఫీ అలవాటు లేదు. ఎవరింటికైనా వెడితే మర్యాద కోసం తాగుతాను. ఇప్పుడు తాగాలని లేదు." అంది.

"అబ్బ; మీ కెంత మంచి అలవాట్లండి?" అన్నాడు శంకర్. జానకి నవ్వి వూరుకుంది.

కొంచెం సేపు కూర్చుని అదీ ఇదీ మాట్లాడాక జానకి వెళ్తానని లేచింది. దుర్గ ఇంకా కాస్సేపు కూర్చోమంది. కాని, జానకి పని ఉందని లేచింది.

"వీలైనప్పుడల్లా కన్పిస్తూ ఉండండి." మళ్ళీ ఒకసారి హెచ్చరించాడు శంకర్.

జానకి వెళ్ళగానే తనలో తను నవ్వు కుంటున్న శంకర్‌ను చూసి ఆశ్చర్యంగా "ఏమిటీ?" అంది దుర్గ.

"మీ జానకిని తల్చుకుని నవ్వుకొంటున్నాను. అదీ ఒక ఆడదేనా? చేతులు లేని ఆ జాకెట్టు లిఫ్‌స్టిక్, హైహీల్సు. జుట్టంతా అలా కావాలని రింగులు తిప్పుకోవటం, ఎవడితో పడితే వాడితో అలా విరగబడి మాట్లాడటమూ!—అ మొగుడు వెధవని అనాలి—పెళ్ళాన్ని ఇష్టం వచ్చినట్లు వూరేగనిచ్చి ఆడ ముండలా చేతులు నలుపుకుంటూ కూర్చున్నాడు. హా హా హా ......," శంకర్ వికటమైన నవ్వు దుర్గ చెవులకు శూలపు పోటులా తగిలింది. బాల్య స్నేహాన్ని మరువని జానకి స్నేహ శీలతనూ, స్నేహితురాలి భర్తగా శంకర్ కిచ్చే గౌరవాన్ని, వెకిలి తనం క్రిందా రాజారాం విశాల హృదయాన్ని చేత కాని తనం క్రింద, వ్యాఖ్యానించే భర్త మాటలకు కటకటలాడి పోయింది దుర్గ. జానకి మీద నిష్కారణమైన ఈ అభాండాల్ని సహించలేక పోయింది. "మరి అట్లాంటి జానకితో మీరంత స్నేహంగా ఎలా ఉండ గలుగుతున్నారో?" రోషంగా అడి గింది దుర్గ.

"నీ తలకాయ, స్నేహ మేమిటి? నా అందం చూసి అది వెంటపడింది. పోనీయ్‌లే! నాకు మంచి కాలక్షేపమని నేనూ సరదా పడ్డాను."

ఇల్లెగిరి పోయేలా నవ్వాడు శంకర్.

భరించలేని విరక్తితో దుర్గ నవనాడులూ మండాయి. "ఛీ! ఏం మనుష్యులూ? ముఖమెదురుగా ఎంతో స్నేహాన్ని చూపించి, కనుచాటు కాంగానే ఇంత నీచంగా మాట్లాడటమా?

"నీచమైన వాళ్ళను గురించి నీచంగా మాట్లాడక ఇంకెలా మాట్లాడతారు? ఈవిడ నీచత్వాన్ని కప్పిపెట్టడానికి, ఆ మొగుడు వెధవ అడ్డున్నాడని నన్నిప్పుడు పతివ్రత అనమంటావా?"

"అవును–భార్యను అనురాగంతో చూస్తూ ఆమెను విశ్వసించి స్వాతంత్ర్యాన్ని ఇవ్వటం చేతకానితనం. క్షణక్షణానికి తన ఆధిపత్యాన్ని గుర్తుచేస్తూ భార్యకు వ్యక్తిత్వ మనేదే లేకుండా పశుబలంతో అణిచి ఉంచటం మొగతనం."

శంకర్ రుద్రుడయ్యాడు. లేత తమలపాకువంటి దుర్గ చెంప చెళ్ళుమని ఉబ్బింది. "మళ్ళీ అను" అన్నాడు రోషంగా–

దుర్గ మనసు మండి పోతోంది.–ఆమెకు భయము బాధా కలగటానికి మారుగా రోషమూ, కసీ పెరుగుతున్నాయి.

"నేను అనడమెందుకూ? మీరే ఋజువు చేసికొంటున్నారు."

శంకర్ యుక్తాయుక్త విచక్షణా జ్ఞానం పోగొట్టు కొన్నాడు. వెర్రి ఆవేశంతో తన చేతిని కాళ్లను కూడా దుర్గ మీద ప్రయోగించ సాగాడు.

దుర్గ ప్రతిఘటనైనా లేకుండా కనీసం కన్నీరైనా రాకుండా, తన శరీరాన్ని శంకర్ మూర్ఖత్వాని కప్పగించి తనీలోకంలో లేనిదానిలా నిల్చుంది. ఈ మొండితనం శంకర్ ఆవేశాన్ని మరింత రెచ్చగొట్టగా తీవ్రమయిన రోషంతో మూల నున్న కర్రపై కెత్తాడు. కర్ర ఎత్తిన అతని చెయ్యి అలాగే దృఢంగా పట్టుకోబడింది. శంకర్ ఆశ్చర్యంతో వెనక్కు తిరిగి వెంటనే పాలి పోయాడు. గిరి కళ్ళలో నిప్పులు కురుస్తున్నాయి అతని దృఢమైన బంధంలో శంకర్ చెయ్యి ఇరుక్కొంది. గిరిని చూడగానే దుర్గ గిరి పాదాలమీద వాలి "గిరీ! నాకింత విష మియ్యి. అదే! అదొక్కటే నేను నిన్ను కోరుకొంటున్నాను." అంది.

గిరి కడుపు తరుక్కు పోయింది. "ఇదంతా నీ ప్రయోజ కత్వమే ; అని ఎవరో తనను దెప్పినట్లయింది. చటుక్కున శంకర్ వంక తిరిగి "నీ భార్య ఏదో అడుగుతూంది విన్నావా ? తెచ్చి పెట్టు. అందరి సమస్యలూ తీరిపోతాయి." అన్నాడు.

శంకర్ వంచిన తల ఎత్త లేదు. ఆ మాట్లాడినది గిరికాక ఇంకొకరైతే అతడు ఘాటైన సమాధానం చెప్పేవాడే ! అతడు ప్రపంచంలో అందరికన్నా అధికంగా ప్రేమించి, గౌర వించే వ్యక్తికి ఏ సమాధానము ఇయ్యలేక పోయాడు.

"దుర్గా! నువ్వు కాస్సేపు విశ్రాంతి తీసికో! వెళ్ళు" అన్నాడు గిరి—దుర్గ నీళ్ళు నిండిన తన పెద్ద కళ్ళతో నిరాశగా గిరివంక చూస్తూ "ఒకటే విశ్రాంతి" అంది దీనంగా.

"నా మాట విను —వెళ్ళు" అన్నాడు గిరి మళ్ళీ. దుర్గ వెళ్ళి పోయింది. గిరి శంకర్‌ను చెయ్యి పట్టుకుని తన దగ్గిరే సోఫాలో కూర్చోపెట్టుకుని "శంకర్! నేను నిన్ను స్వంత తమ్ముడిలాగ అభిమానిస్తానని మనసారా నీసుఖం కోరుకొంటా నని నమ్ముతావుగదూ!" అన్నాడు. శంకర్ తలవంచుకొని "నువ్వు నాపాలిట దేవతవి" అన్నాడు.

గిరి నిరసనగా నవ్వి "అంత స్తోత్రం వద్దులే! ఇది విను నీకు ఈ సమస్యలన్నింటికీ చక్కటి పరిష్కార మార్గం చెప్పనా? అన్నాడు.

"అంత కంటేనా? చెప్పు."

గిరి సాధ్యమైనంత శాంతంగా నవ్వుతూ "దుర్గ సూచించిన మార్గమే! ఎలాగో ఒకలాగ దుర్గను, ఈ లోకంలో లేకుండా చేస్తే నువ్వు హాయిగా నీకు నచ్చిన మరో స్త్రీని పెళ్ళి చేసికొని సుఖంగా ఉండవచ్చును. నీ మీదకు ఏ కేసులూ రాకుండా నేను చూస్తాను" అన్నాడు.

శంకర్ ముఖం పాలి పోయింది.

"గిరీ! దుర్గ నన్ను రెచ్చగొడ్తుంది. అవమాన కరంగా మాట్లాడుతుంది. కొట్టాను. కొట్టడం తప్పే అనుకో! కాని వెర్రి ఆవేశంలో నాకంత ఆలోచన ఉండదు—అంతేకాని, దుర్గ చావాలని నేను కోరుకొంటానా?"

"నువ్వు కోరుకోవుగానీ, నేను కోరుకొంటున్నాను. దుర్గకు అదే నయం."

"వద్దు గిరీ! అలా మాట్లాడకు—ఆ భావనేనా మనసుకు కష్టం కలిగిస్తూంది. నేను దుర్గను ఎంత అభిమానిస్తానో మీ కెవ్వరికీ తెలియదు. దుర్గ లేకుండా నేను క్షణం కూడా ఉండ లేను. తనకోసం ఏం చెయ్యమన్నా చేస్తాను—కానీ నన్ను చులకనచేస్తే సహించలేను."

గిరి శంకర్ ముఖంలోకి తేరపార చూశాడు. శంకర్ ముఖంలోనూ ఆవేదన స్పష్టంగా కనిపిస్తూంది. గిరికి కొంత సంతృప్తి కలిగింది.

శంకర్ చేతిని తన చేతిలోకి తీసికొని మృదువుగా నొక్కుతూ "నువ్వు ఉత్త అమాయకుడివి! శంకర్" అన్నాడు. శంకర్‌కు గిరి ధోరణి అంతా తమాషాగా ఉంది. గిరి ముఖం లోకి ఒకసారి చూచి ఊరుకున్నాడు.

"లేకపోతే ఏమిటి చెప్పు! నువ్వు దుర్గనింత ప్రేమిస్తూ కూడా, మీ జీవితంలో ఇంత కలతలు రేగుతున్నాయంటే, ఏమనాలి? పోనీ. ఇట్లాంటి పరిస్థితి నీకు సుఖంగా ఉందా? ఈ గొడవలూ, చికాకులూ, నీ మనసుకేమీ కష్టం కలిగించటం లేదా?"

"ఎందుకు కష్టం కలిగించటంలేదూ? నువ్వు దుర్గను చేసికో మనంగానే నేనెంతో సంతోషించాను. అప్పట్లో దుర్గ వినయమూ, అణకువా నన్నెంతో ఆకర్షించేవి. ఒక్క నీతో తప్ప నాతోనైనా ఎక్కువ మాట్లాడేదికాదు. నా సంసారం

స్వర్గమే అవుతుందని ఆశపడేవాణ్ణి. ఇప్పుడు ఇంచుమించు నాకు పిచ్చెక్కినట్లు ఉంటూంది."

"ఉండదూ మరి? "ఎవరైనా భార్యతో సరదాగా గడపాలని ఆశపడతారుకానీ, గొడవ పెట్టుకు కూర్చోవాలనుకుంటారా ? కానీ, శంకర్ ఇంకొక్క విషయం గూడా అర్థం చేసికోవటానికి ప్రయత్నించు కా స్త—మనం పెళ్ళి చేసికొనేది సజీవమైన మనుష్యులనుకానీ, యంత్రాలనుకాదుగదా! ప్రతి ఒక్కరికీ, వారివారి ఆలోచనలూ వారి వారి కోరికలూ ఉంటాయి. ఒక్కొక్కప్పుడు భార్య భర్తల మధ్య ఈ భావాలలో వైరుధ్యం కూడా కన్పించవచ్చు—అట్లాంటప్పుడు పరస్పర సహకారంతో ఇద్దరూ, ఒకదారికి రావాలి. కానీ ఇద్దరిలో ఒకరు బలవంతాన తమ అభిప్రాయాలు ఇంకొకరికి నెత్తిమీద రుద్దటం ఎలా సాధ్యమవుతుంది చెప్పు ? దుర్గ విధిలేక నువ్వు చెప్పినట్లు పడి ఉండటం నీకు ఇష్టమా ? లేకపోతే, తానై సంతోషంతో నిన్ననుసరించటం నీకు ఇష్టమా? దుర్గ మనసును చిత్రవధ చేసాక, ఆ శరీరాన్నుండి నువ్వేం పొందగలవూ ? జీవంలేని యంత్రంగా దుర్గ మారిపోయిందంటే; నువ్వాపరిస్థితిని ఒక్క క్షణంకూడా భరించలేవు. మానవుడెవడూ ఏకాంతాన్ని భరించలేడు. నువ్వు నీకు తెలియకుండానే దుర్గను, నీ కనుగుణమైన యంత్రంగా మార్చుకుంటున్నావు. అప్పుడు చివరకు మానసికంగా నీకేకాంతవాసం లభిస్తుంది. హృదయాన్నే నాశనం చేసిన తరువాత స్పందన నశించిన ఆ హృదయం శరీరాన్ని ఎలా ఉత్తేజపరుస్తుంది? ఉద్రేకరహితమైన ఆ శరీరాన్ని నువ్వేం చేసింకొంటావూ ? "

శంకర్ ఆశ్చర్యంగా వింటున్నాడు. అతని అంతరాంతరాలలో ఆ మాటలన్నీ అక్షరాలా నిజమేననిపించింది. "ఇంకొక సంగతి శంకర్-నువ్వు దుర్గనెంతో ప్రేమిస్తున్నావు. ఆ ప్రేమను ఆమె గుర్తించేలా చెయ్యి. స్త్రీ పురుషునికి తన సర్వస్వమూ ధారపోస్తుంది. ప్రతిఫలంగా, ఆమె కోరుకునేది లాలనా, అనునయమూ మాత్రమే! నీ అధికారంలో ఎదురు తిరిగే ఆమె హృదయం నీ లాలనలో సర్వమూ మర్చిపోతుంది. తన వ్యక్తిత్వాన్ని కూడా మరిచి, నీ వ్యక్తిత్వంలో తానుగా లీనమవుతుంది. ఆనాడు నీ కోరిక సఫలమౌతుంది. ఇంకొక విధంగా నీ కోరిక నెరవేరదు సరికదా, నీ జీవితాన్ని నువ్వే నాశనం చేసికొన్నవాడవౌతావు.

"మనుష్యులంతా ఒకవిధంగా ఉండరు. ఇనుప స్థంభమూ, వీణ తీగెలూ, ఇనుమునుండే చేయబడ్డాయి-మొదటిది ఎంత దెబ్బకైనా, తట్టుకోగలదు. దానినుండి 'ఢండం' ధ్వనులుతప్ప ఇంకేమీ పొందలేవు. ఏ కాస్త చిన్న దెబ్బకైనా తెగిపోయే వీణ తీగెలను సున్నితంగా మీటినపుడు లోకాన్నే మరపింపచేసే మంజుల మధురనాదాన్ని అందిస్తాయి. మనుష్యుల స్వభావాల్లో కూడా ఇంతటి వైవిధ్యం ఉంది. అర్థం చేసికోగలిగితే, ఆనందాన్ని అనుభవించగలం. గుడ్డిగా ప్రవర్తిస్తే సృష్టికర్త మన కందించిన ఎన్నో వరాలను వ్యర్థం చేసుకున్నవాళ్ళమవుతాము. నేను దుర్గను సమర్థిస్తూ, ఈ మాటలన్నీ చెపుతున్నానని కానీ, నీకు నీతులు చెప్పుతున్నానని కానీ అనుకోకు-నీ సుఖం కోరి మాత్రమే ఇలా చెపుతున్నాను, నువ్వే ఆలోచించుకో! నేను వెడుతున్నాను."

శంకర్ సమాధానానికి కూడా ఎదురు చూడకుండా గిరి వెళ్ళిపోయాడు.

# 18

మానవ స్వభావంకన్న విచిత్రమైనది ఇంకొకటి లేదు. ప్రసాద్ మనసు దుర్గా గిరిల మధ్య స్నేహానికి ఈర్ష్యతో మండి పోతుందంటే, అందుకు తగిన ప్రత్యేకమైన కారణం ఏమీలేదు. ప్రసాద్‌కు దుర్గమీద వ్యామోహమూ, అంటె అదీ లేదు.

ఒక సున్నితమైన ఆవేదన—అంతే!

శంకర్ స్వభావాన్ని అర్థం చేసికొన్న దుర్గ, ప్రసాద్ తమ ఇంటికి వచ్చినప్పుడు, అతనితో చాలా ముభావంగా ప్రవర్తించ సాగింది. అది గమనించి ప్రసాద్ కూడా దుర్గ ఇంటికి రాకపోకలు తగ్గించాడు దుర్గ స్వభావమే అంత అనుకొన్నాడు. కానీ, ఒకనాడు అనుకోకుండా, ప్రసాద్ ఉన్నప్పుడే గిరి కూడా రావటం తటస్థించింది. ఆ నాడు గిరి పట్ల దుర్గ చూపే, అభిమానమూ, అప్యాయత అతని దగ్గర దుర్గకు ఉన్న చనువూ, ప్రసాద్ అంతరాంతరాలలో ఈర్ష్యను లేపింది. తనూ, గిరీ, ఇద్దరూ, దుర్గకు బాల్య స్నేహితులే! తన నంత దులిపి వేయటానికి, గిరినంత నెత్తిన పెట్టుకోవటానికి, ప్రసాద్ హృదయం మండింది. ఆ నాటినుంచీ అతను దుర్గా, గిరిలను ప్రత్యేకమైన దృష్టితో గమనించసాగాడు. మన మనసు లోకి ఏదైనా అభిప్రాయం రాకుండా ఉండాలే కాని, ఒక అభిప్రాయం వచ్చిన తరువాత రంగు కళ్ళద్దాలకు లోకమంతా

రంగుగానే కన్పించినట్లు ప్రతి సంఘటనా, ఆ అభిప్రాయాన్ని బలపర్చేదిగానే కన్పిస్తుంది. మనసులో మండే ఈర్ష్యా జ్వాలలను చల్లార్చుకోవటానికి, దుర్గాగిరిల మధ్య అక్రమమైన సంబంధముండి ఉండవచ్చనే ఊహ తరుణోపాయమైంది. ప్రసాద్‌కు, ఈ రకమైన భావనలు చాలా చిత్రమైనవి. అవి కలిగిన వ్యక్తులు తమలో తాము ఆలా భావించటం వల్ల తృప్తి పడలేరు. ఇంకో పది మందైనా తమతో ఏకీభవించాలి. అలా జరగక పోతే, తమ భావనలో తమకే నమ్మకం ఉండదు మరి!—

ఒకసారి జానకి దగ్గిర ఈ విషయం కదిపాడు—
"జానకీ? దుర్గకు గిరి అంటే ప్రాణం కదూ!" స్వెట్టరు అల్లుతున్న జానకి తలెత్తకుండానే "అవును—నాకు కూడా ఆయన అంటే చాలా ఇష్టం. చాలా సరదా అయిన మనిషి—తను నవ్వుతూ ఎదుటి వాళ్లను నవ్విస్తూ ఉంటాడు" అంది.

ఈ సమాధానంతో ప్రసాద్‌కు మరింత మండింది. కసిగా "నీ ఇష్టానికి, దుర్గ ఇష్టానికీ, చాలా తేడా ఉందిలే!" అన్నాడు—

"ఉండచ్చు! అతని దగ్గిర చిన్నప్పటినుంచీ దుర్గకు చాలా చనువు ఉంది. హరి గిరి, దుర్గా చిన్నతనం నుంచీ ఒక్క ప్రాణంలా ఉండేవారట!"

"అందుకే పాపం! ఇప్పటికీ దుర్గను వదలలేక అస్తమానూ వస్తూ ఉంటాడు."

ఇంత సేపటికి ప్రసాద్ మాటలలో ఏదో వ్యంగ్యాం ధ్వనించింది జానకికీ— తలెత్తి చూసి "బాగుంది! నువ్వొ

నేను వెళ్ళటంలా? ఇందులో పెద్ద అనుకోవలసిందేముంది? అంది—

"నువ్వూ నేను వెళ్ళటమూ, గిరి వెళ్ళటమూ, ఒకటే నంటావా? అసలు నేననుకోవటం..."

ప్రసాద్ ఏం చెప్పదలచుకున్నడో ఊహించిన జానకి అతని వాక్యం పూర్తి కాకుండానే కయ్యిమంది. "ఊరుకో అన్నయ్యా! మీ చదువులూ, సంస్కారాలూ ఏ గంగలో కలుస్తాయో అర్థం కాదు. నువ్వనుకునేదేమిటో నాకు తెలుసులే! నీకు పుణ్యముంటుంది. నువ్వనుకునే దానిని ఎన్నడూ మాటలలో పెట్టకు. అలా అనుకోగలిగినందుకు సిగ్గుపడు... దుర్గా గిరిల మధ్య ఉండే అనుబంధం నాకు తెలుసు...నువ్వనుకునే దానిలో వెయ్యోవంతులు నిజం ఉన్నా, దుర్గ గిరికి భార్య అయి ఉండేది. అనవసరంగా వాళ్ళను అనుమానించి నిన్ను నువ్వు అవమానం చేసికోకు."

జానకి ఇలా విరుచుకు పడటంతో ప్రసాద్ అక్కడనుండి వెళ్ళిపోయాడు. జానకిమాటల వల్ల అతని ఊహాలో ఏం మార్పు రాలేదు.

ప్రసాద్ ఈర్ష్యను ఇనుమడింప జేసే సంఘటన మరొకటి జరిగింది. ఒకనాడు కాకతాళీయంగా శంకర్ ఇంట్లో లేని సమయంలో ప్రసాద్ దుర్గ ఇంటికి వెళ్ళటం జరిగింది. ప్రసాద్ రాక పోకల వల్ల శంకర్ పడే చిరాకును భరించలేని దుర్గ ప్రసాద్‌ను తమ ఇంటికి రాకుండా చేయటమే మంచి మార్గమని నిశ్చయించింది.

"ప్రసాద్! నీతో ఇలా చెప్పవలసి వచ్చినందుకు నాకు చాలా కష్టంగా ఉంది. నిస్సహాయురాలినై ఇలా చెప్తున్నాను. నీ రాకపోకలవల్ల నా సాంసారిక జీవిత ప్రశాంతతకు భంగం కలుగుతూంది. నన్ను క్షమించి నువ్వు ఇక్కడకు రావటం తగ్గిస్తే నాకు మేలు చేసిన వాడవవుతావు. నువ్వు అర్థం చేసికో గలవని ఇలా చెపుతున్నాను. ఏమీ అనుకోకు." అంది. ప్రసాద్ తెల్లబోయాడు. వెంటనే అక్కడి నుంచి లేచ్చి వెళ్ళి పోయాడు. కానీ, అవమానంతో అతని మనసు కుతకుత ఉడికి పోతోంది "పెద్ద పతివ్రతలాగ వేషాలు! ఆ గిరిగాడితో ఇష్టం వచ్చినట్లు కులుకుతూ!..." ఇదీ అతని కచ్చి...

ఏదో ఒక విధంగా ప్రతీకారం తీర్చుకోవాలని అతని ఈర్ష్యాపూరిత హృదయం వ్యాకులపడుతూంది...

హోటల్లో కాఫీ త్రాగుతున్న ప్రసాద్, తన ఎదురుగా కాఫీ త్రాగుతున్న హరిని చూసి సంభ్రమంతో అతని దగ్గరకు వెళ్ళి పలకరించాడు.

"హరీ! ఎప్పుడొచ్చావ్! బొత్తిగా కనబడటం లేదేం? దుర్గను చూడటానికి వచ్చినప్పుడైనా మా ఇంటికి రాకూడదా?"

హరి నవ్వి ఊరుకున్నాడు.

"ఏమిటి విశేషాలు?" అన్నాడు ప్రసాద్ మళ్ళీ.

హరి కాఫీపూర్తిచేసి "పైన రూంలో ఉంటున్నాను. అక్కడికి పోయి మాట్లాడుకుందాం పద! ఈ గందరగోళంలో ఎందుకూ?" అన్నాడు. హరి హోటల్లో రూం తీసికొని

ఉంటున్నందుకు ప్రసాద్ ఎంతో ఆశ్చర్యపోయాడు. రూంలో వెళ్ళికూర్చున్నాక ఆ మాటే అడిగాడు.

"ఇదేమిటి హరీ! స్వంత చెల్లెలు ఊళ్ళో ఉండగా, నువ్వు హోటల్లో దిగటమేమిటీ?"

"పరిస్థితులలా వచ్చాయి. ఏం చెయ్యమంటావు?"

"నేను వినకూడనిది కాకపోతే, నాకు తెలిసికోవాలనుంది హరీ!"

"అంత పెద్ద రహస్యం కాదు....దుర్గ సంసారంలో ఏవో చికాకులు వచ్చాయి. అవి సర్దడానికి నేను ప్రయత్నిస్తే శంకర్‌కు కోప మొచ్చింది—ఆ స్పర్థల వల్ల నేను అక్కడ దిగలేదు—"

"బాగుంది. ఏవో కలతలొస్తే, సర్దుకోవాలి కానీ. అవి పెంచుకు కూర్చుంటారా?"

"అదికాదు ప్రసాద్! శంకర్ స్పష్టంగా నన్ను తమ ఇంటికి రావద్దని చెప్పాడు. ఏం చెయ్యాలి మరి?"

"నాకు చాలా ఆశ్చర్యంగా ఉంది. అయితే మరి...." అంటూ సందిగ్ధంగా ఆగిపోయాడు.

హరి ఆత్రుతగా "ఏమిటి?" అన్నాడు.

ప్రసాద్ సందేహిస్తున్నట్లుగా "మీ కుటుంబ విషయాల్లో కలుగజేసికోవటం మంచిది కాదులే క్షమించు" అన్నాడు.

హరిలో కుతూహలం పెరిగింది. ప్రసాద్ చెయ్యి పట్టుకొని, "నువ్వూ నేనూ చిన్నతనంనుంచీ స్నేహితులం. మన

మధ్య ఇంతటి సంకోచమెందుకూ ప్రసాద్! నాకు చెప్పవూ?" అన్నాడు.

"నాకు తమాషాగా ఉంది హరీ! స్వంత అన్నవు నువ్వక్కడికి వెళ్ళటానికి వీల్లేకపోవటమేమిటి? ఆ గిరికి అక్కడ అంత స్వతంత్రమేమిటి? అన్నవైన నీకంటే, గిరి ఆ కుటుంబానికి కావలసినవాడన్నమాట"

హరి తల వంచుకొన్నాడు. ఈ విషయం అంతకు ముందే అతని మనస్సులో అనేకసార్లు మెదిలింది. దుర్గ తన చికాకులన్నీ తనకు వ్రాయకుండా గిరికి వ్రాయటం, తాను ఆ ఇంటికి కూడా వెళ్ళకూడని పరిస్థితిలో, గిరి వాళ్ళకు ఆత్మీయుడు కావటం, అతని మనసులో ముల్లులా గుచ్చుకొంటూనే ఉంది. అన్నింటికంటే గిరి దుర్గను ప్రేమించాడనే హరి నమ్మకం. దుర్గే అతనిని కాదని శంకర్‌ను చేసుకుందని హరి భ్రమ. ప్రస్తుత సంసార పరిస్థితులలోని అల్లకల్లోలానికి తట్టుకోలేక, దుర్గ తనను ప్రేమించిన గిరి మీద ఆధారపడిందా? అని హరి అంతరాంతరాలలో ఒక అనుమానం అయినా దుర్గ క్లిష్ట పరిస్థితి ఆధారంగా ఆమె జీవితాన్ని నాశనం చేసేటంత నీచుడు గిరి కాడనే విశ్వాసమే అతని ధైర్యం. హరి ముఖంలో తనకు కావలసిన మార్పులు గమనించిన ప్రసాద్, సంతృప్తిగా ఊపిరి పీల్చాడు. సమిధలు వేయడానికి ఇదే సందని కూడా ఆలోచించాడు.

"ఇంకొక సంగతి హరీ! నువ్వేమీ అనుకోనంటే చెపుతాను" ఏమిటన్నట్లు చూశాడు హరి,

"దుర్గ నాకు కూడా స్నేహితురాలు. నేనుకూడా ఆమె క్షేమం కోరే వాడిని. అన్నవైన నీకీ విషయం తెలిస్తే దీనికి పరిష్కార మార్గం ఆలోచిస్తావని చెపుతున్నాను. అంతేకాని, ఎవరి మీదా ద్వేషంతో కాదు."

"సంగతి చెప్పు! ఇంత నానుస్తావేం" అన్నాడు విసుగ్గా.

"ఇది విసుగ్గా వినవలసిన సంగతి కాదు. శాంతంగా ఆలోచించవలసిన విషయం-నీకు విసుగ్గా ఉంటే చెప్పకపోవటమే మంచిది."

ప్రసాద్ ఊరించే పద్ధతి చూస్తే హరికి ఒళ్ళు మండుతూంది.

నాకేం చెప్పొద్దులే. ఫో! అందామని కూడా అనిపించింది. కానీ, తన కుతూహలాన్ని అణచుకోలేక, "నేనేం అనుకోను అసలు విషయం చెప్పు" అన్నాడు.

ప్రసాద్ బాధ పడ్తున్నవాడిలాగ ముఖం పెట్టి "ఏం లేదు, చుట్టు ప్రక్కల వాళ్ళంతా, దుర్గాం గిరిలను గురించి రకరకాలుగా అనుకొంటున్నారుట. అసలైన రక్తసంబంధీకులెవరూ, రాకపోగా శంకర్ కేదో దూరపు చుట్టమైన ఈ గిరి ఇంత తరచు రావటం అందరికీ ఆశ్చర్యంగానే ఉంటుందిమరీ. అంతేగాక, గిరి సాధారణంగా శంకర్ లేని సమయాల్లోనే వస్తాడట. అందుకని చుట్టు పక్కల అందరూ చెవులు కొరుక్కొంటున్నారు. వెధవసంఘం! మంచి చెడ్డలక్కర్లేదు దానికి." అన్నాడు.

హరి మనసు మండిపోతోంది. తనకీ వార్తను చెప్పిన ప్రసాద్‌ను చాచి లెంపకాయలు కొట్టాలన్న ఉద్రేకాన్ని అతి ప్రయత్నం మీద అణచుకుని "ఎవరు చెప్పారు నీకీ సంగతులన్నీ ? కష్టపడి సేకరిస్తున్నావా ?" అన్నాడు నిరసనగా.

ప్రసాద్ ఖంగారు పడి "ఛీ! ఛీ! నేనసలు దేంట్లోనూ కలిపించుకోను. మొన్న ఏదో మాటల మీద జానకి ఎంతో బాధపడుతూ చెప్పింది. నాకు కూడా చాలా కష్టమనిపించింది. నువ్వేదైనా ఉపాయం ఆలోచించి ఈ పుకార్లను అణచివేస్తావని నీతో చెపుతున్నాను" అన్నాడు.

జానకి చెప్పిందనగానే హరి కృంగి పోయాడు. జానకి అంటే హరికెంతో గౌరవము. ఎప్పుడూ ముక్కుకు సూటిగా పోతుంది. మనసులో మాట కచ్చితంగా చెవుతుంది. అబద్ధాలూ, తప్పుడు ప్రచారాలు చెయ్యదు. సరికదా. ఎవరైనా చేసిన వాళ్లను అసహ్యించుకొంటుంది. ఎన్నడూ, ఎవ్వరినీ దోషిగా నిరూపించి మాట్లాడదు. తనకెవరి ప్రవర్తనైనా నచ్చకపోతే వాళ్ళను గురించి ప్రస్తావించదు. అట్లాంటి జానకే ఈ వార్త చెప్పిందంటే అందులో తప్పక సత్యముండాలి. అంతేగాక జానకీ, దుర్గా ఆత్మీయులైన స్నేహితులు. దుర్గ పరిస్థితి జానకికి చక్కగా తెలుస్తుంది. లేని మాటలనామె ఎందుకు చెప్తుంది ?

ఎంతో ఉత్తముడూ, ఉన్నతమైన ఆదర్శాలు కలవాడూ, అని భావించిన గిరి, చివరకు ఇలా దిగజారాడా ?

ప్రసాద్ తన మనసులోని మంట చల్లార్చుకుని అక్కడి నుంచి వెళ్ళిపోయాడు. ఆ మంటలు ద్విగుణీకృతమైన జ్వాలలతో హరి హృదయంలో ప్రజ్వరిల్లాయి.

# 19

అప్పుడే ఆఫీసునుంచి వచ్చి బట్టలు మార్చుకుని, కాఫీ త్రాగుతున్న గిరి, హరి రాగానే సాదరంగా ఆహ్వానించి అతనికికూడా కాఫీ అందిచ్చాడు.

హరి విసుగ్గా "నాకు కాఫీ, గీఫీ, ఏం అక్కరలేదు." అని కప్పులను వెనక్కు తోసేసాడు. గిరి ఆశ్చర్యంగా హరి ముఖంలోకి పరీక్షగా చూశాడు. అతని ముఖంలో ఇటీవల కలిగిన మార్పును గమనించే సరికి గిరి గుండె ద్రవించి పోయింది. ఏదో జబ్బుపడి లేచినట్లున్నాడు. అతని హృదయంలోని ఆవేదన అతని కళ్ళల్లో ప్రతిఫలిస్తూంది. గిరి అతని దగ్గరగా వచ్చి అతని చేతిని తనచేతిలోకి తీసికొని అనునయంగా నొక్కుతూ, "ఏదీ సీరియస్‌గా తీసికోకు హరీ! జీవితంలో ముందుకు తోసుకుపోవటం నేర్చుకో!" అన్నాడు.

హరి గిరి చెయ్యి విదలించి "ఇక మీదటనుంచి మర్యాద కూడా, సీరియస్‌గా తీసికోకపోవడం నీదగ్గర నేర్చుకొంటానులే" అన్నాడు.

గిరి ఆశ్చర్యంగా అతనివంక చూసి "నీ ధోరణి ఇవాళ తమాషాగా ఉంది హరీ!" అన్నాడు.

"అవును ముఖం ఎదురుగా ఆప్యాయత నటించి వెనకాల గోతులు తవ్వటం నాకు చేతకాదు."

ఈ మాటలతో గిరి ముఖం గంభీరంగా మారిపోయింది. నిదానంగా అన్నాడు.

"ఎవరి గురించి మాట్లాడుతున్నావ్ హరీ! విషయ మేమిటి?"

"నాకత్యంత ఆత్మీయులనుకున్న వాళ్లే నాకంతులేని క్షోభను కలిగిస్తుంటే, నేనెవరితో చెప్పుకోను?"

హరి కంఠం గద్గదిక మయింది. గిరి గుండెలు కలుక్కుమన్నాయి. తన అంతరాంతరాల్లోని రహస్యం హరికీ తెలిసిపోయిందా?

హరి కుర్చీలో వెనక్కు జేర్లగిల బడ్డాడు, అలసటతో; ఆవేదనతో, రోషంతో, అవమానంతో అతని కళ్ళు మండుతున్నాయి.

"కాని, గిరీ. నేను నమ్మలేక పోతున్నాను. ఇదంతా నీకు తెలిసే చేస్తున్నావా? తెలియక చేస్తున్నావా?"

విపరీతమైన వేగంతో స్పందించే గుండెలను అణచిపట్టి, సమాధానం చెప్పక, ఇంకా హరి చెప్పే మాటల కోసం ఎదురు చూడసాగాడు గిరి—అతని ముఖం పాలిపోయింది. అపరాధిలా కళ్ళు వాల్చుకున్నాడు. వణికే పెదిమలను బలవంతంగా పళ్ళతో నొక్కి ఉంచాడు. తీవ్రతరమైన ఒకానొక ఉద్రేకాన్ని బలవంతంగా నిగ్రహించుకుంటూన్న లక్షణాలతనిలో స్పష్టంగా కన్పిస్తున్నాయి.

అప్పటి గిరి ముఖమూ, అతని మౌనము, హరిలోని అసహనాన్ని ఉచ్ఛస్థాయిని చేర్చాయి. ప్రసాద్ చెప్పిన మాటలు అతని మనసును పుండులాగ బాధించినా గిరి మీద గల విశ్వాసం, ఆ మాటలను నమ్మనియ్యలేదు. ఇందులోఏదో అసత్యం ఉండాలి. ఎవరో పొరబడి ఉండాలి" అని తననితాను

ఓదార్చుకోవడానికి ప్రయత్నించాడు, గిరి ద్వారా అంతా అబద్ధమని తెలిసికొని సంతృప్తి పడాలనే ఆశ అతని మనసులో ఏ మూలనో ఉంది.

కాని ఇప్పటి గిరి మౌనమూ, తన మాటలను వింటూ అతడనుభవిస్తూన్న సంక్షోభమూ,హరి అనుమానాలను దృఢం చేసింది. అణచి ఉంచుకొన్న అతని ఆవేశం కట్టలు తెగింది. విప రీతమైన రోషంతో వణికిపోతూ లేచి నుంచున్నాడు—

"నువ్వు దుర్గను ప్రేమిస్తే అందులో తప్పులేదు కాని, నీ ప్రేమ కోసం దాని జీవితం నాశనం చేద్దామనుకుంటు న్నావా? నీ ప్రేమ నిజమయినదైతే నువ్వు ప్రేమించిన వాళ్ళ సౌఖ్యాన్ని కోరుకుంటావు. అంతేకాని, నీ స్వార్థాన్ని చూసుకోవు. దుర్గ ప్రస్తుత సంసార పరిస్థితిని చక్కదిద్దటానికి ప్రయత్నించడానికి మారుగా, నీ స్వప్రయోజనానికి వాడు కుంటున్నావా? చుట్టు ప్రక్కల అందరూ మిమ్మల్ని గురించే అనుకుంటున్నారనీ అది దుర్గకు అవమానకరమనీ, అయినా ఆలోచించలేదేం? ఛీ!ఛీ! ఇంత నీచుడివనుకోలేదు. ఇంక మీదనైనా, నా మీద దయతలచి అక్కడకు వెళ్ళకు. నా ప్రార్థనను మన్నించు."

ఈ మాటలను పూర్తిచేయటమూ. హరి గబగబ బయ టకు నడవటమూ, ఒక్కసారే జరిగినాయి. గిరి తన దిగ్భ్రాం తిలోంచి తేరుకునేసరికి, హరి అక్కడ లేడు—

గిరి తన మనసులోనైనా, హరికి గాని, ఉమకుగాని ద్రోహం తలపెట్టక పోయినా హరి తనదిగా భావించిన ఉమనే తనూ ఆరాధించటం, ఒక దోషంగానే భావించాడు—దీనికితోడు

ఉమకూడా తన పట్ల అనురాగాన్ని చూపటం, హరిని తిరస్కరించడం, అతనికి మరింత బాధ కలిగించింది. ఉమ తనను నిర్లక్ష్యం చేసి హరిని చేసికొని ఉంటేనే హాయిగా ఆనందించే వాడు గిరి—ఉమ తిరస్కారానికి హరి అనుభవిస్తున్న వ్యధకు తానే బాధ్యుడయినట్లు అతని అంతరాత్మ అల్లరి పెడుతూంది. తన ప్రాణ మిత్రుడయిన హరి ఆవేదనను, అందులో తన కారణంగా కలిగిన, ఈ నిరాశను నిర్మూలించ వలసిన బాధ్యత తనదే నని కూడా అనుకున్నాడు గిరి—

దుర్గ విషయంలో హరి వేరొక విధంగా భావించగల డనే అనుమానం, గిరికి ఏకోశానా లేదు. అందుకనే హరి, ఉద్రేకంగా సంభాషణ ప్రారంభించగానే అతడు ఉమ విషయమని భావించాడు. అతని అపరాధిత హృదయం హరిముందు సంకోచంతో ముడుచుకు పోయింది. మాట్లాడ టానికి నోరు రాలేదు. తల ఎత్తి మిత్రుని చూసే ధైర్యంకూడ లేకపోయింది గిరికి.

ఒక్క సారిగా దుర్గ ప్రస్తావన వినగానే, దిగ్భ్రమచెందాడు గిరి—అంటే హరి మనసులో ఈ అభిప్రాయం ఎప్పటి నుంచో ఉందన్నమాట! తన పెళ్ళి గురించి హరి ప్రశ్నించి నప్పుడు తానిచ్చిన సమాధానం ఈ ఊహను బలపరచి ఉండాలి— అయ్యో హరీ!

తన ప్రాణమిత్రుడైన హరి మనః సంక్షోభం గిరికికూడా చాలా బాధ కలిగించింది. ఎలాగైనా హరి దిగులునంతా కడిగి వెయ్యాలి. దుర్గ సంసారం చక్కబడాలి. దుర్గను తన చెల్లెలి లాగ అభిమానిస్తున్నానని హరి అర్థంచేసికోవాలి. ఈ పనులు తనవల్ల అవుతాయా? అన్నింటి కంటే తనకూ, హరికి

మధ్య ఎంతటి స్వల్ప విభేధాలయినా రావటం గిరి సహించ లేక పోయాడు. వెంటనే వెళ్ళి అసలు సంగతి వివరించి. హరితో మనస్పర్థలు లేకుండా చేసికోవాలని అతని మనసు ఆత్రపడ సాగింది. ఆ సమయంలో హరి క్లబ్బులో ఉంటాడని ఊహించి అక్కడకు వెళ్ళాడు. కేరమ్సు ఆడుతున్న హరి గిరిని చూడ గానే, బోర్డు వదిలేసి అక్కడినుండి లేచి గిరి ముఖమైనా చూడ కుండా తన మోటారు సైకిలు మీద వెళ్ళిపోయాడు. గిరి శూన్యమైన మనసుతో తనూ వెనుదిరిగాడు.

# 20

అప్పుడే కన్ను మూత పడుతున్న సమయంలో తలుపు చప్పుడయ్యే సరికి, ఎక్కడలేని విసుగూ వచ్చింది ఉమకు. అంతలోనే సర్దుకుంది. విసుక్కునేందుకు వచ్చిందా తానీ ప్రదే శానికి? కళ్లు నులుముకుంటూ లేచివెళ్ళి తలుపు తీసింది. గిరి నవ్వుతూ లోపలకు ప్రవేశించాడు. విద్యుత్ప్రసారిత ప్రదేశంలో నిలువబడినట్లు, ఉమ సర్వ శరీరము సంచలించింది.

"గిరీ" అని అస్పష్టంగా, మత్తుగా గాఢంగా తనలో తా ఁనుకుంటూ అతని గుండెల మీద వాలి పోయింది ఉమ. అ ప్రయత్నంగా. గిరి చేతులుకూడా ఉమను చుట్టి వేశాయి. ఉమ సర్వాంగాలూ. "గిరీ! గిరీ!" అని పిలుస్తున్నట్లుగా తోచింది గిరికి. తన హృదయానికి అత్యంత సమీపంగా ఉన్న ఆమె హృదయం ఎన్నో మహా కావ్యాలను తన హృదయానికి అంద జేసింది. యావత్ప్రపంచమూ; శూన్యమైనట్లు ఆశూన్యంలో తామిద్దరూ మాత్రమే ప్రకాశిస్తున్నట్లు భావించాడు గిరి.—

అంతలోనే స్పృహణీయుడైనాడు గిరి. తనను చుట్టిన ఉమ చేతులను మృదువుగా సడలించి దూరంగా తొలిగి—
"ఇదేమిటి ఉమా?" అన్నాడు—

ఉమ ముఖం ఎర్రబడింది. అవును. ఇదేమిటి? తను గిరిని ఎంత అరాధిస్తున్నా, ఒక్కనాడైనా అతనితో హద్దులు మీరి మాట్లాడినది లేదు. అతని అభిప్రాయం కూడా తెలిసికోకుండా తానిలా తేలిపోయిందేమిటి?

వంచిన తల ఎత్తలేక పోయింది ఉమ. అయినా జరిగిన దానికి ఆమెకు కష్టం కలుగలేదు. ఉచితమో, అనుచితమో యావజ్జీవితమూ తల్చుకొని మురియడానికి ఒక్కక్షణమైనా ప్రసాదించాడు తనకు భగవంతుడు— తన స్త్రీ జన్మ సార్థకమైంది. అప్రయత్నంగా తనను చుట్టిన గిరి చేతులనుండి తన శరీరానికి వ్యాపించిన మధురిమ, ఎన్ని జన్మలకు సరిపోదూ?

తల వంచుకుని, ఎర్రబడిన చెక్కిళ్ళతో, అర్ధనిమీలిత నేత్రాలతో, అనురాగ పూర్ణమైన మందహాసంతో తన ఎదురుగా నిలువబడిన ఉమను చూసి గిరి హృదయం బాప్పురుమంది. "నేనెంత దురదృష్టవంతుడనీ?" అనుకోకుండా ఉండలేక పోయాడు.

"మీరు చాలా అలసినట్లున్నారు. నేనలా తిరిగి వస్తాను." అన్నాడు గిరి.

ఉమ కంగారుగా "లేదు! లేదు! నేనేం అలసి పోలేదు. ఇంకా నిద్రేమిటి?" అంది.

నిజంగానే ఆమె అలసట అంతా ఎగిరి పోయింది. ఒకవేళ పడుకున్నా తానింక నిద్రపోగలదా?

"మీరు డ్యూటీకి ఎన్ని గంటలకు వెళ్లాలి?" అన్నాడు.

"న్యాయంగా తొమ్మిది గంటలకు—కానీ, ఎప్పు డంటే అప్పుడు పిలుపు వస్తూనే ఉంటుంది.

"బొత్తిగా విశ్రాంతి ఉండదనుకుంటానేం?"

ఉమ తలెత్తి గిరి వంక చూసి అదోకరకంగా నవ్వింది. "విశ్రాంతి ఉండకూడదనేగా ఇక్కడకు వచ్చింది!"

గిరి గుండెల్లో గుచ్చుకుందా నవ్వు. తన భావోద్వే గాన్ని అణచుకోలేక ముఖం తిప్పుకొన్నాడు.

"మీకు స్నానానికి ఏర్పాటు చేస్తానాగండి." అంటూ ఉమ లోపలికి వెళ్ళబోయింది.—

"స్నానమేమిటి? ముఖం కూడా కడుక్కోలేదు."

"అయితే ముఖం కడుక్కోవటానికి వేడినీళ్లు పెడ తాను."

"మీ కెందుకు శ్రమ? పని వాళ్ళు లేరా?"

"ఇక్కడ అందరూ పని వాళ్ళే! ఒక హాస్పిటలు సర్వెంటే వస్తుంది. కానీ, ఇంకా చాలా ఆలస్యంగానే వస్తుంది. అయినా మీకు వేన్నీళ్లు పెట్టడం నాకు శ్రమా? ఇంతకంటే ఆనందం కలిగించేది ఇంకొకటి ఉండదు—ఈ మాత్రం అదృష్టం కోసం ఎన్ని జన్మలైనా తపస్సు చేస్తాను."

గిరి ఇంకేమీ మాట్లాడలేదు. క్షణక్షణానికి అతని హృదయం వశం తప్పుతోంది. ఉమను గాఢంగా పొదువుకొని తనలో లీనం చేసుకోవాలనే, తీవ్రమైన ఆకాంక్షను, అతి నిగ్ర హంతో అణగ్రదొక్కుకొంటున్నాడు గిరి—అతని సర్వ ఉద్రే

కాలకూ ఒకటే మంత్రం 'ఉమ హారి సొత్తు—హారి ప్రణయిని' ఈ భావన అతని సమస్త ఉద్రేకాలనూ తుడిచిపెట్టి, మమతలను మాత్రం నిలుపుతుంది.

ఉమ ఇచ్చిన వేడి నీళ్లతో ముఖం కడుక్కొని, ఆమె అందించిన కాఫీ అందుకున్నాడు గిరి—ప్రతి క్షణమూ, అతని హృదయం హాయిహాయిమంటూనే ఉంది. ఉమ ఈ లోకంలోనే లేదు. ఆనాడు ఆమెకు ప్రతి వస్తువు ఎంతో అందంగా, ప్రతి పనీ ఎంతో ఆహ్లాదకరంగా. లోకమంతా ఆనందమయంగా అనిపించ సాగింది.

"ఇవాళ సెలవు పెడతాను." అంది ఉమ.

గిరి అడ్డంగా తల తిప్పుతూ "వద్దు—ఏ ప్రలోభమూ మిమ్మల్ని కర్తవ్య విముఖురాలినిగా చేయకూడదు." అన్నాడు.

"సరే అయితే వీలైనంత త్వరలో వస్తాను."

"పరవాలేదు. నేను రాత్రి ట్రైనులోనే కాని వెళ్లను. మీరు వచ్చిన తరువాతే, మనం సావకాశంగా మాట్లాడుకోవచ్చును.

ఈ రోజే వెళ్ళిపోతారా?" దిగులుగా అంది ఉమ.

"అప్పను సెలవు లేదు."

ఆ రోజు ఇద్దరూ కూర్చుని అన్నాలు తింటుంటే ఉమ "నా చేతులతో మీకు వడ్డిస్తూంటే నాకు ఎంత సంతృప్తిగా ఉందో చెప్పలేను. ఇట్లాంటి ఒక్క రోజు కోసం జీవితంలో ఎన్నైనా సంతోషంతో వదులుకో గలను." అంది.

గిరి తింటున్న అన్నంలోంచి చెయ్యి పైకితీసి "మీరిలా చీటికి, మాటకీ, నన్ను ఉక్కిరి బిక్కిరి చేస్తే, నేను ఇప్పుడే పారి పోతాను." అన్నాడు గంభీరంగా

ఉమ మాట్లాడ లేదు కానీ, ఆమె కళ్ళలో నీళ్ళు తిరి గాయి. ఆ కన్నీళ్ళు చూసి గిరి ఆర్ద్ర స్వరంతో "ఉమాదేవీ! నేను వచ్చి మీకు కష్టం కలిగిస్తున్నానా?" అన్నాడు.

ఉమ వెంటనే "లేదు. లేదు." అంది—

క్షణకాలమాగి గిరి "నాకు తెలుసు—నా రాక మీకు వ్యధ కలిగిస్తుందని—అయినా తప్పనిసరి కారణం వల్ల వచ్చాను. రాక పోవటానికి ఏమాత్రం వీలున్నా వచ్చేవాడిని కాను," అన్నాడు. ఉమ నవ్వింది.

"అట్లాంటి తప్పనిసరి కారణాలు కలగటం నాఅదృష్టం లేకపోతే ఈ మాత్రం భాగ్యానికి కూడా నోచుకోక పోయే దానిని. అయినా ఏమిటా కారణాలు.?" కుతూహలంగా అడిగింది ఉమ.

"మీరు డ్యూటీనుంచి వచ్చాక చెపుతాను. హడావుడిగా మాట్లాడే విషయాలు కావు." అన్నాడు.

ఉమ ఆశ్చర్యంగా అతని వంక ఒక్కసారి చూసి ఊరు కొంది.

ఉమ హాస్పిటల్‌కు వెళ్ళగానే, టేబిల్ మీది ఉమ ఫోటోగ్రాఫ్ తీసి గట్టిగా గుండెలకదుము కొన్నాడు, గిరి.

తన తలపు మాత్రంతో పులకితురాలయే స్త్రీని, తన సేవే జీవితానందమనుకొనే స్త్రీని, తాను మానసికంగా, శారీర

కంగా, అతి గాఢంగా వాంఛించే స్త్రీని తానై వదులుకునే దురదృష్టం, ఏ పురుషుడి జీవితంలోనైనా తటస్థపడుతుందా?

భారంగా కనులు మూసుకొన్నాడు గిరి. రైలు ప్రయాణం వలని అలసట అతనిని త్వరలోనే నిద్రాదేవి వడిలో చేర్చింది.

# 21

చూస్తూ ఉండగానే, ఉమ అందమైన పూలమాలగా మారి పోయింది. ఆ మాలలోని ప్రతి పువ్వూ ఎంతో అందంగా సువాసన లీనుతూంది. గిరి ఎంతో ఆప్యాయంగా ఆ మాలను తన మెడలో ధరించబోయాడు. అంతలో హరి దీనంగా రోదిస్తూ, రోషంగా బెదిరిస్తూ, ఆ మాల కోసం చేతులు జాపాడు. గిరి వదలలేక, వదలలేక కష్టంగా ఆ మాలను హరి చేతికి అందించాడు. కానీ ఆ మాల హరి చేతిలో, నిలవక జారి పోతూంది. హరి ఉక్రోషంతో దాన్ని నలిపి వేస్తున్నాడు—గిరి విల విలలాడి పోతున్నాడు. అంతలో ఆ మాల హరి చేతులో నుంచి, జారిపోయింది. ఎక్కడికో అగాధంలోకి పడబోతున్న ఆ మాలకోసం, ఆత్రుతగా "ఉమా!" అంటూ గిరి కూడా అగాధంలోకి దూకాడు.

ఉలికిపడి కనులు తెరిచాడు గిరి—అతని చేతులు. తన మీదకు వంగిన ఉమను గట్టిగా పొదివి పట్టుకొన్నాయి. అతని సర్వాంగాలకూ చెమటలు పట్టాయి.

సిగ్గుపడి ఉమను వదిలి లేచి కూర్చుని కళ్ళు నలుము కొన్నాడు, గిరి-ఉమ లేచి నిల్చొని "నన్ను కలవరిస్తున్నారే మిటీ?" అంది.

ఆమె కళ్ళు సంతృప్తిగా నవ్వుతున్నాయి. అతని తలగడ ప్రక్కనే ఉన్న తన ఫోటోను చూసిన ఉమ స్వర్గలోకాలలో తేలిపోయింది-గిరి హృదయంలో తనకు స్థానముంది-అతడేదో కారణం వలన కావాలని తనకు దూరంగా ఉంటున్నాడు."

"కలవరించానా?" అన్నాడు బిడియంగా గిరి-

"అవును. నేను వచ్చి చాలా సేపయింది. నిద్రపోతూవ్న మిమ్మల్ని లేపటం ఇష్టం లేక వూరుకున్నాను—ఇంతలో మీ పెదిమలు అస్పష్టంగా కదిలాయి. ఇంత చలిలో శరీరమంతా చెమట పట్టింది. నేను కంగారుపడి మిమ్మల్ని లేపబోయేసరికి, మీరేలేచి "ఉమా!" అంటూ గట్టిగా నన్ను పట్టుకున్నారు."

గిరికి తనకు వచ్చిన కల గుర్తు వచ్చింది. నవ్వుకున్నాడు మనసులోని భావనల ననుసరించే కలలు వస్తాయి.

ఉమ అతనికి కాఫీ అందించింది.

"ఇక్కడ మంచి హోటలయినా లేదు. స్వీట్సు దొరుకుతాయి కానీ, అవి ఏమంత బాగుండవు. కొంచెం సేపాగి ఏదైనా, తయారు చేస్తాను.

"ఏం వద్దు. మీరు వంటలో లీనమయితే. నేను ఉండే, ఈ కాస్సేపటిలోనూ, ఎవరితో మాట్లాడనూ? పైగా, నాకిప్పుడు ఆకలిగా లేదు. ఉమ ఇంక వాదించకుండా వూరుకుంది. ఆమెకు కూడా అతడు చెప్పబోయే విషయాలను వినాలని చాలా కుతూహలంగా ఉంది.

గిరి ముఖం కడుక్కొని తయారయి "అలా బయటకు పోయి, మాట్లాడుకుందాం" అన్నాడు.

"అలాగే! కానీ మీరు కోటు వేసుకుని మఫ్లర్ చుట్టుకోండి. లేకపోతే, వచ్చేపరికి గడ్డ కట్టుకుపోతారు."

ఉమ తలమీదుగా వంటినిండా కాశ్మీరు శాలువా కప్పుకొంది. లోవల స్వెట్టర్ వేసికొంది. అయినా చలికి ఆమె శరీరం కొద్దిగా వణకటం గమనించి, గిరి నవ్వుతూ "ఇంకా, ఇక్కడి వాతావరణం మీ కలవాటు కాలేదా ?" అన్నాడు.

"ఏం ? మీ కప్పుడే అలవాటయిందా ?"

"మేం మోటువాళ్ళం—వడగళ్ళు కురుస్తున్నా, నిప్పులు కురుస్తున్నా, సహించగలం."

"అది మోటుతనం కాదు. మీ ఓర్మి."

గిరి నవ్వి ఊరుకున్నాడు.

వాళ్ళిద్దరూ నడుస్తుంటే దారిలో ఒక చోట చిన్న పిల్లలు ఆటలాడుకుంటున్నారు. అందులో మూడేళ్ళ పిల్లవాడు ఒక పుల్లముక్కను తుపాకిగా చేసికొని గురిపెడ్తున్నట్లు అభినయించి, నోటితో "ఢాం! ఢాం!" అంటున్నాడు. ఆ దృశ్యం గిరికీ కూడా చూపించి ఉమ "ఈ చైనా వాళ్ళు ఎంత పుణ్యాత్ములో చూడండి. మన దేశంలో మూడేళ్ళ పసి వాడి దగ్గర్నుంచి, నూరేళ్ళ ముసలమ్మ వరకూ, ఇంతటి చైతన్యాన్ని కలుగ చేసారు. నిద్రపోతూన్న మనలను మేల్కొలిపారు. మన స్వాతంత్ర్యపు విలువను ప్రతిఒక్కరూ గుర్తించేలా చేసారు. ఇంతటి ఉపకారం మన మిత్రులు కూడా చేయలేరు" అంది.

"మీరు అసలైన హిందువులా మాట్లాడేరు. కీడులో గూడా మేలును గమనించటం హైందవుల లక్షణం."

"నిజమే! ఏ జాతికైనా, కొన్ని సామాన్య లక్షణా లుంటాయనుకుంటాను. తమ లోపాలను తాము గుర్తించ గలిగే ఆత్మ పరిశీలన, వాటిని ఒప్పుకోగలిగే స్థైర్యమూ, త్యాగ దీక్ష, విపరీతమైన ఉద్రేకమూ, ఆరంభ శూరత్వమూ, నిర్ల క్ష్యమూ, అలసటా, మన జాతి సామాన్య లక్షణాలనిపిస్తుంది నాకు."

గిరి ఆలోచిస్తూ నడవ సాగాడు. అక్కడ ఒక భవనం వైపు చూపిస్తూ ఉమ "అదుగో అదే. మా మిలిటరీ హాస్పిటల్ ఇక్కడ అత్యవసరమైన కొంత ట్రీట్ మెంట్ జరిగాక, జోర్ హాట్ పంపిస్తాము. లేకపోతే స్థలం సరిపోదు. ఈ సైనికుల మధ్య మా మనసు కూడా విచిత్రంగా ఉత్తేజమవుతుంది. ప్రతి వారి మనసులోనూ, ఒకటే కోరిక. తన దేశం సంరక్షించుకో వాలని మృత్యు ముఖంలో ఉన్న ఏ ఒక్కడినైనా, ఏం కావా లని అడిగినపుడు, యుద్ధరంగంలో ఉన్న తన తోటి సైనికులకు తగిన సౌకర్యాలను అన్ని విధాలుగా కలిగించవలసిందిగా కోరుకుంటాడే గాని ఏ ఒక్కడూ, తన కుటుంబాన్ని గురిం చైనా తలవడు. తమ తోటి సైనికులే తమ కుటుంబము-దేశ సౌభాగ్యమే తమ సౌభాగ్యము అన్నట్లు ఉంటారంతా! ఏ మాత్రం కోలుకున్నా, మళ్ళీ వెంటనే యుద్ధరంగానికి పరుగె త్తాలని ఆత్రపడతారు. మేము విశ్రాంతి తీసికోవాలని హెచ్చ రించినా, వినిపించుకోరు. వీరి త్యాగ నిరతి ముందూ, వీరి కష్టాల ముందూ మనమూ, మన కష్టాలూ ఎంత అల్పమైనవో

అనిపిస్తుంది—కారణం ఏదైనా, ఇక్కడికి వచ్చి, వీళ్ళకోసం నేను చెయ్యగలిగింది చేస్తున్నందుకు, నాకు చాలా తృప్తిగా ఉంది" అంది.

"కాని, అక్కడ మీ కోసం, మీ తలిదండ్రులెంత క్షోభిస్తున్నారో, హరి ఎంత వ్యథ పడుతున్నాడో, ఆలోచించారా? మొన్న హరి చెప్పాడు. మీ అమ్మగారి ఆరోగ్యం ఏమీ బాగులేదట. అహర్నిశమూ, మీగురించిన ఆలోచనలతో, బెంగతో ఆవిడ మంచం ఎక్కేలాగ ఉన్నారట. మీ నాన్నగారు సరేసరి! ఆయన ప్రతివారితో మీ ప్రస్తావన లేకుండా ఉండలేరు. మిమ్మల్ని తలవని క్షణం ఉండదు."

తన తలిదండ్రుల ప్రస్తావన వచ్చేసరికి ఉమ కళ్ళలో నీళ్ళు తిరిగాయి—చిన్న తనం నుండీ తన కెంతో గారాబ మిచ్చి తన ప్రతి చిన్న కోరి కనూ నెరవేర్చే వాళ్ళ కోరికకు వ్యతిరేకంగా తానిక్కడకు వచ్చింది.

"మీరు, మా అమ్మనూ, నాన్నగారినీ చూశారా?"

"లేదు నాకు హరి చెప్పాడు. హరి తరచు వెళ్ళి వాళ్ళను కలిసి వస్తూనే ఉంటాడు."

ఉమ దీర్ఘంగా నిట్టూర్చి వూరుకుంది. చాలా సేపు మౌనం వహించి, "దురదృష్టవంతురాలిని. కని పెంచినందుకు వాళ్ళ కోరిక తీర్చలేక పోయాను." అంది

ఇద్దరూ ఒక చిన్న మైదానంలో కూర్చున్నాక "ఇప్పటికైనా, ఏం మించి పోయిందీ? మీ తల్లి దండ్రుల కోరిక తీర్చి, మీ ఋణం తీర్చుకోండి." అన్నాడు గిరి.

ఉమ గాద్గదికంగా "క్షమించండి...అది నా చేతులలో పని కాదు." అంది.

గిరి కొంచం సేపు తటపటాయించి "నాకు తలచుకుంటే ఆశ్చర్యంగా ఉంది. మొట్టమొదట సారిగా మనం దుర్గ విషయం ప్రస్తావిస్తూ ఆత్మీయంగా మాట్లాడుకున్నాం. ఆ నాటి నుంచీ మన మధ్య కొంత సన్నిహితత్వం అధికం కాసాగింది. ఆ నాడు మీకు ఆత్మీయురాలైన దుర్గ కోసరం మీరు నా వ్యక్తిగత విషయాల్లో కలిగించుకునేందుకు సంకోచించలేదు. ఆ ధైర్యం తోనే, నే నిప్పుడు నా ఆత్మీయుడైన హరి కోసం మీ వ్యక్తిగత విషయాల్లో కలుగ జేసుకుంటున్నాను అన్నాడు".

"మీరు నా వ్యక్తిగత విషయాల్లో కలుగు జేసుకుంటున్నారని నేనేమీ అనుకోను, నా మీద మీకన్ని విషయాల లోనూ సంపూర్ణాధికారముంది. ఆ విషయం మీకు తెలుసు. అయితే మీరిప్పుడు బావ తరపున వచ్చారన్నమాట!"

"హరి తరపున రాలేదు. హరి కోసం వచ్చాను" హరీ, నేను చిన్నతనం నుండీ, ఒక ప్రాణంలా మెలిగాం. ఒకరి సంతోషం కోసం మరొకరు ఏమైనా, చెయ్యగలిగేటంత గాఢమైన స్నేహం మాది. హరి ఇప్పుడు పూర్తిగా మారి పోయాడు అతనిలో వెనుకటి ఉత్సాహమూ, చైతన్యమూ మచ్చుకైనా లేవు. ఏదో పెద్ద జబ్బు పడి లేచిన వాడిలాగా ఉన్నాడు. ఎప్పుడూ చిలిపితనం ప్రతి ఫలించే అతని కళ్ళలో ఇప్పుడు దైన్యంతప్ప మరొకటికనుపించటం లేదు. హరి ఉద్రిక్త స్వభావుడు. అతని ఆరాధన కానీ, స్నేహం కానీ, ద్వేషం కాని,

అన్నీ తీవ్రంగా ఉంటాయి. సంతోషం కానీ, దుఃఖం కానీ, మనసా అనుభవిస్తాడు. అతడిని చూస్తే నాకు భయం వేస్తూంది. నా స్నేహితుడి కోసం, నేను ఏమైనా చెయ్యగల నేమో ప్రయత్నించటానికి వచ్చాను."

ఉమ నీరసంగా నవ్వి ప్రయత్నించండి." అంది.

"అంత తేలిగ్గా తోసి పారెయ్యకండి ఉమా దేవి! నా ఉద్దేశం మీ కర్థం కాలేదంటే నేను నమ్మను. మీ సమాధానం చెప్పండి."

"అలాగే, నా సమాధానం కూడా మీకు తెలియదంటే నేను నమ్మను. నేను చెప్పేదేముందీ?"

గిరి మాట్లాడలేక పోయాడు. అతని లా పాండిత్యమంతా ఉమముందు ఎందుకూ, పనికి రాకుండా పోతూంది

చటుక్కున "మీరునన్ను ప్రేమిస్తున్నారా?" అన్నాడు

ఉమ ముఖం ఎర్రబడింది. "అదే ప్రశ్న మిమ్మల్ని అడుగుతే?"

"అవునని చెపుతాను. నా మనసంతా మీరే ఆక్రమించు కున్నారనీ, మీ ధ్యానంలోనే, నా ఆనందం వెతుకున్నాననీ చెపుతున్నాను."

ఉమ పులకరాలతో నిండిన శరీరంతో, సంతోషంతో నిండిన కళ్ళతో, గిరి వంక చూసి "ఇన్ని సంవత్సరాల నా తపస్సు ఫలించింది. ఈ మాటలు చాలు నాకు...వీటిని తలచుకుంటూ జీవిత మంతా హాయిగా గడపగలను." అంది.

గిరి తమాషాగా నవ్వాడు.

"మీరు వినవలసింది ఇంకా ఉంది. నా ప్రేమను నేను గుర్తించక ముందు నుంచీ కూడా మీరు నా వారు కాలేరని నాకు తెలును. మిమ్మల్ని నా దాన్నిగా చేసు కోవాలనే ఆశ కానీ, ఆ ప్రయత్నం కానీ, నాలో లేనే లేదు. కేవలం నా మనసులోని భావనలతో మాత్రమే నేను సంతృప్తి పడ గలను. కానీ, హరి సంగతి ఇందుకు పూర్తిగా వ్యతిరేకం. ఊహాలు తెలియని పసితనం నుంచీ కూడా అతడు మిమ్మల్ని తన దానిగా భావించాడు. ఆ భావననే పెంచుకున్నాడు. అందుకనే, ఈ అఘాతానికి తట్టుకోలేక పోతున్నాడు. అత్యంత సున్నిత హృదయుడైన అతడు ఏ క్షణంలో ఏ మవుతాడోనని నాకెప్పుడూ భయంగానే ఉంటుంది. అతని జీవితం నాశనం చేయటం, మనకు న్యాయం కాదు."

"మీరు చెప్పేది అంతా నిజమే! కాని, ఇది మనసుకు సంబంధించిన విషయం.... భావనలు వాటిఅంతట అవి పుట్టాయి. మనం కలిగించు కోలేం కదా !"

"అవును మన మనసులోని కోరికలకు వ్యతి రేకంగా కూడా కొన్నిసార్లు మనం ప్రవర్తించ వలసి వస్తుంది. అది మన కర్తవ్యం."

"అంటే మీరనేది హరిమీద నాకు ప్రేమ లేకపోయినా, అతడిని వివాహం చేసుకుని నా కర్తవ్యం నిర్వహించమనా?"

"అవును."

"కాని అందువల్ల ఎవరికి సుఖం?"

"మీరర్థం చేసికోవటం లేదు ఉమాదేవీ? హరి మిమ్మల్నెంత గాఢంగా ప్రేమించాడో మీకంటే నా కెక్కువ తెలుసు. ఒక్క మీ సహాయమే అతడిని అన్ని దుఃఖాల నుండి దూరంగా చేయగలదు."

ఆ సంగతి ఉమకూ తెలుసు. మాట్లాడలేక తల వంచుకుంది. ఆమె మనసులో ఎంత సంక్షోభం కలుగుతుందో అర్థం చేసుకోగలిగిన గిరి లేచి "పదండి పోదాం! స్థిమితంగా ఆలోచించుకోండి. ఇంకొక ముఖ్యమైన సంగతి కూడా దృష్టిలో ఉంచుకోండి. ఎంత చదువుకున్నా, ఏమైన ఘన సంఘంలో స్త్రీ అవివాహితగా ఉండటం దుస్తరం. సంఘం మాట అలా ఉంచి, వ్యక్తిగతంగా కూడా అలాంటి ఏకాంత వాసాన్ని భరించటం కష్టం. ఆ శూన్యాన్ని, భరించలేక మీరేనాడో ఒకనాడు వివాహం చేసికోక తప్పదు. ఎవరినో చేసికొనే బదులు, హరినే చేసికుంటే మీ కోసం పరితపించే ఒక ప్రాణిని సంతృప్తి పరచిన వారవుతారు" అన్నాడు. ఎంతో గంభీరంగా ఉన్న అతని మాటలు ఉమ మనసులో, అంత వరకూ రేగుతున్న ఆనంద తరంగాలను పూర్తిగా అణచి వేశాయి. వెలవెల పోతూన్న ముఖంతో "అంటే మీరు...." అని సందిగ్ధంగా ఆగి పోయింది.

"నన్ను క్షమించండి ఉమాదేవీ! నేను మిమ్మల్ని మొదటిసారిగా నా ప్రాణ మిత్రుడికి కాబోయే భార్యగా చూశాను. బ్రతికి ఉన్నంత కాలమూ మిమ్మల్ని అలాగే గౌరవిస్తాను. ప్రస్తుతం నాకు పెళ్ళి చేసుకోవాలని లేదు. ఆ కోరిక కలిగిన నాడు, నన్ను కోరే ఎవరినో ఒకరిని వివాహం చేసికుంటాను."

గుండెలను చీలుస్తున్నట్లుగా వచ్చిన ఉమ నిట్టూర్పు తన గుండెలలోని మంటను మరింత అధికం చేసినా, ఆ జ్వాలలను తనలోనే అణచుకుని, ప్రశాంతమైన చిరునవ్వుతో పాటు ఉమ వంక తిరిగి "మనం సాధారణ మానవులం ఉమాదేవీ! రాకూడదని ఆలోచనలు, మన మనసులోకి అనేకం వస్తూనే ఉంటాయి. కానీ, వాటికి లొంగిపోకుండా, మన మార్గంలో మనం నడువగలిగినప్పుడే మన మానవత్వం సార్థక మవుతుంది" అన్నాడు.

ఉమ సమాధానం చెప్పలేదు. లోకమంతా కటిక చీకటిగా ఉందామెకు.

ఇంటికి రాగానే హోల్డాలు చుట్టుకుంటూన్న గిరిని చూసి సంభ్రమంగా "ఇప్పుడే వెళతారా?" అంది ఉమ.

"సెలవు లేదు. అయినా, ఇక్కడ ఉండి మీకు మరింత క్షోభ కలిగించటం తప్ప, నేను చెయ్యగలిగిందేమి ఉంది?"

ఉమ నిలువెల్లా వణుకుతున్న శరీరంతో లేచివచ్చి గిరి దగ్గర వాలిపోయింది. గిరి సంభ్రమంగా "ఛీ! ఉమాదేవీ! లేవండి. ఇందుకు నేను అర్హుడిని కాను." అన్నాడు.

కానీ, ఉమ లేవలేదు. అతని పాదాలపై ఉమ కళ్ళలో నుండి ఆగకుండా స్రవిస్తూన్న కన్నీరు అతని పాదాల మీద పడుతున్నది.

"ఈ ఒక్క కోరిక తీర్చుకోనివ్వండి. దీనివల్ల కలిగే పాప పుణ్యాలన్నీ, నా ఒక్కదానికే?"

గిరి కరిగి పోయాడు.

"పాప పుణ్యాల సంగతి కాదు ఉమా! సరే! మీ జీవితం శుభప్రదం కావాలని ఆశీర్వదిస్తున్నాను" అని ఆమె శిరస్సుపై చేయివేసి నిమిరాడు.

గిరి లేవతీయాలని ఎంత ప్రయత్నించినా, కొన్ని క్షణాల వరకూ, ఉమ అతని చెంత నుంచి లేవనేలేదు. తరువాత లేచి, ముఖం కడుక్కుని తనూ తయారై "నేను కూడా స్టేషనుకు వస్తాను" అంది.

ప్రశాంతంగా ఉన్న ఆమె ముఖంలోకి చూస్తూ ముగ్ధుడై గిరి "రండి" అన్నాడు.

"నన్ను 'మీరు' అని పిలవట మెందుకూ? 'నువ్వు' అని పిలవలేరా?"

"నాకు లేని హక్కును వినియోగించుకోవటానికి ప్రయత్నించట మెందుకూ?"

ఉమ సమాధానం చెప్పలేదు.

రైలును ఎక్కుతూ "ఏం నిశ్చయించుకున్నారూ?" అని అడిగాడు చివరి సారిగా గిరి.

ఉమ తల వంచుకుని "రేపే బావకు ఉత్తరం వ్రాస్తాను. కానీ, నా ఉద్యోగం, నేను చేసుకోవటానికి బావ అంగీకరిస్తేనే మా వివాహం జరుగుతుంది" అంది.

గిరి సంతృప్తిగా నిట్టూర్చాడు. రైలును కదలబోయే సమయానికి ఉమ తన చెయ్యి అందించింది గిరికి. గిరి ఆ చెయ్యి అందుకుని ఆప్యాయంగా నొక్కి విడిచిపెట్టాడు. కాలచక్రంలా రైలు కూడా అమితమైన వేగంతో ముందుకు సాగిపోయింది.

# 22

దుర్గకు నెల తప్పిందనే వార్త అందరికీ సంతోషాన్ని కలుగజేసింది. ఇక శంకర్ గర్వానికి హద్దులు లేవు. గిరి వచ్చి హెచ్చరించిన దగ్గరనుంచి అతనిలో పరివర్తన కలుగ సాగింది. అన్నిటికంటే తన సంసారంలో నిత్యమూ కలిగే చికాకులు, అతనే భరించలేక పోతున్నాడు. దుర్గ తనను గాఢంగా ప్రేమిస్తూందని శంకర్‌కు తెలుసు. గిరి మాటలవల్ల తానా ప్రేమను పోగొట్టుకుంటానేమోననే భయం, శంకర్‌లో కలిగింది. కానీ, తన సర్వశక్తులు, కేంద్రీకరించుకొని తానొక మనిషిగా నిలబడాలని ప్రయత్నించిన దుర్గ, తన ప్రయత్నం విఫలంకాగా, ఒక విధమైన నిర్లిప్తతను అలవరచుకుంది. ఇప్పుడామె శంకర్ అప్యాయతకు పొంగి పోవటమూ లేదు—అతని నిరాదరణకు కృంగి పోవటమూ లేదు. శంకర్ దుర్గను ప్రసన్నురాలినిగా చేసుకోవటానికి శతవిధాల ప్రయత్నించాడు కానీ, ఆమెలో నిజమైన చైతన్యం తీసికొని రాలేక పోయాడు. శంకర్ నిజమైన ఆప్యాయతతో పలకరించినా దుర్గ అది నిజమని నమ్మలేక పోతుంది. ఆమెకు ప్రతిదీ కృత్రిమంగానే కన్పిస్తుంది.

దుర్గకు ఏడవనెల ప్రవేశించింది. సావిత్రమ్మ వచ్చి సూడిదలు చేసి దుర్గను తీసికెళ్ళిపోయింది. శంకర్, అభ్యంతరం పెట్టాడు. దుర్గను చాటుగా గదిలోకి పిల్చి, "నిన్ను విడిచి ఉండలేను దుర్గా? పోనీ, పురుడు ఇక్కడే పోసుకుంటేనేం?" అన్నాడు.

దుర్గ నమ్మలేనట్లు చూసింది. అతని వంక అట్లాంటి మాటలు విని ఎన్నో యుగాలయినట్లుగా ఉంది దుర్గకు. తీరా

వెళ్ళబోయే సమయానికి దుర్గకు కూడా తానింకా శంకర్‌ను ఎంతగా ప్రేమించేదీ అర్థమయింది—శంకర్‌ను విడిచి ఐదారు నెలలుండాలనే భావనకు ఆమె తట్టుకోలేక పోతూంది. నిద్రిస్తున్న ఆమె హృదయం కొద్దిగా కనులు విప్పింది. శంకర్ మెడచుట్టూ చేతులు వేసి, గుండెల మీద తల ఆన్చి, "నాకూ వెళ్ళాలని లేదు. కానీ, అమ్మ కష్టపెట్టుకుంటుంది. ఈ కొంచెం రోజులూ, ఓపిక పట్టండి, మీ బాబుతో సహా తిరిగి వస్తాను." అంది.

"వీల్లేదు. నువ్వెలా వెళ్తావో చూస్తాను." అన్నాడు శంకర్ చటుక్కున—దుర్గ ముఖం వెలవెల పోయింది. అతని మెడను చుట్టిన ఆమె చేతులు అప్రయత్నంగానే సడలి పోయాయి. "ఇంతేనా ?" అన్నట్లు శంకర్ వంక చూస్తూ నిల్చుంది.

శంకర్‌కు తన పొరపాటు తెలిసి వచ్చింది.

"సరే ! వెళ్ళు." అన్నాడు.

అన్నాడే కాని, అతని ముఖంలో విసుగు స్పష్టంగా కనిపిస్తూంది. దుర్గతో మరేమీ మాట్లాడకుండా బయటకు వెళ్ళి పోయాడు. దుర్గకేమీ తోచలేదు. సావిత్రమ్మ దిగాలుగా హాల్లో కూర్చుంది. దుర్గ బయటకు రాగానే "ఏం దుర్గా నువ్వు రావా ? ఇక్కడ నీకెవరు చేస్తారూ ?" అంది.

దుర్గ తల్లి ఒడిలో తలపెట్టుకుని, మౌనంగా కూర్చుంది. శంకర్‌కు తాను వెళ్ళటం ఇష్టంలేదు. వెళ్ళకపోతే, తల్లి ఎంతో బాధపడుతుంది. వెళ్ళక తనూ ఉండలేదు. శంకర్‌లో ఏ పరి

వర్తన కోసం ఇన్నాళ్ళు తపస్సు చేసిందో ఆ పరివర్తన కనుపించీ, కనుపించక ముందే, పరిస్థితులిలా వచ్చాయి. ఛీ! తనంత దురదృష్ట వంతులు ఇంకెవరూ ఉండరు.

సావిత్రమ్మ కూతురి తల నిమురుతూ "ఏరి కోరి చేసుకున్నారు. ఎంతో సుఖపడతారని అను కున్నాను ఎందుకమ్మా మీ కలతలన్నీ?" అంది.

"నా దురదృష్టానికి ఇంకా వేరే వ్యాఖ్యానాలెందుకమ్మా!" దుర్గ దీనంగా అంది. సావిత్రమ్మ కడుపు తరుక్కుపోయింది. దుర్గ చూడటానికి చాలా బలహీనంగా ఉంది. దీనకి తోడు ఏడవ నెల—ఆమెను అక్కడ వదిలి వేయడం, సావిత్రమ్మకెంతమాత్రమూ ఇష్టంలేదు. "ఈ కలతలన్నీ అవే సర్దుకుంటాయి. నువ్వు బయలుదేరు" అంది. దుర్గ కూడా నిశ్చయించుకుంది. కొన్నాళ్ళు తన తల్లి వడిలో, తను పుట్టి పెరిగిన ప్రదేశంలో మసిలి రావాలని దుర్గ కూడా తహతహ లాడుతూంది.

దుర్గ తన సామానులన్నీ సర్దుకుంటూంటే శంకర్ మనసులో మండసాగింది. తనను విడిచి వెళ్తున్నదనే బాధ కంటే, తన మాట కాదని వెళ్తున్నదనే బాధ అతనికి అధికం కాసాగింది. ఎంత అణుచుకుందామన్నా, అతనిలో పదోకసి పెరుగుతూంది. దుర్గ దగ్గిరగా వచ్చి "అవును. మనసులో ప్రేమ లేని వాళ్ళను ఎవరు కట్టి పడేసి ఉంచగలరు?" అన్నాడు.

దుర్గ ఒకసారి తలెత్తి చూసి మళ్లీ మాట్లాడక తన పని తాను చూసుకోసాగింది.

"నా లాంటి చదువుకోని వాడి దగ్గర నీకేం తోస్తుందీ? అక్కడకి వెళ్తే, హాయిగా అందరూ నీలా చదువుకున్న వాళ్లు—నాలా మోటుగా మాట్లాడక చక్కగా సంస్కారంగా మాట్లాడతారు. నీకు హాయిగా ఉంటుంది."

దుర్గ లేచి బీరువా తాళం చెవులు శంకర్ చేతి కిచ్చి "జాగ్రత్త" అంది.

శంకర్ ఆ తాళాలు విసిరికొట్టి "నా కెందుకూ?" అన్నాడు.

"అయితే అత్తగారికిస్తాను." అని దుర్గ వెళ్ళి పోయింది.

శంకర్ మనసు మరింత కుతకుత లాడుతూంది. ఏదో ఉడుకుమోత్తనమూ, ఏదో కసి, ఏదో అశాంతి.

ఈ దుర్గ ఇలా తయారయిందేం?

కొంచెం సేపటి వరకూ, దుర్గ మళ్ళీ వస్తుందేమోనని ఎదురు చూశాడు. ఆమె ఎంతకూ రాకపోయేసరికి తానే "దుర్గా" అని పిలిచాడు. దుర్గ వచ్చింది.

"పిలిచారా?"

"అవును. నీకు తొందరగా నా నుంచి విరగడై పోవాలనుంది. కానీ, నేను మాత్రం నిన్ను వదల లేక పోతున్నాను నీకిష్టం లేకపోయినా, నాకోసమైనా కాస్సేపు నా దగ్గర కూర్చో! ఈ శ్రమ ఇంకొంచెం సేపు పడు."

దుర్గ మాట్లాడక వచ్చి శంకర్ ప్రక్కన కూర్చుంది.

శంకర్ రోషంగా "ఏం మాట్లాడవేం?" అన్నాడు.

చాలా రోజులకు దుర్గ పకాలున నవ్వింది. ఆమెలో మళ్ళీ చిలిపితనం ప్రవేశించింది.

"ఏం మాట్లాడాలో కూడా మీరే చెప్పండి." అంది.

శంకర్ త్రాచుపాములా బుసలు కొడ్తూ; అటూ, ఇటూ, పచార్లు చేస్తూ "నువ్వు ప్రయాణం మానటానికి వీల్లేదా?" అన్నాడు

"వీల్లేదు"

శంకర్ నిర్ఘాంత పోయాడు. క్షణ కాలం దుర్గ మొఖం లోకి చూసి "అయితే అనుభవిస్తావు." అన్నాడు.

దుర్గ లేచి వెళ్ళి రూళ్ళ కర్ర పట్టుకొచ్చి శంకర్ చేతి కిచ్చి "ఆ అనుభవించేదేదో తొందరగా అనుభవింప చెయ్యండి. మళ్ళీ ఎన్నాళ్ళకో!!" అంది.

శంకర్ కళ్ళు ఎర్రబడ్డాయి. అతనిలోని పశుత్వమంతా ఒక్కసారి విజృంభించింది.

"ఊహు! నీ మీద ప్రేమ ఉన్నన్నాళ్ళూ నువ్వు నా దానివనుకున్న నాళ్ళూ. నిన్నలా శిక్షించను. వెళ్ళు—ఇక, నీకూ నాకూ ఏం సంబంధం లేదు. అక్కడ నీ మొగ స్నేహితులందరూ, నీ కోసం ఎదురు చూస్తూ వుంటారు. పరిగెట్టు."

శంకర్ పళ్ళు పటపట నూరాడు. దుర్గ పైకి ఎంత బింకంగా నుంచుందో, లోలోపల ఆమె గుండెలంత పగిలి

పోతున్నాయి. అక్కడి నుంచి అతి నిగ్రహంతో బయటకు వెళ్ళి, తల్లి ఒడిలో పడి శావురు మంది. "లాభం లేదమ్మా! ఏం లాభంలేదు. నీకు నేను కూతురిననే మాట మరిచిపో!"

సావిత్రమ్మ గుండె కలుక్కుమని "ఛీ! ఛీ! అవేం అవాచ్యపు మాటలు? అంది.

అంతలో కామేశ్వరమ్మ అక్కడకు వచ్చింది.

"నువ్వు మరీ పిచ్చిదానివమ్మా దుర్గా! వాడేదో నిన్ను విడిచి ఉండలేక వెళ్ళ వద్దంటే, ఇలా గందరగోళ పడ్తావేమిటి? ఇంకొకరయితే, మురిసి పోయేవారు. బొత్తిగా ప్రేమాలోకం వాడితో రెండు మంచి మాటలు మాట్లాడి ప్రయాణంకా! తెలివి తక్కువగా రొష్టు పెట్టుకోకు. అంది కామేశ్వరమ్మ.

ఎంత జరిగినా, దుర్గ ప్రయాణం మానుకోక పోవటం, శంకర్ మనసులో జ్వాలలు లేచాయి. తానొక ఆడదాని ముందు వోడిపోతున్నాడు. తన భార్య తనను లెక్క చెయ్యకుండా వెళ్ళిపోతూంది..

దుర్గ వెళ్ళబోయే ముందు శంకర్ దగ్గరకు వచ్చి "వెడుతున్నాను." అంది.

"నాకు చెప్పాలా?"

"అది నా ధర్మం."

"ఓహో! నీకు ధర్మం కూడా తెలుసు. ఎప్పుడక్కడికి పోయి, అడ్డూ, అయిపూ లేకుండా ఇష్టమొచ్చిన వాళ్లతో వూరేగుదామా? అని చూస్తున్న దానవు. నీకిక్కడ కాలెలా

నిలుస్తుంది ? అంత వరకూ నిగ్రహించుకున్న దుర్గ, ఇక ఓర్వ లేక పోయింది.

"మీరీ మాటలు నిజంగా అనకపోతే. నేను వీట నసలు మనసుకు పట్టించుకో నక్కరలేదు. నిజంగానే అంటే, నేనసలు ఇక్కడ ఉండవలసిన అవసరమే లేదు. మీ ప్రేమ స్వరూపం అర్థం చేసికో లేక పోతున్నందుకు క్షమించండి. కానీ. నా ఆరోగ్యం ఏమీ బాగుండలేదు. నాకు విశ్రాంతి కావాలి. అత్తగారు అన్ని విధాలా సహాయం చేస్తున్నా నేను స్వతంత్రంగా ఆమెను సహాయం కోరలేను. న్యాయంగా ఈ పరిస్థితిలో మీరేనన్ను ప్రోత్సాహ పరిచి పంపించ వలసిందిపోయి వెళ్ల వద్దని పంతం బట్టి కూర్చుంటే నేనేం చెయ్యాలి ? మీ మాటను నేనెప్పుడూ గౌరవిస్తాను. కానీ, మీ మాటకోసం ఈ పరిస్థితిలో నా ఆరోగ్యం నాశనం చేసుకునేటంత స్వార్థ త్యాగిని కాలేక పోయినందుకు మన్నించండి."

అక్కడ నిలబడకుండా వెళ్ళిపోయింది.

# 23

పుట్టింటికి వచ్చిన దుర్గకు రెండు మూడు రోజులవరకూ స్వర్గంలో ఉన్నట్లు అనిపించిది. కానీ, నాల్గవ రోజు నుంచీ, ఏమీ తోచలేదు. ఏదో దిగులూ, వెలితీ ఆమెను క్రమ్ముకుంటున్నాయి. గిరి తనకు కనబడకపోవటం, ఆ దిగులును, మరింత అధికం చేసింది. దగ్గిర—దగ్గిర ఎనిమిది నెల లవుతుంది గిరిని చూసి, ఇంతకాలం కనబడకుండా ఎన్నడూ లేదు. వంట్లో

కులాసాగా లేదా! ఎందుకో గిరి ప్రస్తావన తేగానే హరి అన్నయ్య మండి పడ్తున్నాడు. తల్లి నడుగుతే, తనకు తెలియు దంది. ఒకసారి తనే వెళ్ళి చూసివద్దామని బయల్దేరింది దుర్గ....అది గమనించి హరి "ఎక్కడకూ?" అన్నాడు.

దుర్గ అమాయకంగా, "గిరి దగ్గరకు అన్నయా! నాకు కనిపించి ఎనిమిది నెలలవుతూంది. ఎలా ఉన్నాడో చూసి వద్దామని" అంది.

"ఏం? బెంగ పెట్టుకున్నావా ?" కఠినంగా అన్నాడు హరి.

అతని స్వరంలోని కాఠిన్యానికి తెల్లబోయింది దుర్గ—

"అవును. నాకేం తోచటం లేదు. ఎనిమిది నెలల క్రిందట, నా దగ్గరకు వచ్చి తేజ్‌పూర్ వెడ్తున్నానని చెప్పాడు. అంతే మళ్ళీ కనబడలేదు."

"ఏమిటీ? గిరి తేజ్‌పూర్—వెళ్ళాడా ?!"

హరి గర్జించాడు. హరి ముఖంలో వ్యక్త మవుతున్న ద్వేషానికీ, కసికీ, దుర్గ వణికి పోయింది. ఆమెకు ఏమీ అర్థం కాలేదు. అన్న ముఖంలోకి చూస్తూ నిలుచుండి పోయింది.

"దుర్మార్గుడు...నీచుడు...నమ్మక ద్రోహి—నిలువెల్లా విషం. రోగ్...నా దగ్గిరా, వీడి ఆటలు ? స్నేహంలో ప్రాణం పెట్టినట్లే ద్వేషంలో ప్రాణం తీస్తానని తెలియదు...

నిజంగా హంతకుడిలాగే ఉన్నాడు హరి... దుర్గ భయంగా, "ఎవరిని గురించి అన్నయ్యా??" అది...

హరి విసురు దుర్గమీదకు తిరిగింది.

"ఎంతనంగనాచివితల్లీ అసలా వెధవని మళ్ళీమీ ఇంట్లో ఎందుకడుగు పెట్టనిచ్చావ్? నువ్వు వాడిని పెళ్ళి చేసుకోనందుకు చాలా సంతోషిస్తున్నాను—కానీ, కానీ, ఈ చనువెందుకూ? వాడు...వాడు స్వార్థపరుడు—నీ సంసారంలో కలతలు రేపి నీ మనసుని బలహీనం చేసి, నిన్ను లొంగదీసుకోవాలని చూస్తున్నాడు. ఇక్కడ ఉమ దగ్గిర ప్లాన్ వేస్తున్నాడు. ఇప్పుడర్థ మవుతూంది. వాడి కౌటిల్యమంతా... ఛండాలుడు! వాడి మూలంగానే, నా ఉమ నాకు కాకుండా పోయింది. ఇది కాకుండా తేజ్‌పూర్ కూడా వెళ్ళొచ్చాడు. మనందరి జీవితాలూ నాశనం చేస్తేనే కాని, ఈ రాక్షసుడికి నిద్ర పట్టదులా ఉంది. తీయని చిరునవ్వుతో మెత్తని మాటలతో ఒక్కొక్కళ్ళనీ బుట్టలో వేసుకుని అందరి గొంతుకలూ కోస్తున్నాడు"

దుర్గ చెవులు మూసుకుంది. ఆందోళనతో ఆమె స్వరం కంపించింది "కాదు! అన్నయ్యా! నువ్వు పొరపడుతున్నావ్! గిరి...."

"పటప్!" దుర్గ మాటలు పూర్తికాకుండానే విరుచుకు పడ్డాడు హరి.

"అతని మీద నీకు పెరిగిన వ్యామోహంతో నువ్వు సరిగా ఆలోచించ లేక పోతున్నావు. నాకు సరిగ్గా పదెనిమిది నెలల క్రిందట, ఉమ దగ్గిర నుండి ఒక ఉత్తరం వచ్చింది. తనకు నన్ను వివాహం చేసికోవటానికి ఏమీ అభ్యంతరం లేదనీ, కాని

తన ఉద్యోగానికి మాత్రం ఈ వివాహం ఆటంకం కాకూడదనీ వ్రాసింది, నాకేం తెలుసు. ఇదంతా ఈ వెధవ పన్నాగమని? నా మీద ప్రేమ తోనే, ఉమ ఇలా వ్రాసిందనుకుని "నీ ఉద్యోగం వల్ల మన ఇద్దరికీ సుఖంలేదు. నువ్వక్కడ తేజ్‌పూర్ లోనే ఉండ దల్చుకుంటే, మనం పెళ్ళిచేసుకునీ ప్రయోజనం లేదు...కావాలంటే, ఇక్కడే ఉద్యోగం చేయవచ్చు" అని సమాధానం వ్రాశాను. మళ్ళీ ఉమ దగ్గర నుండి ఉత్తరమే లేదు—నా మీద అభిమానంతో మొదటి ఉత్తరం వ్రాస్తేకదా, మళ్ళీ సమాధానం వ్రాయటానికి? ఈ దరిద్రుడు అక్కడకు వెళ్ళి చెప్పిన ఉపాయం ఇది– నా సమాధానం ఎలాగో ఇలా ఉంటుందని వాడికి తెలుసు—నా నోటితోనే కాదనిపించుకుని ఉమను స్వాధీనం చేసుకోవాలని వాడి ఎత్తు. ఛీ! ఇట్లాంటి నీచుడిని, చిన్న తనం నుంచీ, ప్రాణస్నేహితుడుగా చూసాను. వీడి కోసం ఏం చెయ్యమన్నా సంతోషంగా భావించాను. నా దురదృష్ట దేవత వీడిరూపంలో నా నెత్తిమీద ఉందని తెలిసుకోలేక పోయాను."

దుర్గ ఏమీ మాట్లాడలేక పోయింది. ఆమె అంతరాత్మ గిరి ఉత్తముడని గోల పెడ్తూంది. కానీ, చికాకులతో కలత పొంది, తన ప్రణయ వైఫల్యానికి క్షోభించే హరికి, అసలు విషయం ఎలా అర్థమవుతుంది?

"దుర్గా! సీరియస్‌గా చెపుతున్నాను. ఇక మీదట నువ్వా గిరిపేరు ఎత్తినా, వాడిని కలసు కోటానికి ప్రయ త్నించినా, నీకూ, నాకూ, ఏం సంబంధ ముండదు. అన్నగా నా మీద నీకే మాత్రమైనా గౌరవముంటే, ఆ గిరిని పూర్తిగా

మర్చిపో! నా కోపం కొద్దీ చెప్పటం లేదు. నీ మేలుకోరి చెపు తున్నాను."

దుర్గ లోపలకు పోయి, సోఫాలో కూల బడింది. క్షోభతో ఆమె హృదయం కుమిలి పోయిది—తన అశాంతిని భరించలేక ఇక్కడకు వస్తే, ఇక్కడ ఇది !...

"శంకర్" పై పైకి కసికొద్దీ, ఏదో తనను గురించి అవమానకరంగా మాట్లాడినా, అతని అంతరంగంలో తన మీద ఏ అవిశ్వాసమూ లేదు. గిరికి, తనకూ మధ్య గల అనుబంధం విషయంలో అతడేనాడూ అసహనాన్ని చూపించలేదు.

అన్నయ్య రెండాకు లెక్కువ చదువుకొన్నాడు. తనను నిజంగానే అనుమానిస్తున్నాడు. చిన్నతనంనుంచీ తమ ముగ్గురి నడుమ, పెంపొందిన ఆత్మీయత క్షణంలో మరిచిపోయాడు. మొదటి నుంచి, గిరి తన నెంతగా అభిమానించేవాడో తెలిసీ, ఈ నాడు గిరిని గురించి తేలికగా మాట్లాడ గలిగాడు. ఏం మనుష్యులూ? ఎందుకింత త్వరగా అపార్థాలు పెంచు కొంటారు?

"ఏం ఆడజన్మ? తానొక మగవాడై వుంటే, హరి అన్నయ్య తననిలా నిర్బంధించ గలిగేవాడా? స్వార్థ పరులైన మొగవాళ్ళతో నిండిన, ఈ సభ్య సమాజంలో, ఆడదానిగా జన్మించటం కంటే. సభ్యత అనే మాటకు అర్థం తెలియని ఆటవిక జాతుల్లో జన్మించటం వేయిరెట్లు నయం."

# 24

ఆ ఉత్తరం చదువుతూనే తల తిరిగి క్రింద పడిపోయింది దుర్గ.
సావిత్రమ్మ ఆవేదన కంతులేదు. ఎంతో అపురూపంగా పెరిగిన దుర్గ దెబ్బ మీద దెబ్బ, సహించవలసి రావడం ఆ మాతృ హృదయం భరించలేక పోతూంది. హరి గాభరా చెప్ప నక్కర లేదు. ఆందోళనతో అతని మనసు పని చెయ్యటమే మానుకొంది. చికాకుగా అటూ, ఇటూ తిరుగుతూ, తల్లి మీద విసుక్కొన్నాడు.

"వూరికే అలా, పడుస్తూ కూర్చుంటే ఏమవుతుందీ? కొంచెం కాఫీ పెట్టు, లోపలకు వెళ్ళి—నేను దుర్గను మంచం మీద పడుకోబెడ్తాను." అన్నాడు. సావిత్రమ్మ కంగారుగా వంట గదిలోకి వెళ్ళింది. హరి దుర్గ ముఖంమీద కొంచెం నీళ్ళు చల్లి, రుమాలతో ముఖం తుడిచాడు. దుర్గ కళ్ళు కొంచెం తెరిచి, వెంటనే నీరసంగా రెప్పలు వాల్చింది.—హరి ఆమెను లేవదీసి మంచం మీద పడుకోబెట్టాడు.

ఆ ఉత్తరం కామేశ్వరమ్మ వ్రాయించింది. శంకర్ కు ముందు కొంచెం జ్వరం తగిలి, అది క్రమంగా మశూచికంలోకి దింపిందని—తల్లి అందించిన కాఫీ త్రాగి దుర్గ "అమ్మా నా సామానులన్నీ, సర్ది పెట్టావా? అంది నీరసంగా.

హరీ, సావిత్రమ్మాకూడా గతుక్కుమన్నారు.

"అంటే?" అన్నాడు హరి తీక్షణంగా.

"తొమ్మిది నెలలూ కూడా నిండాయి. నువ్వక్కడికి ఎలా వెళ్తావమ్మా" అంది సావిత్రమ్మ ప్రాధేయ పూర్వకంగా!

దుర్గ దృఢంగా, "కాదమ్మా! వెళ్ళాలి." అంది.

హరి కోపంగా "బొత్తిగా జ్ఞానం లేకుండా మాట్లాడతావేం? ఇవ్వాళో, రేపో ప్రసవించే సమయంలో, రైలు ప్రయాణం చేసి అక్కడకు వెళ్తావా? వెళ్ళి మాత్రం నువ్వేం చేయగలవు? అన్నాడు.

దుర్గకు ఎక్కడలేని ఆవేశమూ వచ్చింది.

"వెళ్తాను! వెళ్తాను! అక్కడకు వెళ్ళి ఏం చెయ్యలేక పోయినాసరే! దారిలో చచ్చినా సరే! నువ్వు నేను నీ చెల్లెల్ని కాదనుకున్నాసరే! నన్నాయన రానీయక పోయినా సరే! నేనక్కడికి వెళ్ళి పోతాను! నన్నెవ్వరూ ఆపలేరు."

ఎర్రబారిన కళ్ళతో తడబడే—అడుగులతో దుర్గ తానే తన పెట్టె దగ్గరకు వెళ్ళింది. సావిత్రమ్మ అడ్డుతగిలి, "నువ్వుండు నేను సర్దుతాను, నన్నుకూడా రమ్మంటావా? నిన్నొక్కదాన్ని పంపడానికి భయంగా ఉంది." అంది.

"అంత కంటేనా అమ్మా! హరి అన్నయ్య ఏమైనా అంటాడేమోనని కాని."

"ఇట్లాంటి సమయంలో ఏమంటాడూ?" అని ఆవిడ హరి వంక చూసింది...హరి మాట్లాడకుండా అక్కడ నుంచి వెళ్ళిపోయాడు.

వెకివెక్కి ఏడుస్తూ, తన గుండెలమీద వాలిపోయిన దుర్గను ఆప్యాయంగా నిమిరాడు శంకర్. అతనికి దృఢంగా తెలుసు—తన అస్వస్థత గురించి వింటే, మరణశయ్య మీద ఉన్నాసరే, దుర్గ లేచి వస్తుందని—

"మీకు నిజంగానే నామీద ఇంత కోపం వచ్చిందా? ఇన్ని రోజుల వరకూ, నాకెందుకు తెలియ పరచ లేదూ?" అంది దుర్గ బాధగా.

"ఇలా ముంచుకు వస్తుందని నేనూ అనుకోలేదు దుర్గా! మామూలు జ్వరమనుకున్నాను."

శంకర్ బాధగా మూలిగాడు. దుర్గ అతని బాధ చూసి సహించలేక పోయింది. నున్నని అతని శరీరంనిండా పెద్ద పెద్ద పొక్కులు సందులేకుండా వ్యాపించి ఉన్నాయి. జ్వరంతో వళ్ళు పేలిపోతూంది.

దుర్గ భయంతో వణికింది. తన ప్రవర్తనలో ఏమైనా, లోపం ఉందా? అకారణంగా భగవంతుడు తననిలా శిక్షింప దలచుకొన్నాడా? దుర్గ ఆర్తయై భగవంతుడిని మనసులోనే ప్రార్థించుకొంది. "నాకెంతటి ఘోర శిక్షలనైనా ఇయ్యి—ఎంతటి వేదననైనా కలుగజెయ్యి—కానీ, నా మాంగల్యాన్ని మాత్రం నాకు దూరంచేయకు. ఇందుకు ప్రతిఫలంగా నా దగ్గరనుండి ఏమైనా తీసికో! నన్నే తీసికొనిపో!"

దుర్గకు శంకర్ అస్వస్థత తప్ప ఇంకోటేమీ మనసులో లేదు. బాధగా మూలిగే అతని కంఠస్వరం తప్ప ఇంకేమీ విని పించడంలేదు. తాను నిండు మనిషినన్న మాటే మర్చి

పోయింది. తనకు కష్టమే కలుగుతుందో. సుఖమే కలుగుతుందో ఆమెకు తెలియటంలేదు. అందరూ కాసేపు నిద్రపోవటానికి కనులు మూయగానే, శంకర్ బాధతో మూలిగినట్లయి, వెంటనే లేచి శంకర్ దగ్గిర కూర్చునేది.

దుర్గ తపన, శ్రమ ఫలించాయి. మశూచికం తిరుగు ముఖం పట్టింది. శంకర్ మృత్యువు నోటినుంచి బయట పడ్డాడు—అందరూ "హమ్మయ్యా" అనుకున్నారు.

సరిగా నిద్రపోకుండా తన దగ్గిర కూర్చున్న దుర్గను చూసి శంకర్ "నాకు తగ్గింది కదా! నువ్వు విశ్రాంతి తీసికో? కాసేపు నిద్రపో" అన్నాడు—

"ఫరవాలేదు." అంది దుర్గ సంతృప్తిగా నిట్టూరుస్తూ.

"ఎందుకు ఫరవాలేదు? నువ్వు శ్రమపడితే పడ్డావు కానీ, నా పాపను శ్రమ పెడితే ఊరుకోను."

దుర్గ హృదయం పులకించింది. ఇది చాలు—ధనమక్కర లేదు. హోదా ఎక్కరలేదు. ఏమీ అక్కరలేదు. ఈ మాత్రపు ఆప్యాయత చాలు—

శంకర్‌ను మశూచి విడిచి పెట్టినా వాటి ఛాయలు మాత్రం శంకర్ ముఖంమీద నిలిచిపోయాయి. అతడు కృంగి పోయాడు.

"దుర్గా నేనెంతో వికారంగా ఉన్నాను కదూ?" అన్నాడు.

ఆ దీన స్వరానికి దుర్గ కడుపు తరుక్కు పోయింది. శంకర్ అతిశయానికంతకూ, మూలమైన అతని రూపం దెబ్బ తింది. ఈ దెబ్బకు శంకర్ తట్టుకోగలడా ?

"ఏం లేదు. ఏవో రెండు మచ్చలు ముఖం మీద వుంటే మాత్రమేం ? మీ కళ్ళలోని తేజస్సు ఎక్కడకు పోతుంది? నాకిదివరకటికీ, ఇప్పటికీ ఏం తేడా కనుపించడం లేదు. ఇప్పుడే, ఇంకా ఆకర్షణీయంగా ఉన్నారు. ఇంకా మనం అదృష్టవంతులం. ఏ, కన్నో, కాలో పోకుండా ఇలా బయట పడ్డాం."

ఈ సమాధానంతో శంకర్ కు కొంత స్వాంతన కలిగింది. "నేను నిజంగా వికారంగా ఉంటే, నన్ను ఇదివరకులా ప్రేమించ గలవా ?" శంకర్ మళ్ళీ అడిగాడు. ఈ ప్రశ్న దుర్గ మనసుకు కొంచెం కష్టం కలిగించింది.

"అంటే నేను మీ రూపాన్ని చూసి మిమ్మల్ని ప్రేమిస్తున్నాననా ?"

ఇది పూర్తిగా అబద్ధం కాకపోయినా, పూర్తిగా నిజం కూడా కాదు. సృష్టి కర్త మానవులకు ప్రసాదించే అపురూప మైన వరాలలో రూపం ఒకటి అని ఒప్పుకొంటాను. స్త్రీ పురుషుల పరస్పరాకర్షణలో దీనికి ప్రధానమైన స్థానం ఉన్న విషయం కూడా యదార్థమే ! కానీ, మనం ఒకరిని ప్రేమించ గలిగినప్పుడు వాళ్ళు అందంగా ఉన్నా, లేకపోయినా, మంచి వాళ్ళయినా, చెడ్డ వాళ్లయినా, మనసు అభిమానించినా, ద్వేషించినా, మన ప్రేమ నాశనం కాదు. అందరి విషయమూ ఏమో, నా అనుభూతిలోకి వచ్చేది మాత్రం ఇదే !"

శంకర్ దుర్గ చేతిని ఆప్యాయంగా నొక్కి "నా అదృష్టాన్ని చాలా ఆలస్యంగా గమనిస్తున్నాను దుర్గా!" అన్నాడు.

దుర్గ సంతృప్తిగా నిట్టూర్చింది.

•

# 25

దుర్గ మొగ పిల్లవాడిని ప్రసవించింది. శంకర్ స్వయంగా గిరికీ, ఉమకూ, హరికీ, టెలిగ్రాంలు ఇచ్చాడు. గిరి, ఉమా, శుభాకాంతులను టెలిగ్రాంద్వారా తెలియ పర్చారు. హరి తనే వచ్చాడు. జానకి ఈ వార్త తెలియగానే, వెంటనే వచ్చి హాస్పిటల్‌లో ఉన్న దుర్గనూ, పండులాంటి పసివాడినీ చూసి నవ్వుతూ. "ఆ రోజుల్లో ఒక పతివ్రత తన భర్త సౌఖ్యం కోసం సూర్యుణ్ణి ఆపుచేసిందట! ఈ నాడు మా దుర్గ సృష్టికి వాయిదా వేసింది. ఇంచుమించు పదకొండు నెలలు మోసావు—ఇంత నీరసంగా కన్నావేం?" అంది.

దుర్గ నీరసంగా నవ్వింది. "ఈ మాత్రం ఉంటేనే గండమయింది. ఇంకా ఉంటే అడగాలా? అంది.

జానకి తాను తెచ్చిన లాగూ, చొక్కా పిల్లవాడి దగ్గర పెట్టి కాస్సేపు కూర్చుని వెళ్ళి పోతుంటే, గేటు దగ్గర హరి ఎదురయ్యాడు. తనను చూచి నవ్విన హరికి, సమాధానంగా తనూ నవ్వి "మీ రొక్కరే వస్తున్నారేం?" అంది.

"అదేం ప్రశ్న? నేనింకా పెళ్ళి చేసుకోలేదు."

"అది తెలుసు, నేను గిరిని గురించి అడుగుతున్నాను. దుర్గ ప్రసవించిందనే వార్త తెలిసీ ఆయన రాకుండా ఎలా ఉండ గలిగారూ ?"

హరి ముఖం గంభీరంగా మారి పోయింది,

"మీరు కూడా దుర్గ విషయంలో ఇలా అవమాన కరంగా మాట్లాడుతారని అనుకోలేదు."

జానకి తెల్ల బోయింది.

"అవమానకరం ఏమిటి?"

"మీకంతా తెలిసే, ఇలా మాట్లాడటంలో అర్థమేమిటి మరి ?"

"ఏమిటి అంతా తెలియటం ?"

"మీరు అమాయకత్వంగా నటించ నక్కర్లేదు. ప్రసాద్ నాకంతా చెప్పాడు."

ఇప్పటికి జానకికి విషయం అర్థమైంది. గిరి ఈ మధ్య అసలు కనుపించక పోవటానికి కూడా కారణం తెలిసింది.

"హరి గారూ! మీరు కాస్త సావకాశం చూసుకొని ఒకసారి మాయింటికి రండి. మీతో చాలా విషయాలు మాట్లాడాలి:"

హరి, ఆశ్చర్యంగా చూశాడు.

"దయచేసి తప్పకుండా రండి—న్నేను మీకంతా తెలుసను కొంటున్నాను. ఏమీ తెలియదని ఇవాళ తెలిసింది."

హరికి కుతూహలం కలిగింది. "ఏమిటో?" అన్నాడు,

"ఇక్కడ కాదు. స్థలమూ, సమయమూ కూడా అను వైనవికావు మాట్లాడ టానికి—మా యింటికిరండి-మరచిపో వద్దు. అశ్రద్ధ చేయవద్దు."

అని జానకి వెళ్ళి పోయింది—

హరి లోపలకు వెళ్ళి దుర్గను పలుకరించి అల్లుడిని ముద్దు పెట్టుకున్నాడు.

గిరిని గూర్చి అడగాలని నాలుక చివరి వరకూ వచ్చినా అణచుకొంది దుర్గ—

"గేటుదగ్గర జానకి కనుపించింది." అన్నాడు హరి.

"అవును, ఇప్పుడే నాదగ్గిర నుంచి వెళ్ళింది."

"ఎందుకో, వాళ్ళింటికి రమ్మని మరీ మరీ చెప్పింది. నాతో చాలా మాట్లాడాలట!"

దుర్గకు కొంచెం ఆశ్చర్యం కలిగింది. బహుశః ఉమ విషయం కావచ్చుననిపించింది. అయినా, తానేమీ, మాట్లాడక వూరుకుంది.

హరి వెళ్ళిపోయాక శంకర్ వచ్చాడు.

"దుర్గా! నేను గిరి దగ్గరకు వెడుతున్నాను." అన్నాడు

దుర్గ మనసు ఆనందంతో పొంగి పోయింది.

"నీకు కష్టం కలిగించ వద్దని ఎన్ని విధాలుగానో నచ్చ చెప్పాడు గిరి నాకు. నేను కూడా అతని మాటలు పాటించా

లనే అనుకొన్నాను. కానీ ఎందుకనో అంతా అలా అయి పోయింది. బహుశః ఈ కారణంవల్ల గిరికి, నామీద కోపం వచ్చి వుండవచ్చు—నేనే వెళ్ళి బ్రతిమాలి తీసికొనివస్తాను. గిరి రాకపోతే, ఈ సంతోషమంతా సంతోషంలాగే లేదు నాకు."

దుర్గ తన కళ్ళతోనే సంతోషమూ. అంగీకారమూ, కృతజ్ఞతా, తెలియ పరచుకొంది.

శంకర్ పొత్తిళ్ళలో పసివాడిని చేతులలోకి తీసికొని వెంటనే భయంగా పడుకో పెట్టేశాడు. దుర్గ హాయిగానవ్వింది రైలుకు టైమవుతోందని శంకర్ వెళ్ళిపోయాడు.

తన ఇంటికి వచ్చిన హరిని సాదరంగా ఆహ్వానించింది జానకి—ఒక ప్లేటులో బిస్కట్లూ ఏపిల్ ముక్కలూ, అరటి పళ్ళూ పెట్టి మంచినీళ్ళు, కాఫీ కప్పూ దగ్గిర పెట్టింది.

హరి మొహమాటంగా "ఇప్పుడిదంతా ఎందుకూ ? మీరేదో మాట్లాడతానంటే వచ్చాను." అన్నాడు.

జానకి నవ్వింది. "ఇప్పుడు మాత్రం మాట్లాడ నన్నానా? తింటూ మాట్లాడు కోవచ్చు."

హరి ఇంక వాదించక, సంగతేమిటన్నట్లు చూశాడు.

"ప్రసాద్ అన్నయ్య మీతో ఏం చెప్పాడు ?

"మీరు చెప్పిందే చెప్పాడు."

"నే నసలు, ఏం చెప్పలేదు. అన్నయ్యే, నాతో ఏదో చెప్పబోతుంటే, నేను చెప్పనియ్యలేదు. నాకు చెప్పబోయింది బహుశః, మీకు చెప్పి ఉంటాడు."

హరి ఆశ్చర్యంగా "ప్రసాద్, కంత అవసర మే మొచ్చింది ?" అన్నాడు.

"అవసరం ఏం లేదు, ఉడుకుమోతుతనం-ఒక రకం తిక్క. తమ తిక్క వల్ల ఎదుటి వాళ్ళకు అవస్థ కలుగుతుందని గుర్తించలేని తెలివి తక్కువా-కాకపోతే మూర్ఖత్వం, మీ బావగారి సంగతి మీకు తెలుసుగా! ఆయనకు దుర్గ మొగ వాళ్ళతో మాట్లాడటం ఇష్టం ఉండదు. అందుకని దుర్గ అన్నయ్యను తమ ఇంటికి రావద్దని చెప్పింది. తోటి స్నేహితు డైన గిరి, అంత ఆత్మీయంగా చూడ బడటమూ, తనను ఇంటికి రావద్దనటమూ ప్రసాద్ మనసులో ఈర్ష్యను కలిగించి ఉండాలి. అందుకనే మీతో అలా మాట్లాడాడు!"

"మరి చుట్టు ప్రక్కల వాళ్ళంతా అనుకుంటున్నారట శంకర్ ఇంట్లో ఉండని సమయంలోనే, గిరి వస్తాడట!"

"చుట్టు ప్రక్కల వాళ్ళు అనుకునేటంత వెర్రిగా గిరి కానీ, దుర్గకానీ, ఏనాడూ ప్రవర్తించలేదు—సరే! ఇప్పుడ మీరు మా ఇంటికి వచ్చారు. మా ఆయన ఇంట్లో లేరు. అంటే మీరు........"

నవ్వుతూ ఆగిపోయింది జానకి.

హరి ముఖం ఎఱ్ఱబడగా "ఛ" అన్నాడు.

"దుర్గ విషయమూ అంతే! హరిగారూ! అయినా మీరీ విషయాన్ని ఇంతగా సాగతీస్తున్నారు. మీకు మొదట

నుంచీ అన్ని విషయాలు తెలియవు కాబోలు! తెలిస్తే ప్రసాద్ కాదు. బ్రహ్మ చెప్పినా, దుర్గా, గిరిలను గూర్చి మరొకలా భావించే వారుకాదు."

"మీరు తెగ పూరిస్తున్నారు. అసలు విషయం చెప్పకుండా." విసుగ్గా అన్నాడు హరి.

"శాంతించండి! దుర్గ మొదట్లో తాను గిరిని ప్రేమించానుకునేదట—కానీ, గిరి, ఆమె మనసులో ఉన్నది వాత్సల్యంకాని ప్రేమకాదని తాను కూడా ఆమెను చెల్లెలిగాగ అభిమానిస్తాననీ నచ్చజెప్పి, తానే ప్రోత్సాహ పరచి శంకర్‌తో వివాహం జరిపించాడట! ఇక శంకర్‌కుకానీ, దుర్గకు కానీ, గిరి పట్ల వేరే భావమెందుకు వస్తుంది! అదీకాక శంకర్‌కు మొదటినుంచీ, గిరి అండగా నిలబడి అతనిని ఆదుకున్నాడు. గిరిపట్ల శంకర్‌కు ఎంతో గౌరవం—ప్రపంచంలో ఎవ్వరినీ గౌరవించని శంకర్ గిరిని గౌరవిస్తాడు. ఎవ్వరినీ విశ్వసించని వాడు, గిరిని మనసారా విశ్వసిస్తాడు. అతనిమాట వేదమనుకుంటాడు. అట్లాంటి గిరికీ, సాధారణ స్నేహితులైన ప్రసాద్‌కు పోలిక ఏమిటి?"

"మీకీ సంగతులన్నీ ఎలా తెలుసూ? దుర్గ చెప్పిందా? నాతో చెప్పలేదేం"?

"మీకు చెప్పటానికి మొహమాట పడి ఉండవచ్చు. నాకీ సంగతులన్నీ దుర్గ చెప్పింది. ఉమ ఉత్తరాల వల్ల కూడా తెలిసాయి."

"ఉమా మీకు ఉత్తరాలుకూడా వ్రాస్తుందా?" ఆశ్చర్యంగా అడిగాడు హరి.

"అప్పను నేనూ, దుర్గా, ఉమా చిన్నతనంలో విడిపోయాం. ఉమ మళ్ళీ నాకు కాలేజీలో కలిసింది. పి.యు.సి. తో మానేసి నేను పెళ్ళి చేసుకున్నాను. ఉమ మెడిసిన్‌లో చేరింది. ఆ ఒక్క సంవత్సరంలోనే మేమెంతో ఆత్మీయుల మయ్యాం. మేం విడిపోయిన దగ్గర్నుంచీ, ఎప్పుడూ ఉత్తరాలు వ్రాసుకొంటూనే ఉన్నాం. ఈ సంగతి దుర్గకు కూడా తెలుసు."

"అయితే ఉమ మెడిసిన్ చదవటానికి కారణం తెలుసా?" సందేహంగా అడిగాడు హరి.

"తెలుసు. ఇంకాచాలా తెలుసు. మీకే, ఏమీ తెలియదు నేను మీకు ఉమ ఉత్తరాలిస్తాను. చదువుకోండి. మీకే తెలుస్తుంది. నేను గిరిని మంచివాడుగా నిరూపించటానికి ఈ ప్రయత్నంచెయ్యటం లేదు. మీకు అసలు విషయం తెలియక ముసుగులో గుద్దులాట అనుభవిస్తున్నారు. ఉన్నది ఉన్నట్లు తెలుసకొన్నాక మీ ఇష్టం వచ్చినట్లు విచారించండి."

జానకి తన బీరువా తెరిచి ఒక పెద్ద ఉత్తరాల గుట్ట బయటకు తీసింది. అది చూసి హడలి పోయాడు హరి. అది గమనించి జానకి నవ్వుతూ "బెదిరి పోకండి. ఇవన్నీ ఇవ్వను మీకు అవసరమైనవే ఇస్తాను." అంది.

కొంచెం సేపు ఆ ఉత్తరాలన్నీ వెతికి, కొన్ని హరి హాకందించింది జానకి—హరి వాటిని జేబులో పెట్టుకొని, జానకి "థాంక్స్" చెప్పి బయటకు నడిచాడు.

# 26

హైదరాబాదు.
4—7—1956

డియర్ జానీ !

నా వివాహ శుభలేఖకోసం ఎదురుచూసే నీకు నా ఉత్తరం ఆశ్చర్యం కలిగించ వచ్చు. నీకేమిటి? నాకే అంతా తమాషాగా ఉంది. మన దుర్గ నా వొడిలో తలపెట్టి ఏడ్చింది, తాను గిరిని ప్రేమించానని, కానీ అతను తిరస్కరించాడనీ చెప్పింది. దుర్గను సంతోష పెట్టటానికి దుర్గ తరఫున లేని చనువు తీసికొని గిరితో మాటలు పెంచుకున్నాను. గిరి ఎవరని ఆశ్చర్యపడతావు కదూ! మా బావకు ఆత్మీయుడైన స్నేహితుడులే! అతనితో మాట్లాడిన క్షణంనుంచీ నాలో విచిత్రమైన మార్పు కలిగింది. నాకు తెలియకుండానే అతని ఆకర్షణకు లొంగిపోయాను. మా బావమీద నాకున్నది కేవలం వాత్సల్యమనీ, ప్రేమకాదనీ అనిపించ సాగింది. క్రమంగా ఆ భావన నాలో బలపడింది. బావను పెళ్ళి చేసికోలేక పోయాను. చేసికోనని చెప్పలేక పోయాను. అందుకే కాస్త ఊపిరి పీల్చుకొందామని మెడిసన్‌లో చేరాను.

ఏమంటావూ ? నాది చంచలమైన మనసని తిడ్తావా ? నిజమేనేమో ?

తొందరగా సమాధానం వ్రాయవూ ? నీ పెళ్ళి విశేషాలన్నీ వ్రాయి.

నీ
ఉమ

హైదరాబాదు.
6—9.—1959

డియర్ జానీ!

దుర్గ వివాహం జరిగింది. పెళ్ళికొడుకు చాలా బాగుం టాడు. చదువుకో లేదు. వ్యాపారంలో నిపుణుడు. గిరి ప్రోత్సాహమే ఈ వివాహానికి కారణమంది దుర్గ.

ఇన్నాళ్ళుగా ఊగిస లాడిన నా మనసు ఒక నిశ్చయా నికి వచ్చేసింది. బావను, బావగా అభిమానించ గలనేకాని, భర్తగా ఆరాధించలేను. నా మనసులో గిరి తిష్ట వేసుకు కూర్చున్నాడు. గెంటినా పోవటం లేదు.

నేను ఎంత కలివిడిగా ఉందామని ప్రయత్నించినా, నాతో చాలా ముభావంగా ఉంటున్నాడు గిరి. మునుపున్న కొద్దిపాటి స్నేహం కూడా లేకుండా పోయింది. బహుశః నేనంటే అతనికీ ఇష్టంలేక పోయి ఉండవచ్చు. అయినా అతనిని ఆరాధించ లేకుండా ఉండలేను జానీ! నా ఆరాధన అతడు స్వీకరింపకపోనీ, అతనిని నా మనసులో ధ్యానించుకొంటేనే చాలు, నాకు ఎక్కడలేని తృప్తి కలుగుతుంది.

బావ సంగతి తల్చుకొంటే నాకెంతో వ్యధ కలుగు తుంది. వ్యంగ్యంగా ఎన్నిసార్లు నా అభిప్రాయం వ్యక్తపరిచినా అర్థం చేసికోడు—మా బావది ఎట్లాంటి ఆవేశమో, ఉద్రిక్త స్వభావమో నీకు తెలుసుగా. తన గోలేమో తనదితప్ప ఇంకేమీ ఆలోచించడు. అయినా పాపం తనతప్పేముంది? చిన్నతనం నుంచీ, నన్ను తన దానినిగా భావించాడు. ఎక్కు-

వగా ఈ విషయాల్ని గురించి ఆలోచించని నేనుకూడా మొన్నటివరకూ, అతని భావనకు ప్రోత్సాహ మిచ్చాను నా నోటితో బావకు అసలు విషయం ఎలా చెప్పగలనూ? బావనూ భగవంతుడినీ, ఈ దోషం క్షమించమని ప్రార్థించటం కంటే నేను చెయ్యగలిగిందేముంది?

అల్ల కల్లోలంగా ఉన్న నా మనసుని, నీ ఉత్తరాలు కొంత ఓదారుస్తున్నాయి. తిరుగు టపాలో జవాబు వ్రాయాలి మరి?

నీ

ఉమ

హైదరాబాదు

27—10—61

డియర్ జానీ!

నీ ఉత్తరం ఈ సారి నాకెంత ఆశాబంగం కలిగించిందో చెప్పలేను. అన్నీ విషాద వార్తలు వ్రాశావేం? పుర్గ సంసారంలో కలతలా? మీ వారికి గుండెజబ్బా?! అబ్బా! పరిపూర్ణతను ప్రసాదిస్తే మనం తనను మర్చిపోతామని కాబోలు—ఏ ఒక్కరికీ పరిపూర్ణమైన ఆనందాన్ని ప్రసాదించడు భగవంతుడు.

నేను గిరికి ఎన్ని ఉత్తరాలు వ్రాసినా సమాధానం వ్రాయలేదు. మొదట్లో పొడిగా, ఒకటి, రెండు వాక్యాలతో సమాధానమిచ్చాడు. కానీ, తరువాత అది కూడ లేదు. దురదృష్ట వంతురాలిని జానీ! అతనిహృదయంలో నాకు స్థానంలేదు. ఈ ఆవేదన నేను భరించలేను. బావతో ఉన్న విషయం

ఉన్నట్లు చెప్పేస్తాను. పోనీ అతడైనా తన కనుకూలమైన యువతిని వివాహమాడి సుఖ పడ్తాడు.

మీ వారికీ, మీ అన్నయ్యకు నా నమస్కారాలందజేయి. ఉంటా !

నీ

ఉమ

తేజ్‌పూర్

27—9—61

డియర్ జానీ !

మన దేశాన్నంతనీ అట్టుడికిన్నట్టుడికించిన ఈ యుద్ధం నా జీవితానికి వరమయింది. ఏ దారీ, తెన్నూ కానక కొట్టుకుంటూన్న నాకు చక్కని మార్గం చూపించింది. ఇక్కడకు వచ్చేస్తాను, పాపం బావ ఎంత బాధపడ్డాడను కొన్నావే; దుర్మార్గురాలిని. అతనికంత ఆవేదన కలిగించిన నేను ఎంతటి శిక్షకయినా అర్హురాలిని. కానీ ఏం చెయ్యను.? అశక్తురాలిని. ఇక నా తల్లిదండ్రుల ఆవేదన వర్ణింపటానికి మాటలు దొరకటంలేదు. బావ దుఃఖాన్నంతటనీ మరిపింపగల స్త్రీ ఎవరైనా. అతని జీవితంలోనికి తొందరగా వస్తే బాగుండును.

విచిత్రం గిరి కూడా ఎంతో బాధపడ్డాడు. నేనంటే కనీసం స్నేహ భావమైనా లేని పెద్ద పెద్దమనిషి. అంత బాధపడట మెందుకు? బహుశా తన మిత్రుడు హరి కోసమై ఉంటుంది. వాళ్ళ స్నేహం ఎంత గాఢమైన దను కొన్నావూ ! అట్లాంటి స్నేహం పొంద గలగటంకూడా అదృష్టమే !

ఇక్కడ జీవితం నాకు బాగుంది. ఇక్కడ వాతావరణమే తమాషాగా ఉంది. ఎనిమిదయినా సరిగ్గా తెల్లవారదు. నాల్గింటికే చీకటి పడుతుంది. ఎటు చూసినా కొండలూ, గుట్టలు, జనులందరూ మంచి దృఢకాయులూ, కష్టజీవులు, సరదాలకు అవకాశం చాలా తక్కువ. కానీ, ప్రతిదీ చాలా ఖరీదుగా ఉంటుంది. మొన్న ఒక తువ్వాలు ఏకంగా పదిహేను రూపాయలు చెప్పాడు. నేను ఆశ్చర్యంగా చూస్తే "ఇండియాలో తయారైంది మేడం!" అన్నాడు, గొప్పగా—నా కెంతో నవ్వు వచ్చింది. ఈ యుద్ధం గొడవలు లేక మునుపు వీళ్లంతా ప్రశాంతంగా జీవించే వారనుకొంటా! కాని, ఇప్పుడందరూ గుప్పిట్లో ప్రాణాలు పెట్టుకొని ఉన్నారు. అయినా మంచి ధైర్యవంతులు. స్త్రీ, పురుష. బాల. వృద్ధ బేధం లేకుండా అందరూ సైనిక శిక్షణ పొందుతున్నారు. సైరన్ మ్రోత వినంగానే ఏ పని చేస్తున్న వాళ్లం ఆ పని వదిలేసి క్రింద పడుకోవటం చాలా తమాషాగా ఉంటుంది. నిజంగా శత్రు సైనికులు రాకపోయినా శిక్షణ కోసం ఇలా జరుగుతుంది.

రామకృష్ణ పరమహంస నీతి కథల్లో ఒక కథ గుర్తుందా? ఒక దొంగ తనను పట్ట వచ్చిన వారినుండి తప్పించుకోవటానికి సన్యాసి వేషం వేసికొంటాడు. కానీ, ఆ వేషంలోని ఉదాత్తత, అతనిని నిజంగా సన్యాసిని చేస్తుంది. నా విషయమూ సరిగ్గా అట్లాగేఉంది. మొదట్లో నా నిరాశను భరించ లేక, ఇక్కడకు వచ్చినా, ఇప్పుడిది వదిలి రాలేను. మన దేశం కోసం ప్రాణాలను ధార పొయ్యటానికి సిద్ధ పడిన త్యాగమూర్తులకు నేను చెయ్య గలిగిన సహాయం చెయ్యడంలో నా కెంతో

సంతృప్తి కలుగుతూంది. ఇట్లాంటి అవకాశం దొరికినందుకు నేనెంతో గర్విస్తున్నాను.

సెలవు, నీ

ఉష.

తేజ్‌పూర్.

15—10—62

డియర్ జానీ!

నా ఆనందాన్ని నీ కెలా వర్ణించనే! వరద గోదావరిలా, నా హృదయం, ఆనందంతో పరవళ్ళు తొక్కుతూంది. నా జన్మ వ్యర్థం కాలేదు. సార్థక మయింది. అసలు విషయం చెప్పకుండా సోది చెప్తున్నానని విసుక్కొంటున్నావా? అయితే విను.

గిరి ఇక్కడకు వచ్చాడు. ఒక్కరోజు ఉన్నాడు. ఆ ఒక్క రోజులోనే, నా జీవితానికంతకూ సరిపోయే ఆనందం కలిగించాడు. ఇన్నాళ్ళకు నేను గిరి హృదయంలో నాకు స్థానముందని గ్రహించాను. గిరి, తన నోటితో తను ఒప్పుకున్నాడావిషయము. అయినా తన ప్రాణ మిత్రుని భార్యగా మాత్రమే నన్నెప్పుడూ గౌరవిస్తానని చెప్పాడు. హరి, నేను లేకుండా బ్రతకలేడు కనక, హిందూసమాజంలో అవివాహితురాలైన స్త్రీ మసలటం కష్టం గనుక నన్ను హరిని పెళ్లిచేసికోమని బ్రతిమాలాడు. అందుకొరకే తను వచ్చినట్లు చెప్పాడు. ఈ జన్మలో తను నన్ను వివాహం చేసికోవటం అసంభవం, అని వ్యంగంగా ధృఢంగా చెప్పాడు.

అతని మాట మీద గౌరవంతో, బావ మీద జాలితో బావను పెళ్ళిచేసికొని అతనిని మనసార ప్రేమించ లేక పోయినా, భార్యగా నా కర్తవ్యం నెరవేర్చి, అతనిని సుఖ పెట్టాలనే నిశ్చయించుకున్నాను. బావకు ఉత్తరం వ్రాశాను. నా ఉద్యోగం వదలనని కూడా వ్రాశాను. ఉద్యోగం వదిలి తేనే గాని పెళ్ళి చేసికోనని బావ సమాధానం వ్రాశాడు. ఇంతలో ఉంది బావ ప్రేమ! పోనీలే బావకు నా మీద గాఢాను రాగమని ఇన్నాళ్ళూ ఎంతో ఆవేదన పడే దానిని. ఇప్పుడెంతో తేలికగా ఉంది. పెళ్ళి చేసికుంటే ఒకటే సంసారం. ఇప్పుడు దేశమంతా నా సంసారమే! గిరిని ధ్యానించుకుంటూ, జీవిత మంతా ఇలాగ గడిపేస్తాను. అన్ని అపార్థాలకూ, అతీతమైన వృద్ధాప్యంలో అతని సన్నిధికి చేరుకుంటాను. నన్ను స్వీక రిస్తాడనే నా నమ్మకం. ఆ సమయంకోసం నిరీక్షిస్తూ ఉంటాను

అల్లరి దుర్గ అప్పుడే తల్లి కాబోతుందా? నేనక్కడికి వస్తే పాపకి మంచి బహుమానాలు తెస్తానని చెప్పు. ఆరోగ్యం, జాగ్రత్తగా కాపాడుకోమని చెప్పు.

సాధారణ పరిస్థితులలో అక్కడికి రావటం పడదు. ఏదైనా అత్యవసర పరిస్థితి ఏర్పడితే నాకు టెలిగ్రాం ఇయ్యి.

బై. బై! నీ

ఉమ.

పార్కులో కూర్చుని ఉత్తరాలన్నీ చదివిన హరి వాటిని మడచి జేబులో పెట్టుకొన్నాడు. అక్కడి ప్రతి ఒక్కరూ తన ముఖంలోకి వింతగా చూడటం గమనించాక

కానీ హరికి తన కళ్ళ వెంబడి నీళ్ళు కారుతున్నాయని అర్థం కాలేదు. సిగ్గుపడి రుమాలుతో ముఖం తుడుచుకొని బయలు దేరాడు. అతని హృదయం క్షోభతో కుమిలి పోతూంది. అమాయకురాలిని దుర్గను తానెంత క్షోభ పెట్టాడు! ఎప్పుడూ ప్రాణానికి ప్రాణంగా ఉండే గిరిని ఎంత పొరపాటుగా అర్థం చేసికొన్నాడో? రెక్కలు కట్టుకుని వాలి, అతనిని గట్టిగా కౌగిలించుకోవాలనీ, క్షమాపణ చెప్పుకోవాలనీ, తహ తహ లాడ సాగింది హరి మనసు.

దుర్గ హరి ముఖం చూడగానే కంగారుగా "ఏమయిం దన్నయ్యా!" అంది. హరి దుర్గ చేతిని తన చేతిలోకి తీసికొని "నన్ను క్షమించు దుర్గా! వెర్రివాడినయి, నేను బాధపడిందే గాక నిన్నూ, గిరినీ కూడా క్షోభ పెట్టాను. నా కంటేకూడా గిరే, నీకు నిజమైన అన్న" అన్నాడు.

దుర్గ తేలికగా నిట్టూర్చింది. హరి చేతిని ఆప్యాయంగా నిమురుతూ "నీ మనసు నవనీతం అన్నయ్యా! ఒళ్ళు తెలి యని ఉద్రేకం లేకపోతే నువ్వు బంగారు తండ్రివి. జానకి అంతా చెప్పిందా?"

"అవును."

"నేనే చెప్దామను కున్నాను. కాని నువ్వు వినిపించు కొనేలాగ లేవు విధిలేక నోరు మూసుకున్నాను. ఒక్క నా విషయమేనా? ఇంకా చెప్పిందా?"

హరి బరువుగా నిట్టూర్చాడు.

"అన్ని సంగతులు తెలిసికొన్నాను." అన్నాడు.

దుర్గ జాలిగా అన్న చెయ్యి నిమురుతూ ఏదో అన బోయేటంతలో శంకర్ వచ్చాడు.

దుర్గ సంభ్రమంగా "గిరి ఏడీ?" అంది.

శంకర్ దిగాలుగా "రాలేదు. కొన్ని కారణాల వల్ల ఇక్కడకు రాకూడదని నిశ్చయించుకొన్నాడట. తన మనసులో మనమీద కోపమేమీ లేదట! తనెప్పుడూ మనసారా మన సుఖం కోరుతుంటాడట!—నీ ఆరోగ్యం జాగ్రత్త అని చెప్పాడు. ఎన్ని విధాల బ్రతిమాలినా, ఇక్కడకు రావటానికి మాత్రం ఒప్పుకోలేదు. విధిలేక వచ్చేశాను." అన్నాడు.

దుర్గ ముఖం మలిన మయింది. హరి ముఖం వంక చూపులు తిప్పింది. హరి లజ్జతో ముఖం దించుకొన్నాడు.

దుర్గ కన్నీళ్లతో "హరి అన్నయ్యా! మనకూ, గిరికీ ఋణం తీరిపోయేనా," అంది.

హరి చటుక్కున లేచి "దిగులు పడకు దుర్గా! గిరిని నేను తీసికొని రాగలను." అని అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

# 27

టేబిల్ మీద ఉత్తరం ఫేన్ గాలికి అల్లలాడుతూంటే గిరి మనసుకూడా గతంలో పరిభ్రమించింది. ఆ నాడు దుర్గ విషయంలో తనతో తగవు పెట్టుకుని వెళ్ళిపోయిన హరి మళ్ళీ తనతో మాట్లాడలేదు. ఎన్నో సార్లు తాను మాటలు కలపా లని ప్రయత్నించినా, మోటుగా ముఖం తప్పించి, వెళ్ళి పోయాడు.

ఇన్నాళ్ళకు ఈ ఉత్తరం. తనతో మాట్లాడవలసినంత అవసరమైన సంగతులేమొచ్చాయో హరికి ?

మనసు పరిపరి విధాల పోతుంటే, దడదడ లాడుతున్న గుండెలతో హరి ఇంట్లోకి ప్రవేశించాడు గిరి.

గిరిని చూడగానే హరి ఒక్క పరుగున వచ్చి గిరిని గాఢంగా కౌగిలించుకొన్నాడు. హరి కౌగిలిలో సమస్తమూ మరిచి, గిరికూడా హరిని ఆప్యాయంగా గుండెలకు హత్తుకొన్నాడు. ప్రాణ మిత్రులిద్దరూ, సమస్తమూ మరచి, ఒకరి కళ్ళలోకి ఒకరు సంతృప్తితో సంతోషంతో చూసుకున్నారు.

అంతలో గిరి తెలివి తెచ్చుకొని "హరీ! నువ్వెప్పుడూ నన్ను ఉక్కిరి బిక్కిరి చేస్తూనే ఉంటావు. మళ్ళీ ఏమొచ్చిందో చెప్పు" అన్నాడు.

హరి ముఖం చిట్లించి నవ్వుతున్న పెదిమలను పంటితో నొక్కి పట్టి "దుర్గ కొడుకుని కందని తెలిసీ ఇక్కడే కూర్చు న్నావా ? మేమంతా కానివాళ్ళమయి పోయామన్న మాట ! అన్నాడు. గిరి మొదట తెల్లబోయాడు. అంతలోనే అతని కంతా అర్థమయింది. వర్ణింప నలవికాని ఆనందంతో అతని కెక్కడలేని హుషారూ వచ్చింది. చేతులు జోడించి "ఈ దాసుడు తమ ఆజ్ఞకు సర్వదాబద్ధుడు" అన్నాడు.

"అయితే రైల్వే స్టేషనుకి పద !"

"చిత్తం ! ఏ ఊరికో అడగవచ్చా !"

"అవసరం లేదు—"

"సూటుకేసూ అదీ !"—

"నేనున్నానులేవోయ్ పద ! పద ! "

ఒకరి వెనుక ఒకరు వస్తున్న హరి, గిరిలను చూసి దుర్గ సంభ్రమంతో "గిరీ" అని కేక వేసింది. గిరి దుర్గ దగ్గరగా వచ్చి ఆమె తల నిమురుతూ "ఉద్రేక పడక విశ్రాంతి తీసికో !" అన్నాడు. దుర్గ కళ్ళనుండి జాలువారుతున్న ఆనందాశ్రువులను తన చేతులతో తుడిచాడు. ఆతని కళ్ళుకూడా చెమ్మగిల్లాయి. ఆప్యాయంగా "పిచ్చి పిల్లా !" అన్నాడు. శంకర్ చేతిని మృదువుగా ఊపుతూ "శంకర్ నీ ముక్కుకు కళ్లెం వేసేవాడూ, మా దుర్గకు అంగరక్షకుడూ జన్మించాడు. ఇంక ఆటలేం సాగవు. జాగ్రత్త" అన్నాడు.

దుర్గ అందుకుని "పాపం ఈయన ఆటలేం ఉన్నాయి గిరీ ! ఏదో ఆ మాత్రం బలహీనతలెవరిలోనైనా ఉంటాయి." అంది. గిరి పక పక నవ్వాడు.

"అబ్బో ! భర్తగారి వంటిమీద ఈగ వాలకూడదు. లెంపలేసుకుంటానులే దుర్గా ! "

చిన్న సూటుకేసు చేత్తో పుచ్చుకొని ఎంతో గాభరాతో అక్కడకు వచ్చిన ఉమను చూసి హరి తప్ప అందరూ ఆశ్చర్య పోయారు. ఉమ కూడా అంతే ఆశ్చర్యంగా అందరి వంకా చూసి సూట్ కేస్ క్రింద పారేసి, సోఫాలో కూలబడి "హమ్మయ్య ! అందరూ సుఖంగా ఉన్నారు. నాకు కాస్త మంచినీళ్ళియ్యండి ఎవరైనా ?" అంది.

శంకర్ గ్లాసుతో మంచి నీళ్ళందిచ్చాడు. గిరి ఆశ్చర్యంగా ఉమ వంకా, హరి వంకా చూడ సాగాడు. హరి పెద

వుల మీది కొంటె చిరునవ్వు అతనికేదో అనుమానాన్ని కలుగ జేసింది. గుండెలు దడ దడ కొట్టుకొన్నాయి.

తన ముఖానికి పట్టిన చెమటను జేబురుమాలుతో తుడుచుకొంటూ "అలా వైరిచ్చావేం బావా! ఏం కొంప మునిగిందోనని హడిలి పరుగెత్తుకొచ్చాను. ఎందుకిలాచేశావ్ ?" అంది ఉమ.

హరి నవ్వుతూ "కొంపలు మునిగాయి కనుకనే వైరిచ్చాను. ఈగిరి చూడు లేకపోతే—పెద్దపెద్ద త్యాగాలుచేసి గొప్పవాడై పోదామనుకొంటున్నాడు. నేనా, సాగనిచ్చేది?"

హరి మీసాలు మెలేసు కొన్నాడు.

గిరి ముఖం ఎఱ్ఱబడింది. "నేను త్యాగాలు ఏమీ చెయ్యలేదు, నా వస్తువు దేనినైనా వదులుకొంటేకదా, త్యాగం చెయ్యటానికి ? ఇక చేస్తే నువ్వు చెయ్యాలిప్పుడు గొప్పతనానికి."

"పోనీలేవోయ్ ! నేనే చేస్తాను త్యాగం! ఇలా రా ఉమా !" అంటూ అయోమయంగా నిల్చున్న ఉమను బలవంతంగా గిరి దగ్గిరకు లాక్కొచ్చి, ఆమె చేతిని గిరి చేతిలో పెట్టబోయాడు-గిరి వెంటనే తన చేతిని వెనక్కు లాక్కొని "నాటకం లోలాగ చెయ్యకు. ఇది నాకెంత మాత్రమూ ఇష్టం లేదు." అన్నాడు తీవ్రంగా.

హరి అంతకంటే తీవ్రంగా "ఇది నాటకం కాదు. నీ నాటకానికి భరతవాక్యం. మా మరదలిని అన్యాయం చేస్తే చూస్తూ ఊరుకొంటాననుకున్నావా ?" అన్నాడు.

గిరి ఆవేదనతో "నా మాట విను హరీ! నువ్వూ ఉమా భార్యా భర్తలయితే చూసి సంతోషించాలని కోరుకొంటున్నాను." అన్నాడు. హరి స్నేహ స్వరంతో "నేనూ సరిగ్గా అదే కోరుకుంటున్నాను గిరీ! నేనేదో త్యాగం చేస్తున్నాననుకోకు. ఉమ నా ప్రేమను అంగీకరించి ఉంటే ప్రపంచంలోని మరే విలువకోసరమైనా ఆమెను వదులుకొనే వాడిని కాదు. ఇప్పుడు నేను ఉమను చేసికొన్నా, మా ఇద్దరిలో ఎవరమూ సుఖ పడలేము. మీరైనా సుఖ పడండి. నన్నెప్పుడూ మీ స్నేహితుడిగా భావించండి." అన్నాడు. అతని కంఠం స్వల్పంగా గద్గదిక మయింది.

దుర్గ సంతృప్తిగా అందరి వంకా చూస్తూ "మీరంతా నావాళ్ళని అనుకోవటానికి గర్వంగా ఉంది. దేవతలు." అంది గిరి అడ్డుతగిలి. "దేవతలు అని మమ్మల్ని అవమానం చెయ్యకు. దేవతలంటే అసలు ఉద్వేగాలు లేనివాళ్ళు. కానీ, మాకు, ఈర్ష్యలూ, కోపాలూ, ద్వేషాలూ, ఆకర్షణలూ, ప్రలోభాలూ అన్నీ ఉన్నాయి. కానీ, మా బలహీనతలు, మేము గుర్తించ గలిగాం. వాటిని చక్క దిద్దుకోవటానికి ప్రయత్నించాం. మీరు అసలైన మానవులు అంటే మమ్మల్ని నిజంగా పొగిడిన దాని వవుతావు." అన్నాడు. శంకర్ "అయితే ఇక ఉమ తేజ్‌పూర్ వెళ్ళదా?" అన్నాడు. ఉమ వెంటనే "తప్పక వెళతాను" అంది,

శంకర్ గిరి వంక చూశాడు. గిరి నవ్వి "ఉమ ఇష్టానికి నేను అడ్డురాను." అన్నాడు.

శంకర్ ఆశ్చర్యంగా "ఇద్దరూ చెరొక చోటా..." అని మాటపూర్తి చెయ్యకముందే, గిరి అడ్డుతగిలి ఇద్దరమూ

చెరొక చోటా ఎందుకూ, నేనూ అక్కడికే వెడతాను.' అన్నాడు.

శంకర్ ఆశ్చర్యం మరింత అధిక మయింది.

"ఇక్కడ ఇంత మంచి ప్రాక్టీస్ వదులుకొని వెడతావా? ఆడదాని సంపాదనతో బ్రతుకుతావా ? "

గిరి నిరసనగా నవ్వాడు—

"నా భార్య చదువుకున్నది కావటానికీ, ఉద్యోగస్తు రాలు కావటానికీ, నాకభ్యంతరం, లేనప్పుడు ఆవిడ నాకంటే ఎక్కువ సంపాదిస్తే మాత్రం నేనెందుకు అభ్యంతర పెట్టాలి? మా మధ్య అనురాగ బంధం తప్ప ఎక్కువ తక్కువలు లేవు."

ఈ సమాధానం శంకర్ మనసుకు అంగీకారం కాక పోయినా, గిరితో వాదించలేక ఊరుకొన్నాడు.

తన భర్తతో బయలుదేరుతున్న ఉమకు వీడ్కోలివ్వ టానికి స్టేషన్‌కు వచ్చిన జానకి "ఉమా! నీ అంగీకారం లేకుండా నీ ఉత్తరాలన్నీ హరికి చూపించాను. మీ అందరి క్షేమమూ కోరి అలా చేశాను. క్షమించు." అంది.

ఉమ జానకిని కౌగిలించుకొని "నువ్వు నాకు మహోప కారం చేశావు. క్షమించటమేమిటి? ఎన్ని జన్మలకయినా నీ ఋణం తీర్చుకోలేను." అంది.

గిరి నవ్వుతూ "మీరింత వారని అనుకోలేదు" అన్నాడు.

జానకి గిరి వంక తిరిగి "గిరి గారూ! మీకందరికీ అనవసర మనస్తాపం కలిగించిన అన్నయ్య తరఫున నేను క్షమాపణ వేడుకుంటాను." అంది.

గిరి చిరునవ్వుతో "మన జీవితాలు సంపెంగ పొదల వంటివి. తీయని పరిమళాన్ని వెదజల్లే ఆ పుష్పాల మాటున ప్రచ్ఛన్నంగా కాల నాగులు కూడా ఆ వాసాన్ని కల్పించుకొంటాయి. మనసుల్ని పరవశింపజేసే ఆ దివ్య సుగంధాలతో పాటు ఒడలు జలదరింప చేసే ఆ విషవాయువులుకూడా మనం భరించక తప్పదు."

"జానకి గారూ! నేటి మన సమాజం అహమహమికతో ముందుకు పరుగెత్తుతూంది కానీ, ఈ పరుగు సమస్థాష్టవంగా లేదు. కొంత భాగం మరీ ముందుకు ఉంటే. కొంత మరీ వెనుకబడి ఉంది—ఒక నిర్దిష్టమైన క్రమంలో స్థిరమైన విలువలను ఏర్పరచుకొని మన సమాజంలో మనమంతా ఉక్కిరి బిక్కిరి అవుతున్నాం ఇందులో ఒకరిని ఒకరు నిందించుకోవలసింది కానీ. క్షమార్పణ కోరుకోవలసింది కానీ ఏమీ లేదు."

అవునన్నట్లు రైలు కూసింది. గిరీ, ఉమలు జానకి దగ్గర సెలవు తీసికొని పెట్టెలో ఎక్కి కూర్చున్నారు.

ఒకరి చూపులకు ఒకరు పరవశించి పోతున్న ఆ దంపతులను ఒక స్టేషను నుండి మరొక స్టేషనుకు చేర్చాలనే ఆత్రుతతో రైలు ముందుకు సాగింది.

సమాప్తి



**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA127B165 |
| పుస్తకం పేరు | సంపెంగ పొదలు |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 187 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | IV, VI, F, VIII |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | Bannu |
| స్కాన్ చేసినది | Prathyusha |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |